లక్ష్మీనరసింహారావు, పానుగంటి,
1865-1940

కంఠాభరణము : ఆఱంకముల నాటకము

కాకినాడ, 1926

Record no. 322

Lakṣmīnarasiṃharāvu, Pānugaṇṭi, 1865-1940

Kaṇṭhābharaṇamu : āṟaṅkamula nāṭakamu

Kākināḍa, 1926

Record no. 322

## Bibliographic Record Target

లక్ష్మీనరసింహరావు, పానుగంటి, 1865-1940.

కంఠాభరణము : ఆఱంకముల నాటకము / ఇది పానుగంటి లక్ష్మీనరసింహరావు పంతులుగారిచే రచియింపఁబడినది.- కాకినాడ : కందుల గోవిందం, 1926.

157 p. ;20 cm.

Record no. 322

Lakṣmīnarasiṃharāvu, Pānugaṇṭi, 1865-1940.

Kaṇṭhābharaṇamu : ār̲aṅkamula nāṭakamu / idi Pānugaṇṭi Lakṣmīnarasiṃharāvu pantulugāricē raciyimpam̐baḍinadi.- Kākināḍa : Kandula Gōvindaṃ, 1926.

157 p. ;20 cm.

Record no. 322

# కంఠాభరణము.

ఆఱంకముల నాటకము.





ఇది

పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారిచే

రచియింపఁబడినది.

ప్రకటనకర్త.

కందుల గోవిందం.

జనరల్ బుక్కుడిపో, బెజవాడ, కృష్ణాజిల్లా



కాకినాడ.

స్కేప్ అండ్ కో., కె. సుబ్బారాయుఁడు బ్రదర్సు వారివలన

ముద్రింపఁబడెను.

1926.

వెల రు 1—0—0.

# సుగ్రీవ పట్టాభిషేకము

[గ్రంథకర్త—సోమరాజు రామానుజరావుగారు.]

శూర్పణఖాభంగము మొదలుకొని, సుగ్రీవపట్టాభిషేకమువఱకు గల, కథను, ఒక్క రాత్రికి సరిపడు నాటకముగా నెట్లురచింపఁబడినదని యనేకులాశ్చర్య పడుచున్నారు. ఔను. నిజమే—కాని గ్రంథమును జదివినపిదప, నింత, రసవంత నాటకమును జూడలేదని యందఱు నానందము నందియున్నారు. ఇందుచక్కని పాటలు 40 కలవు. వీనిని శ్రీవల్లూరికౌస్తుభ భూషణరావు హార్మోనియస్టుగారు స్వరపరచిరి.

ఇఁక కథాభాగము.

పర్ణశాలయందుండఁగా చుప్పనాతివచ్చి రామలక్ష్మణులనుమోహించ లక్ష్మణుఁడామె ముక్కుచెవులఁగోయుట, (మిగులహాస్యరసము) శూర్పణఖవలపు, సౌందర్యవర్ణనము నవ్వుపుట్టించును. శూర్పణఖ రావణసభలో దనయవమానమును జెప్పుకొనుట—ఖరదూషణులు రామునిపైకరుగుట—రావణుడు సీతందెత్తునని ప్రతినబూనుట; విభీషణుఁడు వారించుట—ఇంద్రజిద్విభీషణుల వివాదము; ద్విజింహ్వప్రహస్తుల హాస్యము. (చదువఁదగినది) రాముఁడు ఖరదూషణుల వధించుట రావణుఁడు మారీచుని మాయలేడి వైపొమ్మనగా నాతఁడుసమ్మతింపకుండుట; రావణుఁడు మారీచునిచంపఁబోవుట; రాముని చేతనే చచ్చెదనని మారీచుడువెడలుట—సీతమాయలేడిని కోరఁగా రాముఁడామెను వెంబడించుట (రసవంతమగురంగము) మారీచుడు మరణకాలమున, సీతాలక్ష్మణాయని మరణింప నది రామకంఠస్వరమని సీతలక్ష్మణుని నిష్ఠురములాడి దూషించిపంపుట. రావణుఁడు సన్యాసివేషమునవచ్చి సీతంగొనిపోవుట. రామలక్ష్మణులు సీతావియోగమున మిగులదుఃఖించుట. (ఇదిచదువదగినది) జటాయువు రావణునితోఁబోరి కూలుట; రాముఁడు జటాయువున కగ్నిసంస్కారము చేయుట, సుగ్రీవునిపంపుట హనుమంతుఁడు రామలక్ష్మణులను శరణువేడుట. సుగ్రీవునకు రాముడు వాలినిచంపెదనని అభయదానము చేయుట, వాలితాగివచ్చి రుమతోఁగలయఁగోరుట; తారవచ్చి రుమను వాలిని దూషించుట తారసుగ్రీవవేషమునవచ్చి రుమనుగలియుచుండ వాలిచూచి సుగ్రీవభ్రాంతిని యుద్ధముచేయుట, తారవేషముతీసివేసి పరిహసించుట—సుగ్రీవుడు రాముని బలమును బరీక్షించుట—వాలిసుగ్రీవుల యుద్ధము. వాలిని రాముడు చెట్టుచాటునుండి చంపుట, సుగ్రీవ పట్టాభిషేకము—గొప్పనాటకము—చక్కని ముద్రణము. అనేకసార్లు ప్రదర్శింప బడినది.

వెల—1—0—0

వలయువారు,

కందులగోవిందం.

జనరల్ బుక్కుడిపో.

బెజవాడ.

విద్యాగరిష్ఠులు, కవితాభిమానులు, భాషాపరిపోషకులునగు మా ప్రభువువారికి, వారికుటుంబమునకుఁ బరమేశ్వరుఁడు దీర్ఘాయురారోగ్యములను, సకలైశ్వర్యసంపదలనిచ్చి రక్షించుఁగాక.

# ఈనాటకమునందు వచ్చుపాత్రలు

### పురుషులు

సోమావధానులు—కర్మఠుఁడగు ఛాందసంపు బ్రాహ్మణుఁడు.

వేంకటశాస్త్రి—సోమావధానులున్న యింటియాతఁడు.

రామశాస్త్రి—విద్వాంసుఁడు, పిచ్చివాఁడు.

ఎఱ్ఱయ్య—బండివాఁడు

కృష్ణరావు—మాధ్వుఁడు.

సుబ్బిసెట్టి—సాహుకారు.

వేంకటప్పయ్య—సుబ్బిసెట్టి గుమాస్తా.

శివయ్యశాస్త్రులు—సుబ్బిసెట్టిపురోహితుఁడు.

రాముఁడు<br>లక్ష్మణుఁడు } ఆశుకవులు.

శంకరశాస్త్రి—ఆయుర్వేదవైద్యుఁడు.

నవాబు—

రంగాచారి—నబాబువద్దగుమాస్తా.

శ్రీనివాసరావు—కృష్ణరావు మామగారు.

వాతాపిశాస్త్రి—ఒక బ్రాహ్మణుఁడు.

నబాబుపరివారము—జవానులు సాహేబులు.

తిత్తిగాఁడు, కొందఱుపౌరులు వచ్చెదరు.

### స్త్రీలు.

బంగారమ్మ—సోమావధానుల భార్య

సుబ్బలక్ష్మి—సోమావధానుల మఱఁదలు.

సుందరి—వేశ్య.

రుక్మిణి—శ్రీనివాసరావు కూఁతురు.



శ్రీ రామ

# కంఠాభరణము

### నాంది.

శా. దూరంబందు శుభంబులౌను, దొలుతన్ దోతెంచు బాధాళికిన్
భీరుత్వంబును దాల్చి సుశిక్షకుఁడు నావృత్తంబె తార్కాణగా
మీర లూహించుకొనంగవచ్చునని నన్ మిమ్ము న్బోధముఁజేయు నా
శ్రీరాముం డిటుగాక మీకు సకల శ్రీనీరుజాయుష్యముల్.

సూ—నటి నన్నుఁ "గంఠాభరణము, కంఠాభరణ" మని చిర కాలమునుండి వేఁపికొని తినుచున్నది. అది నాకిప్పుడీశ్వరుని పుణ్యమాయని కాసు ఖర్చు లేకుండ లబ్ధమైనది.

[నటి ప్రవేశించి]

నటి— వేఁపికొని తినుచున్నదని విసుగుకొనుచు నిచ్చినను సరే; యేదా కంఠాభరణము ?

సూ—(నవ్వుచు) నటీ ! అది సువర్ణముతోఁ జేసినది కాదు. సువర్ణములతోఁ జేసినది.

న—నేను మోసకత్తెనని యిఁక మీరు నన్ను చెప్పనక్కఱలేదు.

సూ—ప్రియురాలా ! అది యొక క్రొత్త నాటకము. మాకుఁ గృతపరిచయులై యనేక సరసనాటకరచనానిపుణులైన పానుగంటి లక్ష్మీనృసింహారావు పంతులుగారు దానిని వ్రాసినారు.

న—పోనిండార్యపుత్రా ! ఈ కంఠాభరణమే స్వీకరింతును. దాని ప్రదర్శనమువలన మీరొక్కరే సంతసింతురు గాని దీని ప్రదర్శనమువలనఁ బెక్కురు సంతసింతురు. నాటకస్వభావమెట్టిదో కొంచెము చెప్పరా !

సూ—హాస్యరసప్రధానమైన నాటకము.

న—ఆయన గ్రంథములన్నిటిలోను హాస్యోక్తులున్నవి. దీని యెక్కువయేమి ?

సూ—దీనిలో నెక్కువగా నున్నవి.

న—ప్రయోజనమేమి ?

సూ—ప్రయోజనము లేమియని యడుగుదు ? ప్రయోజనములు రెండు.

న—అవి యేవి ?

సూ—గీ. దుఃఖమయమైన లోకమందున జనించి
యుత్కటములగు చింతల నుండువారిఁ
గొంతసేపైన నవ్వించి కుందుఁ బాపు
రసవతంసంబుగద ! హాస్యరసముతన్వి !

న—రెండవది ?

సూ—సీ. ఛాందసాచార సంచయములఁ దమకును
నితరులకును శ్రమ మిచ్చువారి
ధర్మంబులను వీడి కర్మంబులఁ దొఱంగి
మనసువచ్చినయట్లు మలయువారి
దివ్యసంపూత సద్వర్తనము మాని
స్వైరిణీవృత్తిఁ జేపట్టువారి
నర్థమే యిఁక. పరమార్థంబు లోకమం
దనుకొని నగుఁబాటులందువారి
గీ. బయటఁబెట్టి, సుప్రహసన పాత్రములుగఁ
జేసి, బాగోగులను విభజించి చూపి
పరమదుష్టులకును నీతిఁ గఱపఁజాలు
రసవతంసంబుగద ! హాస్యరసము తన్వి !

న—మఱి యేమైన నుపయోగములున్నవా ?

సూ—అవి చాలును. సోమావధానివలె ఛాందససంభాషణముఁ జేయుదము. (ఇద్దరు నిష్క్రమింతురు.)



శ్రీ

# కంఠాభరణము

## ప్రథమాంకము.

ప్రవేశము—ఒక పట్టణములో నొకయిల్లు.

[ప్రవేశము—సోమావధానులు, బంగారమ్మ, సుబ్బలక్ష్మి, వేంకటశాస్త్రి]

సోమా—(నవ్వుచు) అహాహా ! మీనాటకపు వెఱ్ఱి చూడఁగా నవ్వువచ్చుచున్నది ! ఏమీ ! నాటకములోనికిఁ బోయెదమనుచున్నారా ? మీయబ్బనాఁడు, మీతాతనాఁడెప్పుడైన నట్లుజరిగెనని విని యుండిరా, మనయాచారమేమి ? మననిత్యకర్మమేమి ? మనయింటిలో నాఁడువారేమి, మగవారేమి వీధిగుమ్మము దాఁటి పదచలన మెప్పుడైన జేసిరా? ఇప్పుడు కర్మముజాలక యాత్రామార్గముగా నీపట్టణమునకు రావలసివచ్చినది. అంతేకాని మఱెప్పుడైన వీధిగుమ్మము దాఁటితిమా? ఎటువచ్చినను దివాణములో నాబ్దికములకైనఁ దప్పదుగదాయని వత్సరమునకు నాలుగుపర్యాయములు మాత్రము ! అంతే నీవు—నీవు చెదవేమి సుబ్బలక్ష్మినీవు—ఇదుగో—ఔనే ! నీవు—శివరాత్రి శివాయనములకుఁదప్ప మఱెప్పుడైనను వీధియరుఁగు దాటి పోవా ? ఇంతయెందులకు ? మహారాజుగారికోటలో నెన్నిశుభకార్యములైనవి? పట్టుమనియొక్కదానికైనను బైనుత్తరీయముధరించి బయలు దేరితివా ? అహాఁ— అంగవస్త్రము వేసుకోవలసినది, ఆబ్దికమునుఁ

గూరుచుండి యథావిధిగ—పూతికపుల్లయంత నార లేకుండ జరిగింప వలసినది. అంతేమనపని—దాని కాధ్యానముతోఁ బనిలేదు ?

వేంక—ఆహ్వానమని కాఁబోలు మీయభిప్రాయము ?

బంగా—ఓ! రెండు. జాము రాత్రివేళ నిప్పుడు తద్దినాలప్రశంస యెందులకు ? మిక్కిలి బాగుగా నుండునఁట ! ఓ ! ఇదుగో! ఓ ! మీమఱఁదలు సుబ్బలక్ష్మి చూడవలయునని యనుచున్నది. తలచెడిన దిమొదలు గుమ్మముదాటి యెఱుగదు. వేఁడుకవచ్చుచున్నది.

సోమా—తలయింకను జెడకుండ నున్నదానవు నీవుమాత్రము ! గుమ్మము దాటి యెఱుఁగుదువా ? మనయింటిలో మట్టునకు మహాలక్ష్మిసమానలకు, గంగాభాగీరథ సమానలకు భేదమన్నమాట నాచెవిని బడఁగూడదు. ఆ ! నాఘటములోఁ బ్రాణమున్నంతవఱకా నిష్ఠమాత్రము నిల్పుకొనఁగలను. అటుపైని బ్రహ్మశ్రీలుగంగాభాగీరథీసమానలైనసరే; గంగాభాగీరథీసమానలు సౌభాగ్యవతులైనను సరే.

సుబ్బ—అక్కా ! నామీఁదఁ బెట్టవద్దమ్మా ! నేనేచూడవలయునని దేవులాడుచుండ లేదమ్మా ! వేఁడుక నాకుమాత్రమేమి నీకు మాత్రము లేదా యేమి ?

బంగా—ఒక్క నీకూనాకే కాదమ్మా ! ఊరనున్న యమ్మలక్కలకందఱకును వేఁడుకగానే యున్నది. ఉండదా అమ్మా ! సాటి యాఁడుదివచ్చి యేవోమగవారు చేయలేని వింతపనులు చేయుచుండ నప్పుడు—ఈరోజున నామె గ్రామమునఁ బంచిపెట్టించిన కాగితమెంత విగానున్నదో వేంకటశాస్త్రీ ! నీవుచూడలేదా ?

వేంక—ఇదిగో ! ఎంతపెద్ద కాగితమో !

సోమా—నాగావంచా యింతకంటెఁ బెద్దది.

వేంక—అట్లుకాదు. ఈ కాగితములో నెన్నో పరమాద్భుతపు ంగతులున్నవి.



సోమా—నాగావంచాలో నెన్నో బొమ్మకమ్ములున్నవి. అదేమిమాట! కాగితంపుగొప్ప మఱెవరియొద్దనైనఁ జెప్పుముగాని నా యొద్దమాత్రము చెప్పకేమి! ఈదిక్కుమాలిన కాగితాలతో గ్రంథాలు చేయుటచేతనే సదాచారమునకుఁ జదువునకు దూరమని యక్షర శ్రీకారమునే పరిత్యజించినాను.

వేంక—అక్షరస్వీకారమయ్యా!

సోమా—కావచ్చును! ఏదియైన నెవరికిఁగావలయును. మన కెంతసేపును గావలసినది వైదికకర్మము—అగ్నికార్యము మఱి—ప్రాతిస్నానము—ప్రాయచ్ఛిత్వము.

వేంక—ప్రాతిస్నానము, ప్రాయశ్చిత్తమని మీయభిప్రాయము కాఁబోలును?

సోమా—వేంకటశాస్త్రీ ! నీవు పండితుఁడవు. నీదారివేఱు, మాదారివేఱు-నీకు మాకు నేతముపెట్టు. మారాజుగారొకదినమున నాస్థానంపుఁబండితులందఱు సేలువులు తలకుఁ జుట్టుకొని సభలోనికి రావలసినదని సెలవిచ్చిరి. నేను బండితుఁడనుగాను. శుద్ధకర్మయోగిని గదా ! సామాన్యంపుఁ బండితులతోఁ బాటు నేనేమని తలకు సేలువు చుట్టుకొనవలసినది! ఏమని తలకు సేలువు చుట్టుకొనవలసినదని పట్టుదలతో నాస్థానపుఁబండితుల నడుగఁగా వారిలోఁ దార్కికుఁడైన తిరు వేంకటాచార్యులుగారు అవధానులుగారూ! ఏమని చుట్టుకొనవలసినదని యింత మీమాంసతోఁ బనిలేదు. సీతారామాభ్యాన్నమః చుట్టుకోవలసినదని భక్తిగౌరవములతోఁ జెప్పినారు. తప్పుఁ గాదుగదా యని యాపద్ధతినే చుట్టుకొంటిని.

వేంక—పద్ధతియని సెలవీయఁదగును.

బంగా—ఓ. ఇదిగో! ఓఇటుచూడుఁడు.

సోమా—ఓసీ! ఇంటిదానా! ఇఁక నాటకములోనికి వెళ్ళుద మని చెప్పకు.

బంగా—అదినాటకము కాదు. దానిలో వేషములేవియు రావు. వేంకటశాస్త్రీ! దానిపేరేది ?

వేంక—దానిపేరు సర్కసు.

సోమా—శాస్త్రీ! సర్కసుశబ్ద మేభాషయని మీయభిప్రాయము?

వేంక—నాకు బాగుగాఁ దెలియదు.

సోమా—శబ్దసంబంధమైన రహస్యమొకటి చెప్పెదవినుము. ఏతినశబ్దమేదైననుసరే సంస్కృతమని నిశ్చయింపవలసినది. ఒక్కటే సూత్రము. దీనికిఁ దిరుగుమాత్రము లేదు.

వేంక—ఆలాగా? అట్టిశబ్దమున కర్థముమాట?

సోమా—అర్థమెప్పుడు ద్వితీయపక్షము. సృష్టికాలమందు బయలుదేరినది శబ్దబ్రహ్మముగాని యర్థబ్రహ్మము కాదు. శబ్దమన్నప్పుడు వేదము. వేదమున కర్థము లేనేలేదు, అందుచేతనే సర్వజాతులందు దానికి ఘనత.

బంగా—ఇదిగో! ఓ! మీరేవో మాటలుపెట్టుకొని కూరుచుండినారు. మాకు వేళయగుచున్నది. మనపొరుగువాఁడువారు మగవారుఁగూడ వెళ్ళినారు. మేముఁగూడ—

సోమా—ఔనే ! నీకు మతిలేదాయేమి? నీవక్కడకుఁబోయి చునదేమి?

బంగా—ఒక్కటియన్నమాటయేమి? ఎన్నోవింతలఁట. వేంకట ఆకాగితమొక్కసారి చదివి యాయనకు వినిపింపుము!

వేంక—(చదువుచు) అపురూపమైన భూలోకవినోదము.

సోమా—కాగితముమీఁదిది చదువుటకు నేనంగీకరింపను.



నాఘటముండఁగా నట్టియకార్యఖననము. జరుగఁగూడదు.

వేంక—అకార్యకరణమని సెలవిచ్చెదరు గాక.

బంగా—వేంకటశాస్త్రీ! పోనిమ్ము. ఇదిగో! ఓ! సర్కసులోనియామె తలపెండ్రికలకు తాయిఁగట్టుకొని యెత్తునఁట.

సోమా—మామేనత్తకోడలు గొంతునకుఁ బెద్దతాయిఁగట్టుకొని దిగినది—గోదావరిలో—విశేషమేమి?

సుబ్బ—బావగారూ! చాలులెండు. మీమాటలు మీరును—విశేషము లేదనుచున్నారేమి! లోకమంతయు నామెశక్తికి సంతోషించుచున్నది; మీకొక్కరికి వింతగాఁ దోఁచుటలేదు కాఁబోలు? ఆమెకుఁ బ్రజలు కనకవర్షముఁగురిపించుచున్నారు.

సోమ—సుబ్బలక్ష్మీ! నీశక్తిసిపెఱుఁగకుండనున్నావు. ఆతిరకాసులో నావిడ—

వేంక—తిరకాసుకాదండి—సర్కసు

సోమా—సుబ్బలక్ష్మీ! ఆఱుకుంచాలువారుగుండిగను గాడిప్రొయ్యిమీఁదినుండి యువలీల నెడమచేతితో నీవెన్నిసారులు సునాయాసముగా నీడ్వలేదు! ఆమెమీఁద నేదో ప్రజలు కనకవర్షముఁ గురిపించుచున్నారంటివే! నీమీఁద దేవతలు పుష్పవృష్టిఁగురిపింపవలసినది. నీకుఁదలపెండ్రికలునిలిచినవి కావు. కానిపెండ్రికకొక్కొక్కతాయి వ్రేలాడఁగట్టుకొని యొంటికాలిభరత మాడఁగలవు. వేంకటశాస్త్రీ! సుబ్బలక్ష్మినాకు మఱఁదలు, అనఁగ—మాయింటిదానికిఁ జెల్లెలు.

వేంక—మీరు మాయింటిలో బసచేసినరెండురోజులనుండియు నామాత్రమే తెలియకుంటి ననుకొంటిరా?

సోమా—ఈమె చిన్నతనములోని భవిష్యద్వృత్తాంతము నీవెఱుఁగనిది కాదా?

వేంక—పూర్వవృత్తాంతమని కాఁబోలు మీయభిప్రాయము.

సోమా—పూర్వమీవరమోవిను. దీనికిఁబదవయేట వివాహమైనది. వెంటనే దీనిభర్త చదువుకొనుటకై నవద్వీపమునకుఁ బోయినాఁడు. నాయొద్దఁ గర్మశాస్త్రము నేర్చుకోరా యని యెంతఁ జెప్పినను వినక పారిపోయినాఁడు. కొన్ని సంవత్సరము లుత్తరములు వ్రాసినాఁడు. తరువాత క్షేమసమాచారము లేదు. అతఁడు బయలుదేఱిన తరువాతఁ బండ్రెండుసంవత్సరములు నిరీక్షించినాను. ఇఁక నిరీక్షించుటకు ధర్మశాస్త్రమంగీకరింపదని నిశ్చయపఱచుకొని మాబావమఱఁదులు వద్దు వద్దనుచుండఁగనే—వారు విశేషప్రపంచజ్ఞానము గలవారు కారులెండు! కర్మప్రధానులునుగారు లెండు—ఈకుఱ్ఱదాని నొకదినమున రేవునొద్దకుఁ దీసికొనిపోయి—శుద్ధముగా—పరిశుద్ధముగ—యథావిధిగ—దగ్గఱఁ గూరుచుండి రెండుచేతులు పట్టుకొని స్వయముగా రోమఖండనముఁ జేయించి చడుక్కున నింటికిఁ దీసికొనివచ్చినాను.

వేంక—హరిహరీ! ఎంతపనిచేసినారు! అయ్యయ్యో! అదేమి?

సోమా—కర్మవిషయము వచ్చినప్పుడు మాయింటనొంట దయాదాక్షిణ్యములు లేవు. ఏకర్మ మెప్పుడు జరుగవలయునో, యేలాగున జరుగవలయునో సూచాలుతప్పకుండఁగా—

వేంక—తూచాలయ్యా! కాని యామెభర్త బ్రతికియే యున్నాఁడేమో?

బంగా—ఇంకను బ్రతుకేమి నాయనా! అన్నియుఁ దెల్లవాఱి పోయినవి. (అపవారించి) సుబ్బలక్ష్మీ! వేంకటశాస్త్రి నీవంకఁ జూచుచున్నాఁడు. నాలాగే కొంచెము కన్నులొత్తుకో అమ్మా! బాగుగా నుండదు.

సోమా—బ్రహ్మదేవుఁడిచ్చినయాయువుచే నతఁడు బ్రతికియున్నట్లే నిశ్చయపఱుపుము. అయిననేమి. ధర్మశాస్త్రముమాత్రమతఁడు బ్రదికియున్నట్లంగీకరింపదు. అతనికిమాసాబ్దశ్రాద్ధాదులన్నియు జరుగ



వలసినవే. ఈవేళనుండియా? ఇదివఱకాఱు సంవత్సరములనుండి జరుగుచున్నవి.

వేంక—అబ్బ! కర్మమనఁగ మీకెంతనియమము! ఎంతపట్టు! నేను మీవంటివానిని జూడలేదు.

సోమా—మఱొకఁడేఁడీ! వేంకటశాస్త్రీ! ఇప్పటికి మావంశ మొక్కటిమాత్రమీకర్మభూమి కంతకును మేటికిరీటములవలె నిలిచియున్నది.

వేంక—(తనలో) ఈనిర్భాగ్యవంశము నశించుటయే లోకోపకారము.

సోమా—నేను బొరుగూర నుండుటచేత నావిశేషము మీకుఁ దెలియదు. కాని, మా నాఁడునాఁడు యావత్తు నన్ను పరదేవతయని పిలుతురు. నేను గర్మవిషయమై చేసిన మఱియొక యేర్పాటు వినుము: మీయాఁడువారెవ్వరు లేకపోవుటచే మీయిల్లంతయు మాస్వాధీనత లోనే యుంచినను—ఇటులంటినని నీవన్యథా యెంచవలదు—మాకు మాత్రము మిక్కిలి యిబ్బఱికముగాను, నందుబాటు లేనట్లుగాను, నదేమీకన్నులకు నిండులేనట్లుగాను నున్నది.

వేంక—ఎందుచేత?

సోమా—మాయింటి యేర్పాటువేఱు. అదిచక్కఁగా-శుద్ధముగా—శుచిగా—ఎక్కడికక్కడకుఁ దగినయంగుళ్లోఁ జిన్నకుఁ జిన్నగాకుండ, బెద్దకుఁ బెద్దగాకుండఁ గట్టించినాను. దానిలో నగ్నిహోత్రగృహమువేఱు—స్నానపుగదివేఱు—ప్రాయశ్చిత్తాది మీమాంసములు వచ్చినప్పుడు ధర్మశాస్త్రముచదువకుండ సిద్ధాంతపూర్వపక్ష్యములు చేయుటకొక సావడి—

వేంక—మీమాంసలు—సిద్ధాంతపూర్వపక్షములని సెలవీయఁదగును.

సోమా——ఇంతేకాక——పదిమంది పిల్లలు గలవాఁడనుగదా! ఏవో కష్టములువచ్చుట మానవవికృతికదా యని గ్రహించి——

వేంక——మానవప్రకృతియని ప్రవచింపవలయును.

సోమా——ఏమో, ఎటుఁబోయి యెటువచ్చునోయని రోగగృహ మొకటి యింటికిఁ గొంతదూరముగాఁగట్టించినాను.

వేంక——అయ్యయ్యో! పిల్లలకు రోగమురాఁగానే దానిలోఁ బడవైచుటకా?

సోమా——పిల్లలకేమి, పెద్దలకేమి! మాలోఁ జిన్నపెద్ద తాత్పర్యములు లేవు.

వేంక——చిన్న పెద్ద తారతమ్యములని సెలవిచ్చుచున్నారు కాబోలు.

సోమా——ఇదిగాక——ఇంటికినలుగురుకోడండ్రు, నలుగురాఁడు పడుచులున్నారా? వీరిలో నెవరికైనఁ దల చెడుటసిద్ధించునెడల నాపరామర్శంపుదినములలోఁ దలదాఁచుకొనుటకుఁగాను, ప్రచ్ఛన్నముగాఁ గూరుచుండి, చీకాకు లేకుండ, సావకాశముగానోదార్పుమాటలు వినుటకుఁగాను, నెనమండ్రకు నెనిమిది చిన్నకొట్టులును నెవరిపేరుమీఁదుగావారికిఁ——దరువాతఁ దగవులేకుండఁ——గట్టించినాను.

వేంక——(గుండెలుకొట్టుకొనుచు)అయ్యో!అయ్యో అదేమి!అదేమి ఇందఱుగృహస్థులను జూచితినిగాని యెవ్వరు నిట్టియేర్పాటులు చేసిరని వినియుండలేదే! ఎక్కడలేని వింతపద్ధతి మీకెందులకు? పోనిండు. ఏదో చేసినారు. అందఱకు నొక్కసారియే వైధవ్యమువచ్చునా? పోనీ. ఒకకొట్టు చాలదా?

సోమా——వేంకటశాస్త్రీ! అన్నియు నెఱిఁగియుండియు నటులనెదవేల? జంఘమరణములని నీవు వినియుండలేదా?

వేంక——సంఘమరణములా!



సోమా——అవును. కర్మము యథావిధిగజరుపుట కెంతదూరదృష్టి యుండవలయు ననుకొన్నావు? తీరాజందెమపసవ్యము జేసికోవలసి వచ్చినప్పుడద్దే యుద్దేయని తొందరపడకుండ గదులుసిద్ధముగా నుండినఁ గర్మాచరణమున కెంతసులువు! అట్టి యట్టి యందిపుచ్చుకొన్నట్టేకర్మమునకాకర్మమున కపరసామగ్రియంతయు సిద్ధముగా నున్నయెడల మనస్సున కెంతనిండు! మామిడితోరణము కట్టుకొనుట కెవ్వరైననిల్లిచ్చెదరుగాని దర్భశయ్య కెవరైన నిచ్చెదరా? ఇల్లుగట్టుకొనుట కర్మమునకుఁగాని కాపురమునకుఁ గాదని నిశ్చయముగా నమ్మవలెను.

వేంక——ఇన్ని శ్రాద్ధపుగదులు లేవనియా మాయిల్లు మీకు మిక్కిలి రోఁతగానున్నదని చెప్పినారు? మీరింతవారని నేనెఱుఁగను. ఎఱిఁగియుండినయెడల మీకు మాయింట బసనిచ్చి యింత శ్రమము గలిగించియుండను. అయ్యో! మీకుఁ బుట్టినవారందఱు క్షేమముగా నున్నారా?

సోమా——లేరు——వచ్చినచిక్కేయది. సంతానసృష్టి యెంతయైన నున్నది. నలుగురు కొడుకులకు నొక్కకొడుకున్నాఁడు!

వేంక——కోడండ్రకుఁగట్టించిన పరామర్శంపుగదులలో నాల్గింటికి మాఁసపూర్తియైనవా? ఒక్కటిమాత్రమేనా యింకఁదరువాయి?

సోమా——ఇప్పటివఱకంతే.

వేంక——అనఁగూడదు. కాని యెంతపనిచేసితిరి. పిల్లవానికిరోగ మారంభింపఁగానే వేఱుగా దూరముననున్నకొట్టులలో దర్భశయ్యపై వానినిబడవైచునప్పుడు వాఁడుకడుపుపగిలిచావఁడా? ముందెప్పుడో ముండమోయుకోడండ్రకొఱకిప్పుడు మొగముచూచుకొట్టుకట్టించినతరువాతఁ గొడుకునిర్భాగ్యంపుముండకొడుకులింక బ్రదుకుదురా? ఇంక నొక్కఁడైన నెందులకు మిగిలెనేయని యోజించుచున్నాను. అయ్యో! నలుగురు కూఁతులు భర్తలతోఁ గాపురములు చేయుచున్నారా?

సోమా — ఏమి చెప్పుదును? వారందఱిల్లు పట్టినారు.

వేంక — అయినదా? వారినాలుగుగదులు వారికొప్పఁజెప్పినారా? అయ్యో! మఱియొకసంగతి యడుగుట మఱచితిని. మీభార్యకుఁ గూడ నొకకొట్టేల కట్టింపలేదు?

సోమా — మాయింటిదానికి మాంగళ్యవ్యచ్ఛిత్తి లేదని మాతండ్రిగారు సెలవిచ్చినారు?

వేంక — మాంగళ్యవిచ్ఛిత్తి యనికాఁబోలు మీయభిప్రాయము?

సోమా — ఆ. అదినాచేతిమీఁదుగా వెళ్ళవలసినదే. అదృష్టవంతురాలు.

వేంక — అందుచేతనా యామెకుఁ బరామర్శపుగది లేకపోయినది ?

సోమా — అది లేకపోయినప్పటికి, దానికిఁబ్రతినిధిగ మఱియొకపంచిణితో వేఱొకచిన్నకొట్టు కట్టించియే యుంచినానుగాని యుపేక్షతో మాత్ర మూరకుండలేదు.

వేంక — ఆఁ. అదెందులకు?

సోమా — కర్మయొక్కరీతిగా రాదు. అందులో జందెము మార్చుకొను కర్మమున్నదే — అది పలురాకడలుగావచ్చును. ఆ రాకడల ననుసరించి మనబుద్ధికిఁ గల్పనముండవలెను. తెలిసినదా?

వేంక — పట్టియడవి — అధ్వాన్నము — నాకేమియు బోధపడలేదు.

సోమా — మనుష్యబుద్ధులు కేవలము చపలములు. అందులో స్త్రీలబుద్ధులు బొత్తిగాఁ జపలములు. ఇంతకాలము నాభార్య నాతోఁ గాపురముచేసినది గదా; ఇఁక ముందుమాత్ర మిందులకుఁ జేయదు ? అని ధైర్యముగా నుండుటకవకాశము లేదు.

బంగా — ఇదిగో! ఓ! చాలులెండు ! మీమాటలుమీరు!

సోమా — నీయొక్కదాని మాట చెప్పలేదు. లోకమందలి



యందఱుస్త్రీలకు వర్తించునట్టి వ్యతిరేకసూత్రము చెప్పినాను గాని సామాన్యసూత్రము చెప్పలేదు.

వేంక — సామాన్యసూత్రము చెప్పినానని మీయభిప్రాయము కాఁబోలును.

సోమా — ఏమో! ఏపగలో యేరాత్రియో యెట్లుబుద్ధిపుట్టునో యెవ్వఁడు చెప్పఁగలఁడు? ఉన్నట్లేయుండి చల్లచల్లఁగమాయింటిది యిల్లువిడిచి లేచిపోగూడదా? అప్పుడుతొందరలోఁ గాళ్లుచేతులువిఱుగఁద్రొక్కుకొనుటకంటె —

బంగా — ఇదిగో! ఓ! చాలులెండు. నేర్చుకొనిపోయినారు!

సోమా — నీవు బుద్ధిపూర్వకముగా లేచిపోవనని నిశ్చయపఱుపుము. దొంగలువచ్చి నిన్నెత్తుకొనిపోఁగూడదా? వెంకటశాస్త్రీ! ఆమె యేకారణముచేతనైనఁ బరాధీనయైనప్పుడు వెంటనే నేను ఘటశ్రాద్ధము చేసికొనవలసి యుండునుగదా? అందుకొఱ కొకచిన్న పాక — దొడ్డిలోఁ గొంచెము దూరముగ — వేయించి దానికొకచిన్న తలుపు తాళంపుటంగు చేయించినాను. ఇఁకనిశ్చింత. ఆవిడయట్టె పైకిగాలుపెట్టునరి కిట్టె నేను పాకలోనడుగుబెట్టి తీఱికగా — యథావిధిగా — మనస్సునకు సంతుష్టిగా — ఘటశ్రాద్ధపుఁ దంతు నాచరించుకొనవచ్చునుగదా?

వేంక — హరి హరీ! లోకవిరుద్ధస్వరూపులగు మీరు శ్రాద్ధపురుషులవలె నవతరించినారు.

బంగా — ఇదిగో! ఓ! చేసిననేదో చేసినారు. అంతటితో నూరకుండరాదా? ఈప్రజ్ఞ లోకమున కంతకుఁ జాటవలయునా యేమి?

సోమా — ఔనే! నీకుఁ దెలియదు. పూర్వకర్మములలో నొకటిరెండుకృత్యములకు మాత్రమే గోడచాటువ్యాపారము కాని యపరకర్మముల కన్నిఁటికిని బట్టబయలే.

వేంక — కర్మములోఁగల్పన ముండవలయు నని యిది వఱకుఁ జెప్పితిరి. మీరుచేసిన క్రొత్తకల్పన మిదియా?

సోమా—కాదా మఱి; కవిత్వములోఁ గల్పనము విశేషము కాదు—గానములోఁ గల్పనము విశేషము కాదు— కర్మములోఁ గట్టుదిట్టమైన కల్పనముండుట ఘనత—ఇది నాఁనాడు కలిగిన నూతనాప్రతిష్ఠ.

వేంక—ఇంకను సందేహమా! నాయనా!

సోమా—శాస్త్రీ, తలఁదాఁపుడుకొట్లు సామాన్యకర్మనిష్ఠుల యిండ్లలోఁగూడ నుండవచ్చును. ఘటశ్రాద్ధభణ్ణ కుటీరముమాత్రము- ఏదీ—మఱియొక యింటిలో ఆసేతుహిమాచలపర్యంతము—

వేంక—మీ వాగ్దోషములు దిద్దలేక చచ్చుచున్నాను. మీ యిష్టమువచ్చినట్లు మాటలాడుకొనుఁడు. నేను పోయి పండుకొందును. సెలవిండు.

సోమా—శాస్త్రీ! ఉండవోయి! నేనుగూడవచ్చెదను. మనకర్మవ్యాసమును వినుచు, మాయింటి యామె, మఱఁదలు నాటకప్రశంస మానినారు.

బంగా—మేము ముఖ్యముగా వెళ్లెదము, కాని యది నాటకముగాదని మీకెన్నిమాఱులు చెప్పినను నమ్మకము లేదేమి?

సోమా—నాటకాలంకార సాహిత్యము మావంటిశిష్టాచారవిపన్నులకుఁ దగదనిమానివేసినంతమాత్రముచేత నాటకమేదో యెఱుఁగనివాఁడ నగుదునా? పురుషులు స్త్రీలు నొకపాకలోఁ జేరి రాత్రివేళఁ జూచువారియెదుట గ్రంథ మెవ్వఁడు వినిపించి తెయితక్కలాడుదురో యది నాటకముకంటె నెన్నఁడు భిన్నము కాదు. నాటకములోగాయకులుందురు; నటకులుందురు. నాటక మెవ్వఁడో యొకకవిచేయవలసినది గదా! కవులు, నటకులు, గాయకులు, పంక్తిబాహ్యులు. వారిముఖము చూచునరికి సచేలస్నాన మాచరింపవలయును. కవి యెప్పుడు భ్రష్టుఁడైనాఁడో యతనిగ్రంథ మప్పుడే బహిష్కారయోగ్యమన్నమాట.



ఇప్పుడింకను దెలుఁగుమీఱుటచే నంతపట్టుదల లేదు గానిమానాయనగారి చిన్నతనములోఁ గవి యెవ్వఁడైన గ్రామములోనికి వచ్చునరికి పిచ్చికుక్కనుగొట్టినట్లు కొట్టువారఁట!

వేంక—ఈగొడవకేమి? మనవారికిఁ జూడవలయునని కుతూహలముగా నున్నది కాఁబోలు? వెళ్ళనిండు! అది మీరనుకొనినట్లు నాటకము కాదు. దరువులు తాండవములు లేవు నటకులు దానిలో నెవ్వరు లేరు. అది కవిరచియించిన గ్రంథము కాదు.

బంగా—వేంకటశాస్త్రీ! నీవాయనకు బాగుగ నచ్చఁజెప్పుము. అక్కడ దాదినమ్మవేషమో, చెంచులక్ష్మివేషమో వచ్చుననియుఁ, దెయ్యమని యాడుననియు ననుకొనుచున్నారు కాఁబోలు. ఒక్కసారి యాపెద్ద కాగితముచూచి యాసర్కసులో నావిడచేయు రెండవపని యేదో కొంచెము స్పష్టముగాఁ జెప్పు.

సుబ్బ—మొదటిపనికి మెప్పింత ముద్దులైనది!—ఇఁక రెండవది—చాలు.

వేంక—మూఁడువందల పౌనులుబరువుగలపెద్దరాతినివక్షఃప్రదేశమున నామెవహించి దానిపై రెండుసమ్మెటలతోఁగొట్టించుకొనునఁట.

బంగా—అబ్బా! ఎంతగొప్పపనియో ? అంతరాతినామె యెట్లుమోయునో? దానిపైని కంగు కంగుమని గొడ్డళ్ళతోఁ గొట్టఁగా నెట్లు సహించుకొనునో? అమ్మయ్యో? ఆమె యెంతగొప్పయిల్లాలో.

సోమా—ఆమెకంటె గొప్పయిల్లాలవునీవు. ప్రాణహీనమైరసహీనమైనదిక్కుమాలినరాతిని గుండెపైఁబెట్టుకొని కంగుకంగుమని కొట్టించుకొనునామెకంటె భీమగజములవంటికవలపిల్లలను గడుపుపైఁబెట్టుకొని జువురుజువురుమని పాలు గుడువఁజేసిన నీవుమహాఘనురాలవు. ఆపిల్లలు మనకు దక్కలేదు. దానికేమి? ఇల్లాలిఘనత పిల్లలను గడుపునధరించి భరించుటలోనున్నది. కాని గుండెపైగుండ్రాలెత్తుకొని మొ

త్రించుకొనుటలో లేదు. వేంకటశాస్త్రీ! ఇదియేమయ్యా! యుగమే మారిపోయినట్లు కనఁబడుచున్నదేమయ్యా! నిక్షేపములాగున జెంగావిచీరఁ గట్టుకొని, నల్లని అవికఁదొడిగికొని ఋషికన్యలాగున బరిశుద్ధముగఁ బితృదేవతలప్రీతికొఱకుఁ గారెలనిమిత్తమై యుబ్బుకోట మినుపపప్పు పసందుగా రుబ్బవలసిన యీఁడుది రుబ్బుపొత్రముతోఁ దలఁ బగులగొట్టుకొనుట యెందులకయ్యా! ఇది కాంతాధర్మమనియా? ఖ్యాతియనియా? గౌరవమనియా?

వేంక—అవధానులుగారూ! ఖ్యాతిగౌరవముల కెక్కడికి? మీఖ్యాతిమీది. ఆమె ఖ్యాతి యామెది. పెదుళ్ళు ముందు ప్రియమే యగునో, కట్టు నిక్కచ్చిగా నుండునో యుండదో, యప్పటికేమి తోఁచ దరకలుగునో, యనియెంచియిప్పుడే యింటిలో నొక్కొక్క మనుష్యుని కొక్కొక్కకటుకుచొప్పున నలితొలి లేకుండఁ గట్టించి యావశ్యకమగునప్పుడు సుఖముగా నుపయోగించుకొనవచ్చునని వాని నింటియటుకల మీఁదదాఁచిపెట్టు నంత్యకర్మమూర్తులగు మీకంటె నామెయే లోకమునకెక్కువయుపకృతిని జేయుచున్నదని నాయభిప్రాయము. స్త్రీలు దృఢశరీరిణులై యుండవలయుననియు, యోగాభ్యాసముచే బుద్ధినిశ్చలత్వముగలవారై యుండవలయుననియు, ఇష్టమున్నవారు బ్రహ్మచర్యవ్రతదీక్ష నవలంబించి పవిత్రస్వరూపిణులై యుండవచ్చుననియు నామె స్వచారిత్రమున బోధించుచున్నది.

సోమా—అబ్బా! బ్రహ్మచర్యవ్రతదీక్షయని యెంతలఘువుగాఁ జెప్పినావు! ఆదీక్ష స్త్రీలకుండుట కవకాశము లేదని నేను ఘంటాఘోషముగాఁ జెప్పఁగలను.

వేంక—అట్లు సెలవిచ్చుచున్నారేమి? వేదకాలమందలి స్త్రీలు మహాయోగినులై బ్రహ్మచారిణీశిఖామణులై యున్నట్లువినుచుండుట లేదా?



సోమా—అది యెవఁడెఱిఁగినమాట? వేదములకర్థము లేనప్పుడా కాలమందలి స్త్రీలిట్టివారని యెవరికిఁ దెలియును? నేనొక్కటే యుక్తి జెప్పెదను. బ్రహ్మచారికిఁ గౌపీనముండవలయును. ఉండితీరవలయును. స్త్రీకిఁ గౌపీనార్హత యెచ్చటనున్నదో చెప్పు? కుండలఖండితమైన యీచెవికదపా. మొలత్రాటికర్హత యున్నప్పుడు కౌపీనమున కర్హతయుండును. అది లేనప్పుడిది లేదు. అందుబ్రహ్మచర్యము స్త్రీకి లేదు. ఉండవలసిన బ్రహ్మచర్యము పురుషులలోనే యెక్కడను లేదు. ఒక్కమాయింటఁదప్ప—శాస్త్రీ! నాకు గంపెడు పిల్లలున్నారా! బ్రహ్మచర్యవ్రత మేమాత్రమును చెడగనీయకుండ నిందఱు పిల్లలను గంటిని.

వేంక—అదేమి! అదేమి! అట్లనుచున్నారేల!

సోమా—నానిత్యకర్మచమత్కారమదే. వృషఃకాలపూర్వము లేచి విధులునిర్వర్తించుకొని యగ్నిహోత్రశాలలోఁ గూర్చుండి—అది తపస్సను—సమాధియను— యజ్ఞమను—బ్రహ్మనిష్ఠయను—నీయిష్టము—తిరుగ మూఁడుజాములైనతరువాత లేచి దేహధారణకెంత యావశ్యకమో యంతియేభుజించి మఱల నగ్నిశాలలోనికివచ్చి దర్భలు తండులములు, తిలలు, మొదలైనవానిని జూచుకొనుచుఁ బంచాత్తు రిస్మరించుచుఁగూరుచుందును. సాయాహ్నము కాఁగానే, తిరుగ నగ్నికార్యమారంభించి రెండుయామములకుఁబూర్తి జేయుదును. రాత్రిభోజనము లేదు. ఆఁకలియగునెడల సుబ్బలక్ష్మికిఁ జేసినరొట్టెముక్కకొంత ఫలహారముజేసి శివోహంశివోహమ్మనుకొనుచు నగ్నిశాలలోని దర్భశయ్యపయి నడుమువాల్చి యట్టె కన్నుమూసియిట్టెవృషఃకాలమున లేతును.

ఇది నాకునిత్యవిధి. ఈచర్యలో బ్రహ్మచర్యవ్రతమునకు భంగముగలుగుట కవకాశమేమున్నదో చెప్పు.

వేంక—ఏమియును లేదు. కాని, కాని,

సోమా—నీకు సందేహమున్న యెడల నేను జెప్పిన దినచర్యలో నేమైన భేదమున్నదేమో, యదిగో మాయింటిదానిన డుగు!

వేంక—ఆమె నడుగుటయేల ? మిమ్మే యడుగుదును. ఇట్టిమీకు సంతానము మాట!

సోమా—అటులడుగుము. మాయింటిది ఋతుస్నాతయై మడి బట్టఁ గట్టుకొని మంచిముహూర్తమున రాత్రివేళ విభూతిపండ్లు దూర్వాలు గోమయము పళ్ళెరములో నుంచుకొని సంతానాపేక్షచే ముసిముసి నవ్వులు నవ్వుకొనుచు నాయెదుట నిలువంబడును. ఓహో! అభిప్రాయమిదిగదా యని దివ్యదష్టిచే గ్రహించి యామెకుఁ బ్రసన్నుఁడనై యిట్టె యాదరించి యట్టె యాశీర్వదించి పంపివేయుదును. చటుక్కున సద్యోగర్భము. ఇంతే యిందులోనున్న కర్మరహస్యము. ఇంతే మా సంతానంపుఁ గిటుకు. ఇట్లు పూర్వయుగములలో జరిగినది. ఆయనగాచానము నే యిప్పటివఱకు లాగుకొని వచ్చుచున్నాను. ఇన్ని మాటలేల ? వాల్మీకిమహర్షి యొద్దకు ఋతుస్నాతలై యంబికాంబాలికలు పోయినప్పుడు వాలిసుగ్రీవులను బ్రసాదించి యామహర్షి యాదవకులము నుద్ధరించినట్లు నేను మావంశము నీతీరుగా నిలువఁబెట్టినాను.

వేంక—అదేమి! అదేమి! భారతము భాగవతము రామాయణము మూఁడును గట్టగట్టి ఓఁటఁబొడిచి రసముదీసితిరే!

సోమా—అగ్నికార్యము చేతిలోనున్నవాని కన్నిపురాణములుగూడ దగ్ధపటల న్యాయము.

సుబ్బ—(అపవారించి) అక్కా! మనకు వేళయైపోవుచున్నది. ఈరాత్రి తప్పకుండఁ బోవలయును.

బంగా—ఇదిగో! ఓః మామాట నేమిచెప్పినారు ?

సోమా—అక్కచెల్లెండ్రిద్దఱు, శంకరా యని సుఖముగాఁ బం



చసాళిలోఁ బండుకొనుఁడు. వెంకటశాస్త్రీ! నేనుబోయి యగ్నిగదిలో నడుము వాల్తును.

వేంక—చిత్తము, నేనుబోయి నాగదిలోఁ బండుకొందును.

(సోమావధాని వేంకటశాస్త్రియు నిష్క్రమింతురు)

బంగా—చూచితివా! ఎంతఁజెప్పిన నొప్పుకొనలేదు.

సుబ్బ—పోనీ. నేనొక్కతెను బోవుదును.

బంగా—అయ్యయ్యో! నీవొక్కతెవు పోయినయెడల నింకే మైననున్నదా? అడుగనక్కఱలేదు!

సుబ్బ—తప్పేమియు లేదు, చెప్పకుండ వెళ్ళితివేమని నామగఁడు నన్నుఁదిట్టునా కొట్టునా?

బంగా—అయిన నేమి? ఒక్కతెవు వెళ్ళుట భయము కాదటే !

సుబ్బ—నాయొద్దనున్న రత్నాలనగలన్నియు దొంగలు తీసికొని పోవుదురని భయమా యేమి ? తలయెప్పుడు నున్ననైనదో గుండె యప్పుడే జాయియైనది. నెత్తికి ముసుఁగెప్పుడు వచ్చినదో మనస్సునకు బెదురప్పుడే వదలినది, నావంటి ముండిఘటమునకు భయమేమి? సందేహమేమి ? లేనిసుఖము లేనేలేదుగదా—కంటితో గలియుగములోని చిత్రములను జూచుటకునైన నోఁచకుంటినా ? నేను బోవక తప్పదు. నీవుపోయి పండుకొనుము.

బంగా—ఏమే యింత వెఱ్ఱిపట్టు ! ఆడేరా యేమూలనున్నదో యెఱుఁగము. పోవలసిన వారందఱు బోయినారు. ఒక్కతెవు ఎక్కడ కెట్లుపోవుదువు? బండియెక్కి పోవుదువన్నఁ జట్టుపట్టుల బండియే లేదయ్యెను; ఒకవేళ బోవుదువనుకొనుము. తిరిగివచ్చునప్పుడు నీకీయిల్లెట్లు తెలియును? మనగ్రామము కాదుగదా. ఈ వేంకటశాస్త్రియైనను దెలివి, తేట, పేరు, ప్రఖ్యాతి లేనివాఁడు. నీవు తిరుగ నిక్కడ కెట్లు రాఁగలవు?

సుబ్బ.—అనేకజనము తిరుగ వచ్చుచుందురు. వారితో వచ్చెదను. ఈ యింటిపొరుగుననున్న సాతానిచూడమ్మ నిన్న మనయింటికి నిప్పునకొఱకు వచ్చినదే; ఆమె సర్కసులోనికి వెళ్ళుట చూచినాను ఆమెను డేరాలోనే వెదకిచూచి యామెయు నేనునుగలసి వత్తుము. భయములేదులే.

బంగా.—ఆమెనీకుఁ గనఁబడునని యేమినమ్మకము? ఆమె యెక్కడికిఁ బోయెనో? ఇంతయూర నీకీయిల్లానవాలెట్లు తెలియఁగలదే?

సుబ్బ.—విఘ్నేశ్వరుని గుడి కెదురుగానని యెఱుఁగనా?

బంగా.—ఇట్టి విఘ్నేశ్వరుని గుళ్ళెన్ని యీపట్టణమందున్నవో?

సుబ్బ.—నాకిన్ని చెప్పకు. నేను బోయెదను.

బంగా.—సుబ్బలక్ష్మి! ఆఁగు. ఒక్కమాట జెప్పెదను. నీవొక్కతెవు వెళ్లుటకు నేనంగీకరింపను. ఏమైనసరే; మనమిద్దఱముపోవుదము. మీబావగారికిఁగొంచెము నిద్దురపట్టినతరువాత దప్పకుండఁబోవుదము.

సుబ్బ.—నీమగఁడు పట్టిఛాందసపుముండకొడుకు. నిన్నేమనునో? నీవు రావలదు.

బంగా.—మఱేమియు భయములేదు. అయినను నిన్నొక్కతెను బంపుదునా? ఏమికానున్నదోయగును. ఇంకను నిక్కడనే మనము మాటలాడుచున్నట్లాయనకు వినఁబడెనెడల నింకను బండుకొనలేదేమి యని కేకలు వైతురు. కావున లోనికిఁబోయి యొక్కపావుగడియ పండుకొని పోవుదము రమ్ము.

(ఇద్దఱు నిష్క్రమింతురు)

ఇది ప్రథమాంకము.

---



శ్రీ

# కంఠాభరణము.

## ద్వితీయాంకము.

ప్రదేశము—వీధి

[ప్రవేశము—సుబ్బలక్ష్మి బంగారమ్మ]

సుబ్బ.—అక్కా! ఇదిగో! ఇదిగో! వారి డప్పులచప్పుడీ వైపు వినఁబడుచున్నదే! ఇటుఁబోవుదమురా!

బంగా.—కాదే! ఈవైపుధ్వనియే యటు వినఁబడుచున్నది.

సుబ్బ.—అయ్యయ్యో! ఇది యిదివఱకు మనము వెళ్ళినసందే కాఁబోలు?

బంగా.—ఈదిక్కుమాలిన యూరిలోఁ బోగుపులపెట్టెలాగున నన్నియు నఱతే. తిఱిగింటికిఁ బోవుదమన్న దారి తెలియదే! ఏమి చేయుదము?

సుబ్బ.—మఱేమియు భయములేదు. ఈదారినిబోవుదమురా!

బంగా.—ఊరకమాటుమడఁగినది మనుష్యుఁడొక్కఁడైనఁగనఁబడఁడే! అయ్యయ్యో! ఇల్లువదలిపెట్టితిమి. డేరాకుఁ జేరమైతిమి. నడుమ దారితప్పి యల్లలాడుచుంటిమి. ఏమిగతి?

సుబ్బ.—భయమేమే! నీవు నావెంటరా!

బంగా.—అదిగో! ఎవ్వఁడో పానిధర్మమా యనియిటకు వచ్చుచున్నాఁడు

[పిచ్చివాఁడగు రామశాస్త్రులు ప్రవేశించును]

రామ—కీర్తన. కమాచ్—మిశ్రచాపు.

పా ధ నీ ధ ప మా ప మ గగా మా
గ మ పా ప పా మా॥ పా॥
దీనిమర్మము దెలియవలెనండీ। జనులారమీరు॥ దీని॥
ధా ధ ధా ని ప ధ ధ ని సా స స।
సా స మ గ రి స సా ని ధా ధా॥
బోనులోని యెలుకపిల్లను। మానుబిల్లి మ్రింగఁగానే।
సా స మ గ రి స సా ని ధా ధా ధా ని।
సా రీ సా ని ధా ప మ॥ పా॥
చేనులోని గుంటనక్క। చెట్టుమీఁది కెక్కికూసె॥ దీని॥
మూఁడుమన్నుల ప్రమిదలోపల। మూఁడుపేటల వత్తిమండగ
మూఁడుజోడులూడిపోయి। మొదలుతుదలకె మోసమయ్యె॥ దీని॥
ఒకటిపండ్రెండ్రైనయప్పుడు। నాలుగేసున్నైనయప్పుడు
ఆకుమీఁది రామచిలుక। యట్టెసుఖముగనిద్రపోవు॥ దీని॥

బంగా—సుబ్బలక్ష్మి! ఎవ్వఁడో మంచివాఁడే! తత్త్వాలుపాడుచున్నాఁడు. నాయనా! నాయనా! సర్కసుడేరాలోనికి దారియేలాగో రవ్వంత చెప్పునాయనా!

రామ—దారులలోకెల్ల జమీందారి—చెంబులలోకెల్లజారి—రోగాలలోకెల్ల మారి—సూత్రాలలోకెల్ల దోరి—క్షేత్రాలలోకెల్ల పూరి—భక్ష్యాలలోకెల్ల బూరి—ఇంతేమాతత్త్వము. జ్ఞానపత్రము ప్రియమగుటచేత యుద్ధమువచ్చినప్పటినుండియు బ్రహ్మానుసంధానము ఠీకముగ జరుగుటలేదు. అదిగో! అదిగో! కుంకుమబరిణచాటున విభూతిపండు! అదిగో! వహా వ్వా! మనతిరుక్కావేరీసమానురాలు! మేము ద్వైతాద్వైతభేదము వదలుకొన్నాము.(ఇద్దఱి నడుమకువచ్చి) ఐరోపాకు నాసియాకు నడుమ ధంధామ్.



సుబ్బ—అమ్మయ్యో! పిచ్చివాఁడు! (పాఱిపోవును.)

బంగా—అమ్మయ్యో!—(మఱియొకవైపు పాఱిపోవును.)

రామ—ఇది నివృత్తిమార్గము. అది ప్రవృత్తిమార్గము. నడుమ మేము త్రిశంకుస్వర్గము.

(నేపథ్యమున.)

అక్కా! బంగారమ్మా! ఎక్కడనున్నావు?

రామ—ఆ. అక్కడనున్నావా? ఇదిగోవచ్చుచున్నాను.

(నిష్క్రమించును.)

[బంగారమ్మ ప్రవేశించును.]

బంగా—సుబ్బలక్ష్మి! సుబ్బలక్ష్మి! గట్టిగఁ బిలిచినయెడల వెఱ్ఱిముండకొడు కెక్కడవచ్చునో! సుబ్బలక్ష్మి! అయ్యో! అదిగో పిచ్చివాఁడు! అమ్మయ్యో! (పరుగెత్తఁబోవును) అబ్బే! లాంతరు స్తంభము క్రీనీడ కాఁబోలు? కాదు కాదు! అదిగో! ఎవఁడో బండివాఁడు కాఁబోలు. కొరడా చేతఁబుచ్చుకొనివచ్చుచున్నాఁడు. సుబ్బలక్ష్మివాని నిక్కడకుఁ బంపించినదనుకొందును.

[ఎఱ్ఱయ్య ప్రవేశించును.]

బంగా—అబ్బీ! మాయమ్మాయి యచ్చట నున్నదా?

ఎఱ్ఱ—ఆ. ఆ. బండి సిద్ధముగ నున్నది. గుఱ్ఱంపుబండిలాగున బరుగెత్తింతును.

బంగా—తలచెడిన కుఱ్ఱది. మా చెల్లెలు—గోపులపంచె కట్టుకొన్నది. అక్కడ నున్నది కాదా?

ఎఱ్ఱ—చెప్పలేదా? మీకు సందేహ మెందులకమ్మా! రండు! ఏమి యెద్దనుకొన్నారు! మేగాలమీదఁ బోవును,

(నేపథ్యమున.)

కీర్తన.

జంఝూటి-చతురశ్రచాపు,

ధ ధ స సరీగా, గాగా మగరిస సాస॥
నిలుపవెబండీ—నీమీఁద మనసుండె॥నిలుపవె॥

బంగా—అమ్మయ్యో! పిచ్చిముండకొడుకు తిరుగ నిటకువచ్చుచున్నాఁడు! త్వరగాబండి తోలించుకొనిపోవలెను. బండివాఁడా! త్వరగ రా! (సంజ్ఞఁజేయును.)

(ఇద్దఱు నిష్క్రమింతురు)

రామ—[ప్రవేశించి]

ధధససరీగా, గాగా మగరిస సాస॥
నిలుపవెబండీ—నీమీఁదమనసుండె॥నిలుపవె॥
మామ మగమ పాపాప, ధాధా నిధ పమ పాప।
సందుదాఁటిన తరువాత, సంతర్పణున్నది
ధాధధానిధ పమమామ, మాధపమాగా సాస
కడుపునిండభుజియించి, కౌఁగిలించుకొందము ॥నిలు॥
ఆఁడు లేడికన్నులున్న బోఁడిదానిఁజూడఁగానె
చెంపమీఁద మన్మథుఁడు చెప్పుఁదీసి కొట్టినాడు॥నిలు॥

గుడ్డికామిగాని కాలవబాణము వెఱ్ఱరామిగాని ప్రసాదము.

(నేపథ్యమున) తోలు! త్వరఁగాదోలు! అయ్యో! సుబ్బలక్ష్మీ!

రామ—అదిగో! పోయెదను. పైదిజ్ఞానమార్గము. క్రిందిదికర్మమార్గము. ఇదేదో చూచినతరువాతనది. (నిష్క్రమించును)

[సుబ్బలక్ష్మి ప్రవేశించును]

సుబ్బ—ఎచ్చట వెదకినను మాయక్క కనఁబడ లేదు. ఇంటికిఁబోవుదమన్న నిల్లెఱుఁగను. ఎవఁడైనఁగనఁబడునేమోయని చూడఁగ నెవఁడు కనఁబడకుండనున్నాఁడు. కనఁబడినప్రయోజనముమాత్రమేమున్నది.



ఎవనినింటికి దారిచూపుమని యడుగను? వేంకటశాస్త్రి యింటిపేరేదో నోటనాడుచున్నదిగాని జ్ఞప్తికిరాకున్నది. అదిగాక—మాయక్కగాకుండ నేనింటికేమొగము పెట్టుకొనిపోదును! అక్కనుబట్టి బావకాని యంతకంటె నేమున్నది! మాయక్కమాత్రమిల్లెట్లుచేరును? మాయక్కకేమియాపదవచ్చునో యనిమాత్రము విచారించుచున్నాను. నావిషయమైనాకుఁ జింతయేమియు లేదు. ఇప్పుడేమిసుఖ మేడ్చినది గనుక నా—ఇఁకముందుఁ గష్టమువచ్చునని విచారము ? పిచ్చివానికి మాత్రము గనఁబడకుండఁ దప్పించుకొని తిరుగవలయును. చలివేయునేమోయని యీపచ్చడముఁ దెచ్చుకొంటినిగదా! ఇదికప్పుకొని ప్రచ్ఛన్నముగ మాయక్కకొఱకు వెదకుదును. ఎక్కడనైనఁ దగినతావు దొరికినయెడలఁ దలదాచుకొందును. ఇదివఱ కెప్పుడిట్టిసంగతులనెఱుఁగినదానను గాను. అయిననేమి? ఆవశ్యకమే ధైర్యగుణమును వృద్ధిపఱచును. అదిగో ! పిచ్చివాఁడు వచ్చుచున్నట్లున్నాఁడు! తప్పించుకొని పోవుదును,( సుబ్బలక్ష్మి నిష్క్రమించును)

[రామశాస్త్రి ప్రవేశించును]

రామ—"మనవీవమునుమష్యాణాంజాయతే వర్ణసంకరః" అను శ్రుతియందతివ్యాప్తిదోషము తప్పనింతఁ బట్టినది. పట్టకపోయినయెడల మనకీకాలునొప్పియెందులకుబట్టును? అనఁగా విషయియందు విషయమునకు,విషయమునందు విషయికి నధ్యాసము గానేరదనియెత్తిగియుండియుఁ బోవుటవలన నిమోకాలు బెణకుటకు హేతుపదార్థనివృన్నత సిద్ధించినది. ఓహో! ఈమోకాలు కాదు. ఇది—ఇఁక మన"మథాతోబ్రహ్మజిజ్ఞాసా" యనికూరుచుండవలసినదే. కాని కర్మకూపములో గంతులువైచినలాభము లేదు. బేరము బేరము బేరమని కోమటి కప్పలఱచినంత మాత్రముచేత వర్షము గురియునా? "అహింసాపరమో ధర్మ" యను శ్రుతి నంగీకరించినంత మాత్రముచేత బౌద్ధమతము వై

దిక మతమగునా? అసత్యము—అసత్యము. అయినను వ్యవహారము నందన్నియు సత్యములనక తప్పదు. ఇదిగో చిలుముగొట్టము! ఇది వ్యవహారజ్ఞానము. గుంటుపల్లి భాస్కరుని పేరు చెప్పి—అద్దెద్దె—హూంత్. ఇది పరమార్థజ్ఞానము. ఇంతే—కనుకట్టు—మహామాయ. ప్రకృతివన్నెలచిన్నెల వేశ్య—పరాత్పరుఁడు వేపారివాఁడు. ప్రపంచనాటకమంతయు వేపారివేశ్యాసమావేశమే! హహహ (నవ్వుచున్నాఁడు.)

[కృష్ణరావు సుందరి ప్రవేశించుచున్నారు]

కృష్ణ—గీ. పంచదారకంటెఁ బరిపక్వమైనట్టి
తీయద్రాక్షకంటెఁ దేనెకంటె
నిన్నిమాటలేల యివిమూఁడుఁగలిపిన
ముద్దకంటె వేశ్య ముద్దుతీపి.

ఏదీ మఱియొక్కటి!

సుంద—చాలులే. వేశ్యముద్దులు వేపారిపంతుల సుద్దులకంటె నెక్కువ తీపికావు. నిన్నెవతె నమ్మును? నీవెన్ని భాగవతములాడి యిక్కడకుఁ జేరితివి. ఎంత వేసగాఁడవు! ఎంత మోసగాఁడవు!

కృష్ణ—ఆ. నేను వేగుళ్ళపూజారినే—దినదినైకనూతనవనితాప్రియుఁడనే. అయిన నేమి! వెనుకటివన్నియు గతించినవి. ఏదీ! నీయింటిలోఁ బ్రవేశించినతరువాత నాకన్ను నీమొగము దాఁటెనా? కాలుగడప దాఁటెనా? గోడకుఁగట్టినబొమ్మ—గాగరాకు గట్టినబొందు—కాలిక్రిందఁ బెట్టినపీట—ఆ. ఇంటివైపు మొగము లేదు; ఇల్లాలివైపు తలఁపు లేదు. ఏకాదశీఫలహారమిచ్చుటనే; ద్వాదశీపారణ మిచ్చుటనే—ఈనడుమ మాతల్లిగారిఛటకముగూడ నీపశువులపాకలోనే కడతేర్చితినని యెఱుఁగవా?

సుంద—ఇంటివైపు మొగము లేదని—ఇల్లాలవైపు తలఁపు లేదని యింత దేవులాట యెందులకు? పోలేక పోయినావా? నిన్నాపినవా



రెవరు? పట్టుమని పదునెనిమిది మాసములైనఁ గాలేదుగదా—ఇంతలోనే యింత బెంగపెట్టుకొన్నవాఁడవు నీవలన నాముచ్చట లెట్లు తీరఁగలవు? పదపద! మగవానిని నమ్మినయాఁడుదానిని ముక్కుఁజెవులుఁ గోయవలయును.

కృష్ణ—సుందరీ! యెంతమాట! ఒక్కనిముసమైన నిన్ను వదలియుండగలనా? షష్ఠిపూర్తి జేసికొనుచున్న సుబ్బిసెట్టియింటికి నీవు మేజువాణికై యిప్పుడు పోవుచుంటివికదా—ఇప్పుడుకూడ నీవెంటనే నేల యుండవలయును?

సుంద—నిన్నుఁ మాత్రిమాత్రుఁడు పిలువలేదా? నీవు కూడ నక్కడకే పోవుచుంటివి?

కృష్ణ—నన్నుఁ బిలిచినాఁడు కాని నీవెంటరమ్మని పిలిచినాఁడా?

సుంద—నీకేమి యనుమానముండి వచ్చుచున్నావో?

కృష్ణ—హరిహరీ! నాకు నీయెడల ననుమానము లేదు. అనుమానము లేదు. సరేనా.

రామ—అదితప్పు. ప్రత్యక్షశబ్దములతో ననుమానముఁ గూడఁ బ్రమాణముగఁ దార్కికు లంగీకరించినారు. అయ్యా! మీరు చార్వాకమతస్థులు గారుగదా—

కృష్ణ—మేము మాధ్వమతస్థులము.

రామ—వేపారులా నాయనా! వంశమునకు మణిపూసవలెఁ బుట్టినావు. ఈమె వేశ్యాంగన కాబోలు?

కృష్ణ—ఔను. ఈమెకు నాకు సంబంధము.

సుంద—సిగ్గులేక నడువీధిలో నట్లు చెప్పెద వేమి?

కృష్ణ—సిగ్గుపడవలసినది కాదు. సంబంధమీనాఁటిది కాదు. వస్తువులవలెనే సంబంధమనాది. కాని వస్తువు లీశ్వరకల్పితములు. సం

బంధములు మాత్రము మనము కల్పించుకొనినవి. కాని మీసంబంధమే సంబంధము? సమవాయసంబంధమా? తాదాత్మ్యసంబంధమా? విషయవిషయీభావసంబంధమా? లోకానుభవమునుబట్టి యుత్తరోత్తరముగ మూఁడవది బలిష్ఠమైకనఁబడుచున్నది. నేను పెట్టియానుపత్రిలో నుండఁగా నక్కడనుండిన యొకమిస్సమ్మకు నేను గన్నుగీఁటినానని దానిమగఁడు నన్నుఁ గఱ్ఱఁదీసికొని వేసినాఁడు.

కృష్ణ—వెఱ్ఱివాఁడా! తప్పు! మిస్సమ్మకు మగఁడుండఁడు. మిస్సనఁగా నింగ్లీషులోఁ గన్యకుఁ బేరు. మగఁడు లేకపోవుటచేతనే యామె మిస్సమ్మయైనది.

రామ—కాదు కాదు. మగఁడు లేనిది వితంతువని మనుస్మృతిలోఁ జావఁగొట్టి వ్రాసినాఁడు. రజ్జు సర్పభ్రాంతి యొక్కటియే యద్వైతమునకు గట్టిపట్టు. ప్రపంచమంతయుఁ బ్రకృతిపురుషసమావేశమే. కావున నీమెయందు నీకు సర్పభ్రాంతివదలిపోయిన తత్క్షణము నీకొంతునకు రజ్జ్వాతము మాత్రము శాశ్వతముగాఁబట్టిటీయును. మాద్వైతములాగున మాది పెసరపప్పుమతము కాదు. పంతులుగారూ! మీయొద్దనస్యమున్నదా? హాయనా! పిండివంట—పహాహ్వా! పిండివంటవంటికుఱ్ఱదానిని సంపాదించినావు. గారెలవంటికన్నులు, బజ్జీను కాజావంటి పెదవులు—చక్కిలాలవంటి చెవులు-పాలముంజెవంటిగడ్డము, అప్పడమువంటిమొగము, వడియమువంటి ముక్కు ఉండరాలవంటి—

కృష్ణ—ఉండు! ఉండు! అంతటితో నాఁగు! సుందరీ! ఇతడు కవివలె నగపడుచున్నాఁడు. అయ్యా! నీవు కవిత్వము నేర్చుకొంటివా యేమి?

రామ—తగినవాఁడవయ్యా! బాగుగాఁ గనిపెట్టితివి.



"క. వేపారికంటె సరసుఁడు" పద్యము ముక్కుతోఁజదివినఁగాని మోక్షము లేదు.

వేఁపారికంటె సరసుఁడు
నేపాళపుమాత్రకంటె మేలౌ మందున్
వేపాకుకంటెఁ జేదును
నాపాటునకంటె సుఖము నహిసహిమహిలోన్

నాంచారమ్మగారికి నన్నాసాహేబునకు నీరాడు రేవున మతవిషయమైనకట్టుదల వచ్చినప్పుడు మేముమాధ్యస్థ్యముఁ జేసి ప్రతి పాదించిన దేమనఁగా:—

తిరుమణియైనను సరియే
చెడఁ బెఱిగిన గడ్డమైన మఱియున్ సరియే
పరబ్రహ్మరూపు లిద్దఱు
సుఖసంగతినుండుఁ డింక వైరం బేలా!

గవులూరువారి కవిత్వము మాకవిత్వము నొక్కటాకి-వారికి యతిలేదు. మాకు మతిలేదు. వారికి ప్రాసము లేదు. మాకు ధ్యాసము లేదు. వారికి గణము లేదు. మాకు గుణము లేదు. వారికర్థము లేదు. మాకు నర్థము లేదు—గంజాయి నిండుకొన్నది పంతులుగారూ! ఒక్కపావులా కాసిప్పించెదరా?

కృష్ణ—నీవు పద్యకవిత్వమే కాక పదకవిత్వముఁగూడ నెఱుఁగుదువా? ఒకతత్త్వము పాడినయెడల నేమైన నిచ్చెదను.

రామ—నీది శీతపిత్తతత్త్వముగావున శృంగారతత్త్వములో వేదాంతముఁ గలిపి పాడెదను.

కీర్తన—బేహాగ్—త్రిశ్రచాపు

మ గ మ ప సా ని స రీ స ని ని ధ ప ప మ గ గా,
మ ప మ ప గా రి సా పా పా మ ప ధ ని స ని ధ పా॥

అతివసొగసు లెన్నఁదరమె యజునకైనను వహ్వారె ॥అతి॥
గ మ ప ని ని, ని స రీ స ని ని ధ పా పా పా ప మ పా ధ
ప మ మా గా

వన్నెలాడిమోము—వెక్కిరించఁగఁజాలును, సోము
పా పా పా ప మ పా ధా ప మ మా గా గ మ ప స సా నీ
ధ ప మా గా ప మ మా గ రి స సా స ।
గోములకెల్లగోము—అది మారుని వేఁటలో దీము
వహ్వారె॥అతివ॥

కులుకులాడివివగలు—దానిమేననుమగరాఁనగలు
సోగకన్నులచూచినఁ దొగలు—దానికూరివారందఱుమగ
లు వహ్వారె॥అతివ॥

ముసిముసినవ్వులఁ బొల్పు—కల్లపలుకులఁ దేనెలరాల్పు
జారుపైఁటను పాయలుగఁదాల్పుఁ—దుదకందఱ కొంపలఁ
గూల్చువహ్వారె॥అతివ॥

వెఱ్ఱిరామమ్మమాట—మేల్మైలైననీతులమూట
పాటలకెల్ల, బాట—అది సంపెంగపూవులతోఁట వహ్వారె
అతివ॥

కృష్ణ—అహహా! ఏమిపాట పాడితివి! సుందరి! చూచితివా? కైకిఁబచ్చిశృంగారము లోపలఁ బరమవేదాంతము. ఇతఁడు జాతీయకవి. ఆంధ్రదేశమున కిట్టినవ్యకవిత్వమే యిప్పుడు కావలసియున్నది. నూతనవృత్తులు—నవనవాదర్శములు——జాతీయసమస్యలు—మతముతో జోడించి యితఁడు కవిత్వములో నిమిడ్చినాఁడు. తాడులేని బొంగరమెట్లుతిరుగదో, మతములేని కవిత్వమట్లు వర్ధిల్లదు. ఇదిగోనయ్యా! నీవిదితీసికో! (అని పిడికెడుడబ్బులు వానిచేతికిచ్చును.)

రామ—(తీసికొని) కృష్ణార్పణము కృష్ణార్పణము.

కృష్ణ—మేము షష్టిపూర్తి చేసికొనుచున్న సుబ్బిసెట్టియింటి



కేఁబోవుదుము. మీరక్కడకు వచ్చినయెడల మఱియేమైన దొరక గలదు.

రామ—నీవుకూడ నీమెతో నక్కడకుఁ బోవుటయెందులకు? ఈమెకుఁ జిప్పతాళపుటంగు చేయుదువా యేమి? తప్పులేదు లే. వైష్ణవులేమి, శ్రీవైష్ణవులేమి—సానులవెనుక దధిగిణతోం తకదధిగిణతోమ్మను నాచారమున్నది. నేనింక డివ్వివ్వి టివ్విట్టం—(నిష్క్రమించును.)

కృష్ణ—సుందరి! పిచ్చివాఁడు నడుమ నడుమఁ దెలివితో యుక్తియుక్తముగా మాటలాడుచున్నాఁడు.

సుంద—ఆతనికిఁబిచ్చి యెక్కడిది? వడుచువాఁడు—పిప్ప శృఖస్తవలె నున్నాఁడు—ఏదో మదసంబంధమైన స్వల్పవ్యత్యాసముని తోఁచుచున్నది. ఆఁడుదాని చేయి తగులఁగనే యది యంతయుఁ బాఱిపోవును.

కృష్ణ—ఆఁడుదానిచేయి దగులుటచే నంతవెఱ్ఱియుఁ బోవునని చెప్పితివిగదా—నీచేయి నాకుఁ దగిలినకొలఁది నీయెడల నాకువెఱ్ఱి హెచ్చగుచున్నదేమి?

సుంద—వెఱ్ఱులలో ననేక జాతులున్నవి. నీవెఱ్ఱి—చేసికొన్న భార్య చెప్పుదెబ్బతోఁగాని వదలదు. నిన్ను నాయింట దానుని జేసినానని—నీమాన్యములు నేను వ్రాయించుకొంటినని—నీకు నీ భార్యకు విడాకు లిప్పించినానని—నీమామగారు నన్ననరాని మాటలాడుచున్నాఁడఁట. నాకుశృంగభంగముఁ జేయునఁట. నాకీరట్టెందులకు? వారికీ బాధయెందులకు?

కృష్ణ—నాయత్తభామలకంటెను నీవే యెక్కువ యభిమానముతో నాకు బుద్ధి జెప్పుచున్నావుగదా—ఇట్టి యోగ్యురాలవగుల నిన్ను విడిచిపోవుటకంటె విశ్వాసహైన్యముండునా?

సుంద—విశ్వాసమున కెక్కడిది? వెనుక విడిచిన నాసవతులనందఱను విశ్వాసముచేతనే విడిచితివి కాఁబోలు? విటునకు విశ్వాసమేమి?

కృష్ణ—వారు నీసవతులని చెప్పుటకుఁ దగినవారా? కుక్కతల దాఁకతె—బాకినోటి దాఁకతె—ఇటులే—ఇటులే వట్టిబొగ్గేదో, వజ్రమేదో, ముండ్లతోఁటకూర యేదో, పుష్పించిన లతకూన యేదో, బొమ్మజెముడుకంప యేదో, పారిజాతపుగున్న యేదో, యెఱుఁగని యజ్ఞదశలో నేమి జరిగినదో జరిగినది. అట్టి పూర్వసంబంధములువిడుచుట విశ్వాసహైన్యమగునా?

సీ. వెంపటికంపలోఁ । జెంపేదినమదేభ
మంభోజసరసిలో । నాడఁదగదె
కాకిమూఁకలను జే । కాకునొందుపికంబు
తీయమామిడిపైనఁ । గూయఁదగదె
ఉమ్మెత్తపూలలో । దిమ్మెత్తినయళీంద్ర
మెఱుఁగులాబిపై । నెగురఁదగదె
కలుగుల సిలుగొందు । కాలాహి మలయజ
కుజవల్లితోఁ జుట్టు । కొనఁగఁదగదె
అత్తకోడండ్రగృహకల । హములనడుమ
బొట్లుపడు కవిసింహము । పరమరసిక
పండితవదాన్యకరుణార్ద్ర । భావభవ్య
రాజమార్తాండ సభను । జేరంగఁదగదె?

సుంద—కాని, యీశృంగారప్రబంధము నేఁడు నడువీధి నారంభించితివేమి? మన మెచ్చుటకుఁ బోవలయునో మఱచితివా?

కృష్ణ—అదిగో! కోమటిసుల్లు—ఇఁకఁ గొంచెము వ్యవధి యున్నది. కావున నేదియో నాకడుపులోని మమకారము దాఁపలేక



ము లేక వెల్లడించుచున్నాను. ఇంతవఱకుఁ బిచ్చి వానిగోలతోడనే సైనది. ఇప్పుడిప్పుడే కాదా రవంత పలుకని, కులుకని, చూపని, దాపని—(దగ్గఱకువచ్చి మీఁదఁ జేయివైచును.)

సుంద—చూడుపంతులూ! నిజముగా నేనంతచక్కనిదాననా?

కృష్ణ—ఎంతచక్కనిదానవో నేను జెప్పఁగలనా?

గీ. లేడికన్నులు గలుగుపూఁ । బోఁడివీవు
చక్కగుంటల సొగసగు । చేడెవీవు
చక్కఁదనముల మక్కయౌ । చానవీవు
మరునిగజ్జెలగుఱ్ఱమౌ । మగువవీవు.

సుంద—ఏమో! ఎంతచక్కఁదనమున్న నేమి? అదృష్టమండవలయును. నందులోఁ జకోరాక్షికిఁ బిల్లికన్నులే గావా? నిక్షేపమువంటి తోళ్ళవర్తకునిఁ జేబట్టినది. నాలు గంతస్తుల మేడ—నిలువుటద్దాలు—తూఁగు టుయ్యేలలు—గాగరా నడుమునబిగించుట కొక దాసి—జారిపోయిన పైఁట సరుకుట కొకదాసి—ఏనాఁడు నైశ్వర్యమెఱుఁగక యూరి యూరఁబందివలెనున్నది. అయిననేమి. ఐశ్వర్యముచేత నిప్పుడామెయే రంభ. మొన్నఁజూచితిని. బండిపట్టయంతయొడ్డాణము పెట్టుకొన్నది. దీనిసొగసుమండ! పెద్దచేగోడీయంత నత్తు పెట్టుకొని నగలు నాణెములు లేని నన్నుఁజూచి యెక్కసక్కెముగా నవ్వినది. పోవేపొగరుబోతా! నీయైశ్వర్యమంతయు నాయెంగిలికూడే కాదఁటే యని నాలో నేననుకొని గిరుక్కున నింటిలోనికిఁ బోయితిని.

కృష్ణా—ఎంగిలి కూడేమి?

సుంద—భార్యపోవఁగనే యాలబ్బివాఁడు మాయింటికివచ్చి "నాయాస్తి యెల్ల నీది; సమస్తము నీపేర వ్రాయించెదను, నీవు నన్నుఁ గనిపెట్టియుండు" మని చెప్పినాఁడు. బతిమాలినాఁడు. పైవారిచేతఁ జెప్పించినాఁడు. పాదాలమీఁదఁ బడినాఁడు, అంతకంటె నాతఁడేమిచే

యుఁగలఁడు? నాకటు మన సీమాత్రమును జోలేదు. అయినయింటి దానను గనుక మర్యాదకొఱకుఁ బెద్దపెద్దచూపులతోనే కాలక్షేపము జేసితినిగాని నీచవృత్తికి దిగలేదు. మతమని, మడికట్టుకొనుటయని, పూజజేసికొనుటయని, నియమముంచుకొని యిప్పటి మాల కూళ్ళ కోడఁబడక పోవుటచేత నిప్పుడు మాకొంప యయ్యవారలుగారి నట్టిల్లు—వీధిగుమ్మమునుండి పంతులు, ప్రక్క గుమ్మమునుండి పందులు—ఇంతే మా సౌభాగ్యము.

[నేపథ్యమున]

పంతులుగా రింక రాలేదు. కార్యక్రమములో నాయనకుఁ గూడ నొకపద్దున్నది. ఈనరికి వచ్చుదమనే యుందురు గనుక సభయారంభింతము. జయ ఆంధ్రమాతకు జయ, జయఆంధ్రమాతకు జయ.

సుంద—అదిగో! చూచితివా సభ యారంభమైనది? నావెంట రాకుము! నీవటుఁబో! నేనిట్లు పోయెదను.

(నిష్క్రమించును.)

కృష్ణ—ఎంతమాటయన్నదో! "వీధిగుమ్మమునుండి పంతులు, ప్రక్కగుమ్మమునుండి పందులు!" ఆహా! పౌరుషముగలవాఁడను గాని పందనుగానే! అమితమైన చనవుచే వాడియుండునా? సుందరి యగు భామ శ్రీకృష్ణుని దన్న లేదా? అటులే సుందరియగు భామ యీకృష్ణుని దిట్టుటయంతకంటె నెక్కువదా? ఆయన సహించియుండ లేదా? నేనుమాత్రము మేల నోరుమూసికొనియుండఁగూడదు? వేశ్యమాత చేతిలోని తెడ్డు నొకసారి నాపై వేయఁగ నుదిటికి దెబ్బతగిలి గిలార్చుకొని పోయితినే! అప్పుడే శాంతతను వహించిన నేనిప్పుడేల గంతులు వేయవలయును? శాంతివహింపక చేయవలసినది మాత్రమేమున్నది? గొరిగించుకొనుటకుఁ గొత్తకాసులేదే! ఉన్నధనమంతయు గానసభలని, నాటకములని, మేజువాణులని, వెచ్చించితినిగదా?



వేశ్యలవర్ధంతులకు వేనవేలు బ్రాహ్మణులకు దక్షిణలిచ్చితినే? వేశ్యలకుఁ బన్నీటితోఁ గాళ్లుగడిగించితినే! పందిరిపట్టెమంచములకు మంచిముత్తెముల జాలరులు కట్టించితినే! పడకగదులందు వెండిదీప స్తంభములలోఁ బచ్చకప్పురంపు దీపములు పెట్టించితినే? వేశ్యలకుక్కలకు వెండిగొలుసులు చేయించితినే? అయినది, దూఁకుడడఁగినది. చల్లారినది. అప్పులవాండ్రు హరింపఁగా మిగిలిన మాన్యముల నీసుందరిపేర వ్రాయించితినే! పైసయైన నప్పుదొరకక యల్లలాడుచుంటిని గదా—ఇఁక దేహయాత్ర యెట్లుజరుగవలసినది? మామామయెంత శాంతమూర్తియయ్యును నాపైఁగారములు మిరియములు నూరుచున్నాఁడఁట! ఎవ్వరును నాకు ఋణమీయఁగూడదని పత్రికలలోఁ బ్రచురించినాఁడఁట! భార్యరజస్వలయై నాలుగు సంవత్సరములైనది కాఁబోలును? మంగళసూత్రకాలమందుఁదప్ప నిప్పటివఱకు నామె మొగముఁ జూచియెఱుఁగను. ఏమో; ఆమె నాకక్కఱలేదని స్థిరపఱచుకొంటిని. అయినను నిప్పుడే మొగము పెట్టుకొని యత్తవారింటికిఁ బోవుదును? ఎంతవెఱ్ఱి! ప్రాణసమానమైన సుందరిని బాసి యొక్క నిమేషము ప్రాణముల నిలుపఁగలనా? ఆ! ఈమెకుఁ బూర్వపువారి నందఱను ద్యజింపలేదా? ఈమెతోడనే సృష్టియున్నదా యేమి? అయినను నాకీచింతయేల? రక్షించువాఁడు ముఖ్యప్రాణమూర్తియే యున్నాఁడు.

[నేపథ్యమున.]

జయ ఆంధ్రమాతకు జయ, జయ ఆంధ్రభాషకు జయ—

[వెనుకఁ దెరయెత్తఁగా సుబ్బిసెట్టియిల్లు]

ప్రవేశము—సుబ్బిసెట్టి, వెంకటప్పయ్య. శివయ్యశాస్త్రులు, రాముడు లక్ష్మణుఁడను నిద్దఱాశుకవులు. సుందరి, తిత్తిగాఁడు, తాళపుటంగుజేయువాఁడు నొ.

అందఱు—జయ, కన్యకాపరమేశ్వరికి జయ, సుబ్బిసెట్టికి జయ జయ, చిల్లరదుకాణమునకు జయ, జయ గల్లాపెట్టెకు జయ!

కృష్ణ—(ప్రవేశించి) జయ పిచ్చకుంచమునకు జయ! జయ తప్పుత్రాసునకు జయ, జయ సుబ్బిసెట్టి తామరకు జయ.

సుబ్బి—వారెవ్వరు? వేపారిపంతులే! అబ్బో! అబ్బో! వేళాకోళాలపంతులే! ఇదిగో! ఇదిగో! దండాలుదండాలు!—చూడు పంతులూ! మనకీయవలసిన చిల్లరమాట మఱచియేపోయినావు? నిక్కచ్చిగా నున్నది.

కృష్ణ—అందుకొఱకే యింతసేపాలస్యమైనది. రావలసినసొమ్ము చేతికి రాలేదు; తెల్లవాఱకుండఁగనే మా భటునిచేతఁ బంపింతును. కాని నీకీయుత్సవసమయములోనప్పులు రాఁబట్టుకొను దేవులాటయేల? రవంతసేపు, నిక్షేపములాగున నిశ్చింతగాఁ గూరుచుండరాదా? అదేమి! మొండిగోడమీఁదఁ గొండముచ్చువలెఁ గుర్చిమీఁద గొంతు కూరుచుంటివేమి?

సుబ్బి—గల్లాపెట్టెయొద్దఁ జదికిలఁబడవలసిన కోమటివారము కాదా? మీవంటి పెద్దయుద్యోగస్థులకుగాని మాకుఁగుర్చి యెందులకు? వెంకటప్పయ్య బలాత్కరించి యీకుర్చిలో నన్ను దింపినాఁడు. పంతులూ! కాళ్ళు క్రిందఁబెట్టుకొని కూరుచుండినఁగాని సరిగా నుండదాయేమి! (కాళ్ళు క్రిందఁబెట్టుకొనుటకుఁ బ్రయత్నించును.)

అబ్బో! అబ్బో! హి—వెంకటప్పయ్యా! పైని రవంత యూఁతగా బట్టుకొనుటకు దుకాణములోని త్రాఁడు కట్టలేక పోయినావటోయి?

వెంక—అదిగో! అది, అది. ఆ. కాళ్ళక్రిందకువచ్చినవి లెండు! ఇఁకఁ దొందరలేదు. ఒకపూటపనికి దుకాణంపుఁద్రాడు తెంపుట యెందులకని యుపేక్షించితిని.



సుబ్బి—పంతులూ! ఈసారిచూడు! రీవిగానూ డౌలుగా నున్నానా?

కృష్ణ—రీవియేమో డౌలేమో నాకేమి తెలియును? ఇదిగో సానివారి చక్కనిచుక్క యున్నది. దానినడుగు—సౌందర్యగ్రహణపారీణులగు సత్కవులున్నారు, వారినడుగు—

సుబ్బి—పంతులూ! సత్కవీశ్వరులు సానివారికంటె నెక్కువయని స్థిరపఱచినావఁటయ్యా! నాకాకవిత్వంపు గొడవయేమియుఁదెలియదు. మాకెంతసేపు డోకడాలు—నామట్టునకు నాకు సానియే పైచేయియని నమ్మకము. వారికేమి-నిక్షేపములాగున నందఱు వారియింటికి ముడుపులు, కానుకలు కోకలు, రవికెలు, నగలు, నాణెములు పట్టుకొనివెళ్ళి వారికి సమర్పింతురుగదా? వారి వ్యాపారమువంటిసుఖమైన వ్యాపారము మఱియొకటి లేదు. రవ్వారట్టు లేదుగదా?—పెట్టుబడి లేదుగదా? ఆదాయపుఁబన్ను లేదుగదా? అరువుబేరాలు లేవుగదా?—పైరుపంటలతో నిమిత్తము లేదుగదా?—ద్వాదశవర్షక్షామము పట్టినను వారివర్తకము జారదుకదా?—ఎక్కడనో యుద్ధాలు వచ్చినవి. సరకు లేదు. కాళ్లుచాఁచుకొని కూరుచున్నారు—వారికీబాధ లేదుగదా?—దివాలాగొడవ యెందలే లేదుకదా? వారి వ్యాపారమే వ్యాపారము. వారిజన్మమే జన్మము. అదృష్టవంతులు సుఖజీవనులు. అందుచేత సానులనుజూడ నాకు మిక్కిలి ముచ్చట—ఏదీ వెంకటప్పయ్యా! సుందరి నీలాగున బిలువవోయి? ఇక్కడినుండి చూపుబాగుగా నానదు.

వెంక—సెట్టిగారిసెలవైనది. దగ్గఱకు రమ్ము సుందరీ! సంకోచింతువేల! రా.

సుంద—ఎందులకు, అక్కఱలేదులెండు (సిగ్గునటించును)

సుబ్బి—ఇదిగో! పంతులుగారున్నారుకదా! ఆయన సెలవు

లేకుండ వచ్చునా! పంతులూ! పిలువవయ్యా యొకసారి.

కృష్ణ—సుందరీ! రా! సెట్టిగారియొద్ద సిగ్గేల.

సుంద—(సమీపించును)

సుబ్బి—అబ్బో! అబ్బో! వహవ్వా! వహవ్వా! నాటకములో బొమ్మలాగున నున్నావు. బణారసుకోకయే! పంతులుగారు పెట్టినదే? పదునెనిమిది మూళ్ల నాఁక నున్నట్లున్నదే?

సుంద—పదునాలుగు మూళ్లు.

సుబ్బి—పదునాలుగే యైనయెడలఁ బెద్దగుమ్మటము లాగున నింతలావుగా నున్న దేమి?

కృష్ణ—గాగరామీఁదఁ గట్టుకొనుటచేత నట్లున్నది.

సుబ్బి—కొట్టులోని రహస్యాలు కోమటయ్యకుఁ దెలిసినట్టు వేపారిపంతులకు వేశ్యలయట్టు పుట్టానవాళ్లన్నియు బట్టబయలు; వహవ్వా! చెంగులన్నియు మామిడిపిందెలే. ఇదేమిగంటల యొడ్డాణమా ? ఎన్నిమువ్వలున్నవే! మదరాసు సుబ్బారావుగారి మాయసరకు కాదు గదా! అబ్బో! అబ్బో! అత్తరుసాహేబులాగున గమగమలాడుచున్నావు. సాహేబనఁగాజ్ఞప్తికి వచ్చినది. పంతులూ! నీవునాటకాలకోసరము తెప్పించుమని చెప్పిన గడ్డాలు, మీసాలు, తలకట్లు, దుస్తులు విడుదలవాకుండ నున్నవి. నిన్ను నమ్ముకొని తెంప్పిచినవి, రూపాయకొక యర్ధరూపాయ లాభము చొప్పున నవియన్నియు నీవేపుచ్చుకొమ్ము. మాకు వడ్డితగులుబాటగుచున్నది. వహవ్వా! సుందరీ! ఏది! ఏది! (సుందరిచేయి పట్టుకొనును)

సుంద—సెట్టిగారూ! చేయి వదలుఁడు!

సుబ్బి—కొత్తిమొగమా! సిగ్గెందులకు? నేను బెద్దవాఁడను గదా? మీయాయన యిక్కడనే యున్నాఁడుగదా? ఇంక బిడియాలెందులకు? వ్రేళ్లయుంగరము లేపాటివోయని చూచుచున్నాను.



చూడు! నీమొగము కొంచెము వంచు. నామెడ పైకిలేవదు.

సుంద—నేనేల వంగవలయును?

సుబ్బి—చెవులదుద్దులు చూడవలయునులే. నాలాగున నీకు నడుము లావులేదుకదా? సలాకలాగున వంగఁగలవు

సుంద—(వంగును)

సుబ్బి—వహవ్వా! రవ్వలదుద్దులే? (అపవారించి) సుందరీ! ఈచీరమూలమునఁ గాఁబోలు నీవీరాత్రి నాకు రంభలాగుననున్నావు! వెనుక నెప్పుడు నాకీలాగునఁ గనఁబడలేదుసుమా?

సుంద—సెట్టిగారూ! నన్ను వదలుఁడు. (దూరముగాఁబోవును)

కృష్ణ—సెట్టీ! కాలుతిరుగఁ గుర్చిపైఁ బెట్టితివి!

సుబ్బి—పంతులూ! ఈకాలూరకే సలుపు.

శివ—అవును. వాఁచినట్లుగూడ నున్న దేమి?

సుబ్బి—ధాన్యముకొఱకుఁ తూర్పుపోయినప్పుడు తెచ్చుకొన్న విశాఖపట్టనంపు భాగ్యాలు. వెంకటప్పయ్యా! ఇప్పుడు జరిగింపవలసిన తంతేమి? ఏదో లఘువుగా మాత్రముగానీ. అట్టిపెద్దపఱుగులెత్తి కాళ్లు విఱచుకొన్న లాభములేదు. ఇదిగో! విన్నావా? ఛీ! ఆవెనుకఁ జెప్పలేదనుకోక—

వెంక—ఇదిగో! కార్యక్రమము.

సుబ్బి—కార్యకర్మమనఁగా నాకేమి బోధపడును? వెంకటప్పయ్యా! అయ్యో! అన్నిదీపాలు పెట్టించినావేమి ? తగ్గించు—సుందరి మొగముమీఁద మాత్రము పసందుగా వెల్తురుండునట్లు పెద్దదీపముంచు—మనమేమి సంసారులము కామా? ఈనాటి యుత్సవాలతో మన్నుగొట్టుకొని పోవుదుమా? వెంకటప్పయ్యా! అదేమీ కానీ!

వెంక—మొదటిది దైవప్రార్థనము శివయ్యశాస్త్రులుగారు.

సుబ్బి—ప్రొద్దునఁ గాదటోయి! దైవప్రార్థనము తిరిగి పెట్టినావెందుకు? ఈదైవప్రార్థనలలోఁ దట్ట తగులఁ బెట్టవలెననుకొన్నావా యేమి? తిరిగి విఘ్నేశ్వరపూజకు బియ్యము—దక్షిణకు డబ్బులునా? చాలు—చాలు!

వెంక—ఈదైవప్రార్థన లౌకికమైనది. దీనికి బియ్యము డబ్బులు నక్కఱలేదు. శివయ్యశాస్త్రిగారూ! మీరు లేచి యారంభింపుడు?

శివ—(లేచి) దైవప్రార్థన కావున నందఱు లేవవలయును.

సుబ్బి—అదిగో! పెద్దచిక్కు తిరిగి తెచ్చిపెట్టినావయ్యా? లేచుటకు వాతరమగునని యనుకొనుచున్నావు కాబోలు? వెంకటప్పయ్యా! వద్దవద్దనుచుండఁగా నీకుర్చీలో నన్ను బుట్టలోఁ జింతపండులాగునఁ బడఁగ్రుక్కినావు. ఇప్పుడు లేవవలెనఁట. ఎట్లు?

కృష్ణ—శివయ్యశాస్త్రిలూ! రా! నీవు కుర్చీ క్రిందకడఁచి పట్టుకో! నేను వెంకటప్పయ్య, సెట్టిగారిని జేతులుపట్టుకొని పైకి లేవఁదీయుదుము.

శివ—(కుర్చీయడఁచి పట్టుకొనును)

వెంక } (సెట్టిచేతులు పట్టుకొని పైకిలాగుదురు.
కృష్ణ }

కృష్ణ—ఊ. ఉ. శివయ్యశాస్త్రిలూ! కుర్చీ లేచుచున్నది. క్రిందకు గట్టిగా దబాయించు, ఊ. ఉ. అబ్బా! రాకుండ నున్నాఁడే!

సుబ్బి—లేగమోటికయని యనుకొన్నావటోయి పంతులూ! ఊరంత మనుష్యుఁడను. సుందరీ! నవ్వకె! వయసునాఁటి వాతము లోనికి దిగినప్పుడు నిన్నును నలుగురు పట్టి లేవఁదీయుదురులే!

కృష్ణ—ఊ. ఉ. అయ్యో! భట్టురాజులట్లు గ్రుడ్లుపెట్టుకొని చూచెదరేల? రెండు! నడుము బిగించికొని రండు, అసలు సెట్టియూడి రానప్పుడు మీయాశుకవిత్వాలెవని కొఱకు?



సుబ్బి—అక్కఱలేదు- అక్కఱలేదు, కొంతపట్టునకు లేచినట్లు కనఁబడుటలేదా?

వెంక—పైనుండుటచేత మాకేమియుఁ గనఁబడుటలేదు.

కృష్ణ—శివయ్యశాస్త్రిలూ! క్రింద ఖాలీయేమైన నైనదేమో చూడుడు.

శివ—ఆ. తగుమాత్రమైనది.

సుబ్బి—మొత్త దాఁటినదింక పరవాలేదులే. ఇఁకఁ జులకనగానే లేవఁగలను. ఇదిగో! ఊ-ఉ. (సెట్టి లేచును.)

కృష్ణ—అమ్మయ్యా! సభాసదులారా! ఒకవిన్నపము. కార్యక్రమము ననుసరించి దైవప్రార్థనముఁ జేయవలసియున్నది. కుర్చీలో సెట్టిగారదుకుకొని పోయిరను సంగతి మీరెల్లరుఁ గన్నులారఁ జూచినదే. ఇప్పుడు దైవకటాక్షముచేఁ గుర్చీకి గుర్చీ, సెట్టికి సెట్టి వేఱుగాఁ గనఁబడుచున్నారు. ఇందుకొఱకు మఱియొక దైవప్రార్థనము సేయవలసియున్నది. సమస్తశుభములవలె నీశుభముకూడ దైవానుగ్రహమువలననే సిద్ధించినదైనను పురుషప్రయత్నమును నిరసింపఁగూడదు. కావున వైశ్యరాజోద్ఘాటన విద్యానవద్యులగు వెంకటప్పయ్యగారిని శివయ్యశాస్త్రిలుగారిని మిగుల నభినందించుచున్నాను. (కరతాళధ్వనులు)

శివ—ఇదివఱకే మిగుల నాలస్యమైనది. ఇంక నుత్తరక్రియాదీక్ష వహింపవలసి యున్నది. (కరతాళధ్వనులు.)

వాగర్థావివసంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే
జగతఃపితరౌవందే పార్వతీపరమేశ్వరా.

[కరతాళధ్వనులు]

ఇది కార్యక్రమము ననుసరించిన దైవప్రార్థనము. శ్రీమంతులవారుపపాదించినట్లు మఱియొకసారి దైవప్రార్థనముఁ జేయవలసియున్నది.

శైవావయం నఖలుతత్ర విచారణీయం.

పంచాక్షరీ జపపరాసిత రాంతథాపి.
చేతో మదీయ-మతసీకుసుమావభాసం,
స్మేరాననం స్మరతిగోపవధూకిశోరం.

[కరతాళధ్వనులు.]

వేంక—సెట్టిగారూ! మీరిఁక బల్లమీఁద గూరుచుండుఁడు.

సుబ్బి—ఈజన్మమున కింకఁ గుర్చీమాట యెత్తకేమి? (బల్లమీఁదఁ గూరుచుండును.)

వెంక—(కాగితము చూచి) రెండవది సెట్టిగారి గుణసంపత్తిని గూర్చి—కృష్ణరావు పంతులుగారు—

కృష్ణ—సుబ్బిసెట్టి! సభాసదులారా! నేను వక్తనుగాని హేతువున నుపన్యాస మచ్చొత్తించితిని. ఈకాగితములందఱకుఁ బంచి యిచ్చెదను. (ఇచ్చును)

సుబ్బి—(అపవారించి) వెంకటప్పయ్యా! అచ్చుకర్చు పంతులదేగదా?

వెంక—(అపవారించి) ఔను. మనది కాదు.

సుబ్బి—ఇంకను వంద కాగితము లచ్చువేయించుకోనీ,

కృష్ణ—హరిః ఓం. ఆంధ్రమహాజనులారా! వైశ్యజాతికివజ్ర కిరీటమెవరో, ఆంధ్రదేశమున కమూల్యాలంకార మెవరో, సమస్త వ్యాపారజ్ఞాననిక్షేప మెవరో, ఏకపత్నీవ్రతదీక్షాధురంధరు లెవరో, దేవబ్రాహ్మణభక్తి భరితాంతఃకరణు లెవరో. గౌరిజలగోత్రరాజపవిత్రమూర్తి యెవరో యట్టిపను సెట్టిగారి—

[నేపథ్యమున]

పనుసెట్టిగారన నేమి?

కృష్ణ—పచ్చిపులుసు సుబ్బిసెట్టిగారు-షష్టిపూర్తి మహోత్సవముకంటె నఖిలాంధ్రలోకమున కత్యంతానంద ప్రదాయకమైన



యంశము వేఱొకటిలేదని నొక్కి వక్కాణింపఁగలను. ముప్పదిసంవత్సరముల క్రింద నీతఁడు కేవలరిక్తుఁడై యీగ్రామమునకువచ్చినాఁడు. చిన్నగుడిసెలోఁ బెసరపుణుకులవ్యాపార మారంభించినాఁడు. ఇట్టియిట్టి చిన్నగుడిసె పెద్దమేడయైనది. పెసరపుణుకులు బంగారు కణికలైనవి. (కరతాళధ్వనులు)

సుబ్బి—చాలు చాలు పంతులూ! నాకొంపఁదీసి—ఆదాయపుపన్ను మఱింతకట్టించుట కాలోచించుచున్నావా యేమి?

కృష్ణ—(చదువుచు) ఈతఁడు నాకుఁ బ్రాణమిత్రుఁడు. ఎనిమిదిమాసములనుండి యీతఁడు నాకనేకావసరములందు దశాంశపూర్వకముగఁ జేయుచున్న సాహాయ్య మింతింతని చెప్పుట కలవిగాదు. ఆతనికి నేను సర్వదాకృతజ్ఞుఁడను.

సుబ్బి—అబ్బో! అబ్బో! ఈమాత్రమునకేనా యేమి యిచ్చినామో, రూపాయకాఱుపైసలు వడ్డీచొప్పునఁ దిరిగి పుచ్చుకొనినామో—ఇంతేకాదా మాయుపకారాలు—మీకృతజ్ఞతలును!

కృష్ణ—(చదువుచు) ఈతనికి "టీ" గాని, "కాఫీ" గాని, చుట్టగాని పొడుముగాని యలవాటులేదు. (కరతాళధ్వనులు.)

సుబ్బి—అందునకు డబ్బిచ్చెడు వాఁడేడీ!

కృష్ణ—(చదువుచు) ఈతఁడొనర్చిన లోకోపకారక మహాకార్యము లనేకములున్నను, సంగ్రహాభిలాషచే రెండుమూఁడుమాత్రమే చెప్పెదను. ముప్పదినాల్గవయేఁట నీతఁడు మూఁడువేలరూపాయల వరశుల్కమును గ్రహించి వివాహమును జేసికొన్నాఁడు.

సుబ్బి—వేపారిపంతులు వెక్కిరింపులపంతులని మొట్టమొదటనే చెప్పలేదా?

కృష్ణ—(చదువుచు, వైశ్యమహాజనసభ యీగ్రామమున నొకసారి సమావేశమైనప్పు డానాల్గుదినములుగూడఁ బైగ్రామస్థులతోఁ

బాటీతఁడు సభవారి వంటశాలలోనే భోజనము చేసి మతాభిమానమును దేశాభిమానమును భాషాభిమానము నాంధ్రలోకమున కంతకును వెల్లడించుకొన్నాఁడు.

["వినుఁడు వినుఁడు" అని సభలోఁ గేకలు.]

సుబ్బి—అవును, ఇప్పుడు నా శక్తిని మూఁడు వేలజనులు భోజనము చేసెడివారు. నాలుగుశుభములు కంటఁబడినయెడల నొకశుభ మింటఁ బడునని మాయయ్యగారు చెప్పినారు.

కృష్ణ—(చదువుచు) కళత్రవియోగమైన తరువాత నన్నివిధములఁ బ్రయత్నించినను నీతనికిఁ గన్యనిచ్చుట కెవ్వరు నంగీకరింపక పోవుటచేత వివాహవైరాగ్యమును బరిపూర్ణముగఁ బొందియున్నాఁడు- (కరతాళధ్వనులు, ఈతఁడు చేసిన దానములన్నియు వివరించుట కిటఁ దావుచాలదు, కొన్నిమాత్రమే చెప్పి విడుతును. వైశ్యమహాజనసభవారికి సంతర్పణకొఱకు మూఁడుబండ్లపిడుకలు, ఊడుగు లమ్మువారి యుత్సవమునకు నూరుచిట్టిముట్టాకులు, మునసబుకరణములకుఁ గలిపి మణుగుబెల్లము—బ్రాహ్మణికి యజ్ఞోపవీతము లిచ్చిన శివయ్యశాస్త్రులుగారి కొకపావులా—గడ్డిపాటిభాగవతులకు వత్సరమున కాఱణాలు—ఒడలికోతలవానికి రెండణాలు- ఈమహానుభావుని గౌరవార్థమై యాతఁడు వేంకటప్పయ్యచేతను నాచేతను గ్రామస్థులందఱకుఁ జెప్పించిన షష్టిపూర్తిమహోత్సవముఁ జేయుట కెవ్వరునంగీకరింపలేదు. గావుననీమాత్రపుఁబని కొకనిసాహాయ్య మేలయని గ్రామస్థులకు సిగ్గువచ్చునట్లు—ఆంధ్రలోకమున కెల్లఁ దలవంపులగునట్లు—అహమస్మియని యీకర్మమును స్వయముగాఁ జేసికొనుచున్నాఁడు. (కరతాళధ్వనులు) ఈమహానుభావునికి—ఈలోకోపకారపారీణునకు భగవంతుఁడు నిరోగదీర్ఘాయుష్యమిచ్చి రక్షించుఁగాక! ఓంశాంతి శ్శాంతిః (కరతాళధ్వనులు.)

సుబ్బి—వెంకటప్పయ్యా! అందఱిచేతులలో నుండు కాగితము



లనుదీసి గల్లాపెట్టెప్రక్కనున్న బుట్టలోజాగ్రత్తపఱుపుము. ధనియాలని, యింగువయని, పొట్లములకు వారికేయుపయోగించును. మనకుఁగావలయునా యేమి?

వెంక—(కాగితములన్నియుఁ దీసికొని) తరువాత—(నవ్వుచు) ఆశుకవిత్వము—రామలక్ష్మణులను భట్టురాజులు.

సుబ్బి—మేజువాణిపైన తరువాత వేళయున్నయెడల భట్టుకవిత్వము చూచుకొనవచ్చును,

రామ—సెట్టిగారూ! భట్రాజులము. మమ్ము భోగమువాండ్ర క్రిందఁ బడవైచుట న్యాయము కాదు.

వెంక—అయ్యా! కార్యక్రమపత్రములో వీరితరువాతనే మేజువాణియున్నది. ఆక్రమము తప్పుటయెందులకు?

సుబ్బి—మనకుఁ గ్రమమేమి? మనమేమి? యుద్యోగస్థులమా మనకేమి యధికారాలా? మనసభలేమి రాజసభలా? కోమటివారికిఁ గ్రమమేమి? ముందువచ్చినవారికి సరకు వెనుకనిచ్చెదము; వెనుక వచ్చినవారికి సరకు ముందునిచ్చెదము. క్రిందిది మీఁదికి, మీఁదిది క్రిందకుఁ బెట్టకపోయినయెడల జరుగుబాటేలాగు? మనకేమి మళ్ళా, మాన్యాలా? ప్రాఁతబియ్యము క్రొత్తవియిచ్చెదము. తేనెనిండుకొన్నయెడల దానికి బదులు బెల్లపుఁబాకము చెలామణీచేయుదుము. ముక్కనకు సూటిగాఁ బోయినయెడల వ్యవహారాలు చేసినావే—

శివ—సెట్టీ! అట్లనరాదు. ఎవ్వరిసభయైనను సభగాని సంత కాదు. కార్యక్రమమును దెలుపు నీపత్రమును గౌరవింపఁదగును.

సుబ్బి—ఋణపత్రాలే—తనఖాదస్తావేజులే-న్యాయసభలలో టుప్పున నెగిరిపోవుచున్నవి. ఇంక మావలవనే న్యాసయ్య వెంకటప్పయ్యగీఁకిన పత్రము ప్రకారము నేనునడువవలయునా? నాకుమీఁకట్టుబాటేల? అదిగో! పంతులు ముసిముసినవ్వులునవ్వుచుఁ బెండ్లికొడుకు

వలెఁ గూరుచున్నాఁడు. నామనసువచ్చినవాఁడు. పంతులూ! మేజువాణి యారంభింపుమని చెప్పు.

కృష్ణ—సుందరీ! సెట్టిగారట్లు సెలవిచ్చుచుండఁగా నూరకుందువేల? రా.

సుంద—(మద్దెలకు నమస్కరించి సభలో నొక్కొక్కనికి నమస్కరించును)

వెంక—సెట్టిగారూ! సుందరి మీకు నమస్కరించుచున్నది.

సుబ్బి—అలాగా! అబ్బ! అబ్బ! మాకు దండాలే! లాభాలమీఁద లాభాలు! నూతేండ్లు వర్ధిల్లి, పదివేసారుల కొంపలులాగినీ కొంపమీఁదఁబడవేసికో—ఒడలు మాత్రము బాగుగాఁ గాపాడుకో. వెట్టిముగమా! పుప్పిగింజకు పీలగింజకు ధరమాత్ర మెన్నఁడు గాదుసుమా! మీవ్యవహారాలలో నేమి. మావ్యవహారాలలో నేమి! చిల్లర శ్రీమహాలక్ష్మి కాని పెద్ద పెద్ద బేరాలు కావు. పెద్ద కాతాలు వచ్చువఱకు నోరుదెఱచుకొని కూరుచుండిన యెడల వడ్డిదండుగ—దుకాణములోనికివచ్చిన బేరమెప్పుడుఁ జెడనాడుకోవద్దు. ఎంతసేపు మెత్తనిమాటయేగాని రట్టుమాత్రము వద్దు. కూడదు. విసుగుదల మాత్రము పనికిరాదు. తెలిసినదా? ఇది వర్తకరహస్యము.

కృష్ణ—సెట్టీ! శిష్యురాలికి మంచిబుద్ధులే చెప్పుచున్నావు! అది గుణానురక్త కాని ధనానురక్త కాదు.

సుబ్బి—పంతులూ! నీకంటె నేను పెద్దవాఁడను. నీవుసుందరిని కొలఁదికాలమునుండియే యెఱుఁగుదువు. కాని యిది నామోకాలంత కుఱ్ఱది యైనప్పటినుండియు నేనెఱుఁగుదును. పెద్దదైనతరువాతఁ జాపులు లేకపోయినవి. ఈగొడవకేమి సుందరీ! కానీ.

సుంద—తమ్ముఁడా తిత్తిపోయుము.

తిత్తిగాఁడు—ఊ. (పోయును)



మద్దెల—ఎక్కువయైనది. రవంత నొక్కు. అయ్యో! మిక్కిలి దిగిపోయినది.

సుబ్బి—చంటిపిల్ల యేడుపులాగున నదిలేకపోయిన నేమోయి?

సుంద—[శబ్దములకొలుపుతో భరతముచేయుచున్నది]

కృష్ణ—పహవ్వా నీవు సెట్టిగారిపైని బాగుగా నభినయించి బహుమానముఁ గొనవలెను.

కీర్తన—హిందూస్థాని కాపీ—ఆది

ప ప పా మా గా రీ స ని సా రి గ రి సా సా ని ధ.

సుంద—కన్నారంగా. గాంచితి నిన్నిఁకఁగడు

స స స స స స సా స గా గ గ గా మా గ మ పా

ముద మెదలో గంటినిరా॥ కన్నా॥

[అభినయించును]

స స స స సా స స రీ మ మ పా,

అగరును గంధముఁ బూయుదునా—

ప ధ ని ధ పా మా ధ ప ప మ రి మా గ రి సా,

అత్తరు మేనికి రాయుదునా.

[అభినయించును]

సుబ్బి—మాకొట్టులో నత్తరుపన్నీరులమాటయుబద్ధము, ఆముదము కావలసినంతయున్నది. కమ్మని యాపునేయివంటియాముదము.

సుంద—అగరుగంధముఁబూయుదునా

అత్తరుమేనికి రాయుదునా

స స స సా స స రీ మ మ పా,

తగునని చెంపపై వేయుదునా

సుబ్బి—(అపవారించి) వెంకటప్పయ్యా! దగ్గరగానున్నావుగదా? ఊఁ

వెంక—[అపవారించి] ఉన్నాను. ఎందుకు?

సుబ్బి—ఎందుకు లేదు! నీకు బాగుగాఁ గనఁబడుటకుఁగాను దగ్గఱగా నుండుమంటిని లే.

సుంద—తగునని చెంపపై వేయుదునా—అభినయించును]

కృష్ణ—వేయవేమి? కానీ!

సుబ్బి—[వెంకటప్పయ్యవంకఁ జూచుచు] అబ్బో! అబ్బో! పంతులూ! సానితో సరసాలాడుచున్నావా? నీవు పరిహాసాన కనుచున్నావని సుందరి యెఱుఁగకపోలేదు లే! ఇంతకు గోమటివారికుఱ్ఱవాఁడు లోకువ గదా యని—

కృష్ణ—ఓరీ నీకుఱ్ఱతనము కూలిపోను!

సుంద—అగరుగంధముఁ బూయుదునా
అత్తరు మేనికి రాయుదునా
తగునని చెంపపై వేయుదునా—నా
పా ప సా ని ధ పా ని ధ ధ ప
గా గ గ గా మా గ మ పా
దర్పం బెంతో చూపుదునా॥ కన్నా॥

[అభినయించును]

కృష్ణ—శబాసు సుందరీ! మిక్కిలి యొయ్యారముగా నభినయించితివి!

సుబ్బి—అబ్బో! దర్పము చూపెద వేమి? ఎంతదాన వైతివి! పుష్పరథములాగున నెంతదాన వైతివి! చిన్నతనములో గూడకట్టు కట్టుకొని పుణుకులదుకాణములోనికి వచ్చి "తాతా! నాకొక్క పుణుకు పెట్టవు?" అన్న నిన్నగాక మొన్నటిదానవు! నులకమంచపుఁగోడంత యుండెడిదానవు—ఇప్పుడు నూకాలమ్మంత యైనావు. (తనలో) దీని మీఁద సుబలాటము నాకు మిక్కిలి మొగ్గుగాఁ గనఁబడుచున్నది, (అపవారించి) వెంకటప్పయ్యా! చిన్నబాబుగారి దివాణములో వున్న లంగాసరకులు తమలపాకులకని చెక్కలకని మనదుకాణములోనికిఁ దఱచు వచ్చువారు గదా=వారిలో నెవ్వరికి నింత యొయ్యారము-ఇంతకీవి-ఇంతడాబు ఇంతడౌలు లేదనుమూ!



వెంక—[అపవారించి] భరతవిద్య నేర్చిన యాటకత్తెయిది!

సుంద—జుట్టునఁ బూవులు ముడిచెదనా—నీ
సొగసును జూచి మురిసెదనా
కొట్టు తాళమును దీయుదునా—పెద్ద
పెట్టెఁ దీసికొనిపోవుదునా॥ కన్నా॥

[అభినయించును]

సుబ్బి—అబ్బో! అబ్బో! పెట్టెలో భాగ్యాలు కవిలికట్టలు నలుక పెంటలును. ఇంతే కాదా? ఏమో యున్నవని పెద్దవాడుక—వచ్చినదంతయు వడ్డీకే సరిపోవును. అసలులోఁ బెద్దలొట్టయే. ఎవరెఱుఁగని సంబరాలు!

శివ—శ్రేష్ఠిగారూ! ఎందులకీ సర్దుబాటు? లేనియెడల నౌకరిచ్చెదరా? ఉన్నయెడల నౌకరు తీసికొందురా? ఎవరికున్నంత వారికున్నది.

సుం—చేయిఁ బట్టుకొని లాగుదునా—
చెచ్చెఱ గదిలోకీడ్చెదనా
చీఱ చెఱఁగు చేఁ గట్టుదునా—మఱి
చేతికత్తెతోఁ గొట్టుదునా॥ కన్నా॥

(అభినయించును.)

సుబ్బి—అబ్బో! అబ్బో! ఇది యేమి సరసాలు! క్రొత్త సరసాలు వచ్చిపోయినవి! పంతులూ! ఈజబర్దస్తీ సరసాలేమి? ఈజబ్బపుష్టి పాకాలేమి? ఈపిడిగ్రుద్దుల ముద్దులేమి? అబ్బో! అబ్బో! ఎంతదానవు?

చెప్పులగదిలోకీడ్చెదవా? ఏదీ యీడ్వు. ఏది కదుపు! ఆ! నీకంటి కంత గుల్లసరుకులాగుననున్నాను కాఁబోలు? ఏదీ! ఇప్పుడేగదా— నీకంటియెదుట నేకదా—కుర్చీలోనుండి పైకిలాగుటకు నలుగురు బ్రాహ్మణులకుఁ జావు తెంపులయిపోయినవి!

కృష్ణ—సుందరీ! మఱియొక్కసారి యభినయింపుము, శివయ్యశాస్త్రులుగారు! ఇప్పుడు పట్టినహస్తమేది?

శివ—ఒక్కటేమాట. ఇప్పుడుపట్టినను స్వహస్తముగాని మఱియొకటి కాదు.

సుంద—చేయిఁబట్టుకొని లాగుదునా— [అభినయించును]

కృష్ణ—లాగు! లాగు! చూచెదవేమి?

సుంద—[సెట్టిచేయిఁబట్టుకొనిలాగుచు]
చేయిపట్టుకొనిలాగుదునా—[అభినయించును]

సుబ్బి—[అపవారించి] వెంకటప్పయ్యా! దగ్గఱనున్నావుగదా? మీఁదఁ జేయివైచి మాత్రముండుసుమా! (తనలో) ఇది చేయిపట్టుకొని లాగఁగానే యొడలు జలదరించినది. (అపవారించి) సుందరీ! నేనోడలుపట్టలేకుండనున్నాను. మేజువాణి యైనతరువాత నీవు మాయింటికి రావలెను, వెంకటప్పయ్యను దొడ్డిగుమ్మములోనుంతును. ఊరకే గనుక నా; నోటితో లేదనునది చేతితో లేదనిపింతును. తప్పక రావలెనుసుమా?

సుంద—ఊ—చేయిఁబట్టుకొనిలాగుదునా
చెప్పులగదిలోకీడ్చెదనా
చీఱచెఱఁగు చేఁ గట్టుదునా—మఱి
చేతికఱ్ఱతోఁ గొట్టుదునా! కన్నా!
(అభినయించును)

కృష్ణ—(తనలో) కోమటిముండకొడుకు చేయి యడ్డుపెట్టుకొని సుందరచెవిలో నేమియో యూఁదినాఁడు ఇది "ఊ" యనినది. కాని యేమియూ నెఱుఁగనట్లెయుండవలయును. (ప్రకాశముగా) ఇదిగో! రెండురూపాయలు.



మద్దె—బళి కృష్ణరావుపంతులుగారే బళి! సుందరికి సభలో రెండురూపాయలు తాంబూలపు ఖర్చుక్రింద దయ చేయించినారు, శ్రీకృష్ణార్పణము! (ఎగురుచున్నాఁడు.)

వెంక—ఇదిగో! ఒకటి.

మద్దె—బళి వెంకటప్పయ్యగారే బళి! సుందరి సభలో నొక్కరూపాయ తాంబూలంపుఖర్చుక్రింద దయచేయించినారు. కృష్ణార్పణము! (ఎగురుచున్నాఁడు.)

సుబ్బి—ఇఁక సందఱకుఁ దాంబూలము లిప్పింపుము.

రామ—మాయాశుకవిత్వమున్నదండీ!

సుబ్బి—వెంకటప్పయ్యా! ఇవి యేమోయి! ఈగొడవ తెచ్చిపెట్టినావేమోయీ! మనకింట నొంట నెప్పుఁడు గవిత్వంపు గాడిదగత్తర లేదోయి!

వెంక—ఇప్పటి సభలలో నిది యొకయాచారముగానున్నది.

రామ—గీ. సరససుబ్బిసెట్టి । సంతోషముగ నిన్నుఁ
జూడగల్గినాము । చోద్యమమర
ఆశుకవిత మేము । అవలీలఁ జెప్పంగ
సిద్ధమైతిమయ్య । చెలువుమీఱ.

లక్ష్మ—క. భువనంబులో నెఱదాతలు
అవలీలగనున్నవారు అందఱుమీరుగా
బ్రవిమలముగ నీడొత్తుర
అవనిని శ్రీసుబ్బిశ్రేష్ఠి! అవగతశ్రేష్ఠి

రామ—క. శ్రేష్ఠి శ్రేష్ఠి యనుచును
శ్రేష్ఠముగాఁ బల్కినాను చెలువుగ, లలితో
మేష్ఠరువగుదువు సెట్లకు
సుష్ఠుగ శ్రీసుబ్బిగుప్త! సుకవులతృప్తా!

లక్ష్మి—క. దుష్కరప్రాసంబులతో
శుష్కప్రాయంబుగాఁగ సారిదిం గవితన్
నిష్కపట చెప్పువారము
నిష్కపటము లిచ్చి పంపు నిపుడే మమ్మున్.

సుబ్బి—ఉండుఁడు! ఉండుఁడు! అయ్యో! నేర్చుకొనిపోయినారు లెండు! మంచిసరసముగానే యున్నది. బుడబుడక్కలవానిలాగున నొకటే ధోరణి—చాలుచాలు దిక్కుమాలినగోల—

వెంక—కవులారా! తొందరపడక సెట్టిగారు చెప్పిన దేదియో వినుఁడు! వినుఁడు!

రామ—క. అయ్యా వెంకటపయ్యా
వెయ్యాఱులవంటివాఁడ వయ్యావహవా
సయ్యాటలేల వినుమీ
వియ్యాలలో దేవపెయ్య! వెంకటపయ్యా!

సుబ్బి—(సంగీతములో) ఓరి మీగొంతుకులు గోయ్యా,

లక్ష్మి—క. మంత్రిఁడవున్ సెట్టికివర
తంత్రివి నీవఖిలకొట్టు తంత్రంబులకున్
కంత్రిబుద్ధులు లేవిఁక
జంత్రపుఁదా కీలుబొమ్మ! సద్గుణదిమ్మా!

సుబ్బి—వెంకటప్పయ్యా! నీయిల్లుమూసిపోను. నాకొంపఁదీయుట కిదియేమోయి!



రామ—క. శాట్రిపుకోన బ్రాహ్మణు
లిట్రాకవి చెప్పఁగలరె? యిలలలిసరవిన్
భట్రాజు మాంసకవితకె
మెట్రావపుచారుకవిత యాడొచ్చిలలోన్.

శివ—ఇట్రాయనఁగ నేమి? ఇట్రాకవి చెప్పఁగలరె యంటిరి గదా!

రామ—రలయోరభేదః,—ఇట్లాయన్న మాట.

శివ—కవి చెప్పఁగలరే యని యంటిరిగదా—కవియనఁగాఁ గవిత్వమను నర్థమున్నదా?

రామ—గంగదాసు మహాకవి ప్రయోగమున్నది.
బండిరా పొగబండిరా దొరలుండు రైలుబండిరా.
మండలంబున గంగదాసువుండి యీకవి చెప్పెరా
శాస్త్రిలుగారూ!

గీ. ఆశుకవితయొకటి యావుపేడయొకటి
స్వయముగాఁగ శుద్ధచయము భువిని
వానికిలను లేఖు పరిశోధనము కూడ
దవనిఁ జెలఁగ వెలయు నమర భువిని.

శివ—నాదే బుద్ధిలోపము. మన్నింపవలయును.

లక్ష్మి—క. శుద్ధముగాఁ బండితులను
అద్ధారాకవితలోన నతిగట్టిరమున్
సద్ధనముగూర్ప గట్టిగ
శ్రద్ధింతుము సభలజనులు శాబాసనఁగన్.

సుబ్బి—శాబాసందురో ఛీయందురో నేనెఱుఁగను; కాని యామాత్రంపుఁబని నేనును జేయఁగలను. కవిత్వమునకు మీరే సృష్ట్యాదిగురువులా యేమి?

చింతపండు దెచ్చి రాచిప్పలో వేసి
నీళ్ళుపోసి పచ్చిపులుసు చేసి
కాలినవంకాయ ఆపులుసులో వేసి
ఉల్లిపాయ కారమందు వేసి
బుట్టగోదికాస్త దానిలోపల జేర్చి
బజ్జిజేసితినఁగ గజ్జిమొలచు—

ఓహో హో హో—ఓహోహో—ఓహోహో—(అని సంగీతము పాడుచున్నాఁడు) హె హె హె! ఈకవిత్వమునకంటె మీకవిత్వ మేమి తక్కువ?

రామ—క. ఒకటా రెండా గడియకు
నికరముగా రెండునూర్లు ♦ నెఱిపద్యంబుల్
చకచకను జెప్పఁగలమిల
ప్రకటితముగ జొప్పడంగ బచ్చాధీశా!

లక్ష్మ—క. బచ్చుండవు నెఱదాతల
మచ్చుండవు శత్రువులకు ♦ మహితజ్వాలా
చిచ్చుండవు కవివర్యుల
మెచ్చుండవు మేటినుగుణ ♦ పుట్టీ! సెట్టీ!

సుబ్బి—ఆఁగు! ఆఁగు! అంతటితో నాఁగు! చిన్నతనమునుండియు నదేయలవాటుగా దేవులాడినవారు కావున నన్ని యేని జెప్పెదరు. అందులకు మీకు బహుమాన మెందులకు? ఏది? నాతో మీరు లెక్కలు కట్టుఁడు! మూఁడురూపాయలు మూఁడణాలకుఁ బదకొండు కుంచాల మూడుతవ్వల మూడుగిద్దలు కందులైనయెడలఁ బదునాలు గణాల ముక్కాని కెన్ని? తెలివితేటలున్నఁ జెప్పుఁడు! నేనవలీలఁగఁ జెప్పఁగలను. లెక్కలలో నింతగట్టివాఁడనైన నాకూరి వారేమిబహుమానమిచ్చుచున్నారు.



కృష్ణ—సెట్టీ! మేము వెళ్ళెదము.

సుబ్బి—ఈబొమ్మ జెముడు కంపలను నాజుట్టునకుఁ గట్టిపోవుదురా? దండాలు దండాలు. సుందరీ! నీవుకూడ వెళ్లు! ఇదిగో! ఊఁ! శాస్త్రులుగారూ! నడువుఁడు! (వారు నిష్క్రమింతురు.)

సుబ్బి—వెంకటప్పయ్యా! వీరిద్దఱకుఁ జెఱియొక బేడ కాను నిచ్చి పొమ్మని చెప్పు. అబ్బ! అబ్బ! (తీయుచు) త్రాడుగట్టినయెడల తీయుట కింతచిక్కు లేదుగదా?

రామ—క. తోడాలివలేవా? గుడి
ఘోడాయై నివ్వలేవా? ♦ కొమరుగఁదలఁపన్
బోఁడెమ్మ చాకలికివలె
బేడాయిచ్చెదవు గేదె ♦ పేడా! ధరలోన్.

సుబ్బి—కఱ్ఱతే! వెంకటప్పయ్యా! కఱ్ఱతే! పోదు! ఖరాతి మీఁదఁబోదు!

లక్ష్మ—క. ఉగ్రము బూనదవేలా
భోగ్రాం కాగితములోన ♦ పారిజేర్చితవా
కుగ్రామవాస! మమ్ముల
నిగ్రహలములోక మెఱుఁగ ♦ నీసిగదరగా!

సుబ్బి—అబ్బో మీకోపాలకు, మీశాపాలకు బెదరిపోవువారెవ్వరు నిక్కడ లేరు. కత్తికోఁతల ముండకొడుకు దాకాణములోఁ గూర్చుండి రొండలు కోసికొని కొంతగడబిడ చేసినను మూడేండ్లవఱకుఁ గొత్త కాసు చేతఁబెట్టలేదు. ఈనడుమ నేదో వారు వీరుఁ బట్టుబట్టుటచేత నిదియంతయు సునము కట్టుకొని పోవుదుమా యని బేడ బరాతము చేసినాను. వానితో సమముగా మిమ్మాదరించినప్పటికిఁ గూడ నింకనుఁ జాలదనుచున్నారా? పోండు! పోండు! ఇది యేమి పెండ్లియా? వసుగా? బుచ్చిబాబుగారి యింటిలో నున్న బంద

కట్టుత్సవమునకు మీ కేమిచ్చినారో తెలియకపోలేదు! మేము వెలమ వారికంటె నెక్కువవారమా? పోండు! పోండు!

రామ—క. అందఱికి నొక్కటిచ్చిన
పొందుగ భట్రాజులకును ॥ బారిరెండీయఁగ
గ్రందైన వాడుకున్నది
సుందరముగలలిని వెలయ ॥ సొరిదిగ భువిలోఁ.

సుబ్బి—అలాగే మీకును రెండిచ్చినాము కాదా? పోండు. పోండు.

లక్ష్మ—క. రెండిచ్చితి రెండిచ్చితి
రెండిచ్చితి పోండటంచు ॥ మేలంబేలా
కండూయమానదేహ!
మండూకమువంటి కంఠ ॥ మటిమటిసుంతా.

రామ—
ఉ. కోమటిసెట్టి! నేనిపుడు కోమలవైఖరిఁ జెప్పుచుంటినో
రాముఁడ నేను లక్ష్మణవిరాజితుఁ డితఁడు నాకుఁదమ్ముఁడుఁ
బ్రేమమమీర వచ్చితిమి వేఁడుకదీరఁగ రెండురూప్యముల్
సామముగాగ నిచ్చి మరి సంతసపెట్టుధరాస్థలంబునన్.

లక్ష్మ—
శా. అన్నా! రెండని పల్కితేల యిలలో నన్నా! కవిత్వోరు పె
ద్దన్నా! ధారుణిబుద్ధిజాతికిని హైదాబ్రాదు అక్కన్న మా
దన్నా! సద్గుణగున్న కీర్తిభరచెన్నా అన్న! భట్రాజు రా
మన్నా! మాటలమిన్న! కోపమునసున్నా!యన్న! యెన్నాళ్ళకున్

రామ—శబాస్ తమ్ముఁడా!
ఉ. తమ్ముఁడ, నాదుసొమ్ముఁడవు, తప్పక సద్గుణకీర్తికాంత భా
రమ్ముఁడవౌదు, రాంకవశిరమ్ముఁడవౌదు, కవీంద్రకోటికో



రమ్ముఁడవౌదు; మార్గుల కరమ్ముఁడవౌదు, స్వదేశసత్కవి
బ్రహ్ముఁడవౌదు, రెండనుచుబల్కితిమన్ననఁ జేయుతమ్ముఁడా!

సుబ్బి—మీయాశుకవిత్వము సంతకుఁ బోవ! విశాఖపట్టణములో వెట్టియాసుపత్రిలో నుండక మీరిక్కడికేలవచ్చితిరి? పోండు. పోండు. దిక్కుమాలిన గందరగోళము వచ్చినది. సాయిలవాని వేసములతో సిద్ధమైతిరా? పోండు.

వెంక—రామన్నా! లక్ష్మన్నా! నేను జెప్పినమాటవిని మీరూరకుండుఁడు. సెట్టిగారికి నిద్రవేళయైనది.

సుబ్బి—నాకీరాత్రి మిక్కిలి తొందరపనియున్నది. మీరు నన్ను బాధించిన కార్యము లేశమును లేదు. వెంకటప్పయ్యా! చెఱియొక పావులా యిచ్చివేయుము· పోండు. పోండు! నేను బోవలయును. గ్రంథాలుచేసి యమ్ముకొనక యీ తెలివిసంధి కేకలు-ఈదిక్కుమాలిన కుక్క మొఱుఁగు ధోరణి—ఎందులకు? (పోఁబోవును)

ఉత్సాహవృత్తము.

లక్ష్మ—అన్న పోవువాఁడు యితఁడుఅట్టులడ్డు రమ్మికన్.
రామ—చిన్నవాఁడ అడ్డువచ్చి చెల్వుమీర నుంటిరా!
లక్ష్మ—అప్లఅన్న పోవుచున్న అతనిమొలనుబట్టుకో.
రామ—చిన్నవాఁడవైననీవు పెద్దవాఁడు బుద్ధికిన్.

సుబ్బి—మీయాగడము మండిపోను. నన్ను లోపలికి వెళ్ళనీయరాదేమి? నాయింటిలో నన్నుఁ బండుకొననీయరాదేమి? ఆదిగో. అడ్డువచ్చుచున్నారు. ఈచిన్న ముండకొడుకు నాకాళ్ళసందున దూరిపోవునట్లున్నాఁడు. వెంకటప్పయ్యా! కఱ్ఱతీసికొనికొట్టు! మీఁదఁబడిన యెడల నలిగి చచ్చును. జాగ్రత్త,చూచెదవేమి? కొట్టు.

ఉత్సాహవృత్తము.

లక్ష్మ—నీకుకఱ్ఱయున్న మాకు నెమ్మిగంటముండదే.

రామ—పోకు పోకు సెట్టినీవు పోకు పోకు పోకుమీ.

లక్ష్మ—నీకుకట్టియున్న మాకు నెమ్మిగంటవుండదే.

రామ—పోకు పోకు సెట్టినీవు పోకు పోకు పోకుమీ.

వెంక—(అడ్డవారించి) రామన్నా! లక్ష్మన్నా! నేను మిమ్ము సంతోషపెట్టెదను. ఆతఁడెఱుఁగకుండఁ గాగితములో మీపేళ్ళు చేర్పితిని.

సుబ్బి—ఎలాగో యొకలాగున వారికిప్పింపుము?

వెంక—చిత్తమామాటయే చెప్పుచున్నాను.

సుబ్బి—ఊఁ. త్వరగఁ బంపివేయుము?

వెంక—మీరన్నట్లు చెఱియొక రూపాయ నిచ్చెదను.

లక్ష్మ—భత్యముమాట?

క. అయ్యా! భత్యంబియరా
  కొయ్యా గోతంబ కడుపు కొరకొరలాడున్.

వెంక—ఉండుఁడు! ఉండుఁడు! ఇంకమాటాడకుఁడు. పైకిఁ బొండు. (ఇద్దఱకుఁ జెఱియొకరూపాయ యిచ్చివారిని బలాత్కారమునఁ బైకి దీసికొనిపోయి తిరిగి ప్రవేశించును.)

సుబ్బి—ఇదిగో! వెంకటప్పయ్యా! ఇదిగో! కవిగాని నెప్పుడుఁ గొంపకుఁ దీసికొని రానని యొట్టు పెట్టుకో! సిగ్గు వచ్చినదా? ఇదిగో! నీవు దొడ్డిగుమ్మమువద్ద నటునిటుఁ దిరుగుచుఁ గొంతసేపుండుము.

వెంక—ఎందుకు?

సుబ్బి—సుందరి వచ్చెదనని చెప్పినదిలే!

వెంక—ఇప్పుడెందులకు?

సుబ్బి—సంభావన మాయొద్దనుండి స్వయముగాఁ బుచ్చుకొనునట.



వెంక—అందులకుఁ దెల్లవాఱిన పిమ్మట రాఁగూడదా?

సుబ్బి—వెంకటప్పయ్యా! నీయొద్ద రహస్యమేమున్నది. ఈ రాత్రి యెందుచేతనో దానిమీఁద బుద్ధిపోయినది. శక్తి లేదని యెఱుఁగుదును. వాంఛ ప్రబలముగా నున్నది. దానిని రమ్మని చెప్పితిని; ఊఁ అన్నది.

వెంక—ఆ వేపారివాఁ డసాధ్యుఁడు!

సుబ్బి—ఏమయినను సరియే; కాని నాబుద్ధి వెనుకాడునట్లు లేదు.

వెంక—మీకంత పట్టుదలగా నున్న యెడల మీయిష్టము.

సుబ్బి—అదే, నీవాగుమ్మమువద్ద నటునిటు దిరుగుచుండుము! అది రాగానే నాకుఁ జెప్పి నీయింటికిఁ బొమ్ము. ఇంతలో నేను రవంత శ్రమ తీర్చుకొని వచ్చెదను,

వెంక—చిత్తము.

సుబ్బి—వేపారిని వదలి సుందరి వచ్చునో రాదోయని యాందోళనముతో నున్నాను,

[ఇద్దఱు నిష్క్రమింతురు.]

ఇది ద్వితీయాంకము.





శ్రీ

# కంఠాభరణము.

## తృతీయాంకము.

ప్రదేశము—సెట్టియింటిసమీపమున వీధి

[ప్రవేశము— కృష్ణరావు, సుందరి]

కృష్ణ—ఆలాగునఁగాదు-మునుపు నీవింత సొగసుగా నభినయింపలేదు. ఓ! ఏమి రాకడలు! ఏమికల్పనలు! కోమటివానిని చెంపపై నొక్కటి యీడ్చివేయలేకపోయినావా?

సుంద—అంతపని కాఁగలఁడా? చేయిపట్టుకొంటినా, దడదడలాడిపోయినాఁడు. ముచ్చెమటలుఁ బట్టినవి.

కృష్ణ—అప్పుడు నీచెవిలో వాతఁడు చెప్పినదేమి?

సుంద—ఆఁ! నీకెట్లు తెలిసెను?

కృష్ణ—కోమటిరహస్యాలాఁగునా?

సుంద—నిజముగా నీకు వినఁబడినదేమో చెప్పు! అసత్యమాడిన మొదల నన్ను జంపుకొనినట్లే.

కృష్ణ—నాకు వినఁబడలేదులే,

సుంద—(తనలో) ఇతనిని గొంతసేపేడిపింతును (ప్రకాశముగా) నాకీరాత్రి కోమటయ్య బోణీ-లాభాలమీఁద లాభాలు.

కృష్ణ—నిన్నాతఁడు రమ్మనెనా? నీ వాతని యింటికిఁ బోయెదవా?

సుంద—పోక మానుదునా?

కృష్ణ—ఆ! నిజముగానే?



సుంద—సంసారస్థితి నీవెఱుఁగనిదేమున్నది? బట్టలిచ్చిన యాతఁడు సొమ్ముకొఱకుఁ జంపుచున్నాఁడు. నీమాయ యపక తపక చేత నీకు ఋణమైనఁ బుట్టకుండ నున్నది. ఏమిచేయుమంటివి?

కృష్ణ—ఉల్లిపాయ నమ్ముకొనువారియొద్దకుఁ బోయెదవా?

సుంద—ఊళ్లేలినవాఁడు మాకెక్కువలేదు; ఉల్లిపాయవాఁడు తక్కువలేదు. పైక మెవఁడెక్కువ యిచ్చిన వాఁడే మాకుఁబ్రభుఁడు.

కృష్ణ—ఈదిక్కుమాలిన చదువులింకఁ గట్టిపెట్టి యొక్కటే మాట చెప్పుము? నీవు కోమటియింటికి వెళ్ళెదవా?

సుంద—(తనలో) ఈజన్మమునఁగాదు. (ప్రకాశముగా) వెళ్లకపోవుట యేల? నేను బోకపోయినను వాఁడెవ్వరినైనఁ బంపి పిలిపించుకొనును.

కృష్ణ—అటులైన నేనడ్డుకొందును.

[శ్రీనివాసరావు మహమ్మదీయ వేషమునఁ బ్రవేశించి వేపారిని గట్టిగఁ గొట్టును. అతఁడు క్రిందఁబడిపోవును. వేశ్యను బలాత్కారముగ నోటిపైఁజేయివైచి తీసికొని పోవును.]

కృష్ణ—(లేచి) అమ్మ! అమ్మ! నడుము విఱిగినది, కాలు తెటికిలఁబడినది. అయ్యయ్యో; కోమటివాఁడెంత పనిజేసినాఁడు! ఆహాహా! తననతురక భటునిబంపి నన్నుఁ గొట్టించి సుందరిని దనయొద్దకుఁ రప్పించుకొనినాఁడా! వీనికెప్పుడిట్టి పోఁగాలము లేదు. ఆఱువది యేండ్ల ముసలిముండకొడుకు వీని మొగము మండ! వీనికెంత దుర్బుద్ధిరో! కూరుచుండిన లేవలేఁడు, లేచినఁ గూరుచుండలేఁడు. అట్టి చచ్చునిర్భాగ్యునకు సాని యెందులకో! ఆహా! వానినననేల ఉన్న మాన్యములన్నియు వ్రాసియిచ్చితినే? ఆకాగితమింక స్థిరపడలేదులే. కాని యేమగునో చూతము. దానికొఱకిల్లంతయు నొడలంతయు గుల్లచేసి కొంటినే! సదా దానిని సేవించి తిరుగుచుంటినే!

అట్టె నన్నే యిట్లు గొంతుగోసినది. ఛీ! దానిననవలసినపనియు లేదు. దానివృత్తి యది. నేనెందఱిసానులకు మోసపుచ్చలేదు! ఇతరుల స్వాధీనతలోనున్న యెందఱికామినులను విచిత్రకల్పనలచే రప్పింపలేదు. అటులే కోమటి తనకిష్టముండినయెడల సుందరిని బిలిపించుకొనవలసినది గాని నన్నుఁ గొట్టింపనేల? అందులోఁ దురకవానిచేఁ గొట్టించునా? కావున నీకోమటికిఁదగిన ప్రాయశ్చిత్త మొనర్తును. చచ్చినట్లు తిరుగఁగొట్టుదును. ఈకోమటివానియింటివీధిగుమ్మములోఁ దురకభటుఁడు కాపుండునేమో? ఉన్న నేమి! నేను దృఢశరీరుఁడను. ప్రమాదమున నుండఁగా నాతఁడు గ్రుద్దిపోయినాఁ-కనులుచీకటులుగ్రమ్ముటచేఁ బడిపోయితిని. తురకవానితోనైనఁ గలియఁబడుదును. ఏమైననగును. (నడువఁబోవును) అయ్యయ్యో! నిలువఁబడినప్పుడంత బాధగలేదు కాని నడచునప్పుడు నడుము కలుకుమనుచున్నది. అబ్బా! ఒకనిముస మచ్చట విశ్రమించి పోవుదును. ఆహా! మాధ్వమతస్థుఁడను మహమ్మదీయతాడితుఁడనైతినే! వానిననవలసినదేమి! ఓసినిర్భాగ్యంపుముండా!

[నిష్క్రమింపఁగ వెనుక దెర నెత్తఁగ సుబ్బలక్ష్మిప్రవేశించును]

సుబ్బ—(మేలుముసుఁగుతో) ఆహా! గ్రామమంతట నల్లలాడుచుంటిని. అక్క కనఁబడలేదు. కాళ్లు లాగుచున్నవి. నిద్దుర వచ్చుచున్నది. ఇఁక నడువఁ జాలకుండ నున్నాను. ఈ యిల్లెవరిదో పంపన్నలదివలె నున్నది. ప్రక్కతలుపుగూడఁ దీసియున్నది. లోనికిఁ బోయి రవంత విశ్రమింతును, ఏడుకొండలభగవానుఁడా! వెంకటప్పయ్యా! రక్షింపు!

[వెంకటప్పయ్య-ప్రవేశించును]

వెంక—మేలుముసుఁగువైచుకొని లోనికెవ్వరో వచ్చినారు. తప్పక సుందరియే యగును. ఆప్రక్కనుండిపోయి సెట్టిగారితో నీశుభవార్త చెప్పి యింటికిఁ బోవుదును. (నిష్క్రమించును.)



సుబ్బ—ఏమి యీవిచిత్రము! వదలక వదలక సర్కసుకొఱకిల్లువదలుట యేమి! ఈమహావిచిత్రనాటకమేమి! అంతయు మాయగాఁగానఁబడుచున్నది. కన్నులయెదుటి యక్కయిట్టే మాయమైనది. మా విపత్తున కావిచ్చిముండకొడుకే కారణము. ఈబల్లపై నొక్క నిముసము పండుకొందును. పండుకొనినయెడల నేమిప్రమాదమగునో! వీధులలోఁ దిరుగుదుస్థితికంటె నిది కొంత మెఱుఁగుగదా! కానిమ్ము, భగవంతుఁడా! ఏమిచేయఁదలఁచితివో!

[సుబ్బిసెట్టి ప్రవేశించును.)

సుబ్బి—(తనలో) ప్రక్కతలుపులోన గొండ్లము లేదు కాఁబోలు! వేసెదను. అబ్బో! అబ్బో! సానులు వేంచేసినారు కాఁబోలుఁ! సుబ్బిసెట్టిగారితో సరసాలకు! బాపనయ్యల సరసాలెక్కువో, మటయ్య సరసాలెక్కువో యిప్పుడు బోధపడును. ఇప్పుడస్తినిబట్టును. బఙారసుకోకతో రాలేనట్లున్నదేమి? అబ్బ! అబ్బ! చలిచేతఁగాఁబోలు! పచ్చడము కప్పుకొనియున్నది. అబ్బో! అబ్బో! ముగమైనను గనఁబడకుండ నీసిగ్గెందులకు? సభలో నాట్యమాడి చేయిపట్టుకొని లాగి చెంపకాయకొట్టుటకు సిద్ధమై-తీర సరసాలకు వచ్చునప్పుడు బిడియాలు కాఁబోలు! వెంకటప్పయ్య మదనకామరాజుకథలలోఁ జదివిన ప్రణయకలహాలనఁగానివే కాఁబోలు! వోసీ! నాకునుఁ బ్రణయకలహము వచ్చినది. నేనును మాటలాడను. నేను ముసుఁగువేసికొందును. బిఱ్ఱబిగిసి యీలాగునఁ గూర్చుందును. ఎవరిపంతము నెగ్గునో చూతము! నామట్టునకు నేను-అఱువదియేండ్లవాఁడను-దండకడియము పెట్టుకొని భుజబంధముకట్టుకొని, మెడలో గంఠమాల వేసికొని, చలిగా నున్నను గంధముఁ బూసికొని, చిన్నబుడ్డిలోనిది పూతికపుల్లతో రవంత బట్టకొంగునకు రాచికొని, తనకీయవలసిన ముడుపేదో చెంగునమూట గట్టుకొని, నడుములాగకుండ నల్లమందు పిసరు వేసికొని, తాంబూ

లము చేతఁబట్టుకొని సిద్ధమైతినిగదా! తానుబసుపుచెది—లాభాలుగాక-అసలకుఁ బదివరాలవిలువచేయు బనారసుకోకను విడచి మునుక గుడ్డ కట్టుకొని పెదుకదుప్పటి ముసుఁగువేసికొని రానేల? చీరను బట్టియే సింగారము, మఱియేమైనయున్నదా? సీమసుపు రేకు డబ్బీలోనిదైనయెడల నారతికప్పురము-చిన్న గాజుబుడ్డిలోనిదైనయెడలఁ బచ్చకప్పురము-జన్మానికెల్ల నొక్క శివరాత్రియన్నట్టు-ఆఱుపదులు దాఁటిన తరువాత నొక్కసారి పైసరసపుఁ బసందేదో చూడవలయునని గంపంతయాసపెట్టుకొని గర్భాధానపుఁ బెండ్లికొడుకువలె నేను మూసిముసులాడుచు, గమగమలాడుచు సిద్ధమైనప్పుడు—తాను ముసుఁగువైచుకొని పూర్వసువాసినిలాగున సిద్ధమై పట్టెమంచ మాపక్క నుండఁగా బల్లమీఁదఁగూలఁబడి పండ్లుబిగ బట్టుకొని కూరుచుండునా? నే నంతకంటె బిఱ్ఱబిగిసి యుందును.

సుబ్బ—(తనలో) ఈతఁడు కోమటియైనట్లు స్వరూపము చెప్పుచున్నది, (ప్రకాశముగా) సెట్టిగారూ!

సుబ్బి—(తనలో) రా! అలాగున దారిలోనికి రా! వేశ్యబింకాలు వైశ్యునియొద్దనా? మీకు పత్వమేగాని మాకుఁ గ్రింద నైత్వము కూడ నున్నది. ఇంకొకసారి పిలిచినఁగాని మాటలాడను.

(బిగిసి కూరుచుండును.(

సుబ్బ—అయ్యా! సెట్టిగారూ!

సుబ్బి—ఆ! ఎందుకు

సుబ్బ—కొన్ని కారణములచేత నిచ్చటకు నేను రవంతసేపు శయనించుటకు వచ్చితిని. నీవు యోగ్యుఁడవని, సంపన్నగృహస్థుఁడవని విశ్వసించి వచ్చితిని. ఇదివఱకెప్పు డిల్లు దాఁటినదానను గాను. నీకిష్టమైన యెడల నుందును, లేనియెడల నిప్పుడే పోవుదును.

సుబ్బి—నాకిష్టము కాకపోవుటయేమి? రవంతసేపన్నమాట



యేమి? నీకిష్టముగు నెడలఁ దెల్లవాఱినదాఁక శయనింపవచ్చును. (తనలో) ఆలోఁతుమాట నేననుట యెందులకు? దాని నోటివెంటనే యనిపింతును. సెట్టిగారి యెదుటఁ దనకీ బెట్టుసరియేమి? కొన్ని కారణములచేత నిచ్చటకు వచ్చినదఁట! ఆ కారణములు నాయొద్ద దాఁపటికమా? సరసుఁడు సన్యాసియైనాఁడు—వేపారి వెఱ్ఱిముండకొడుకువలన సంసారము గడవదని వచ్చినది, మా కే పంతు లాఱువందలీయవలయును. తెల్లవారకుండ భటునిచేఁ బంపింతునని చెప్పినాఁడు. అతని మొగము! అతఁడిచ్చునదేమి—నేను పుచ్చుకొనునదేమి? నేనేమో దీనికి విశేషముగాఁ బెట్టుదునని యాశ యున్నది కాఁబోలు! నాయొద్ద మాత్రమేమున్నది! ఉన్నది. లేదు—ఆసంగతి తన కెందులకు? ఏదో తోఁచినంత ముట్టఁ జెప్పుదును. అయినను నేను మాత్రము లొడుగు లోపుగుపోయి నన్ను ముద్దు పెట్టుకోవే! పామీఁదఁ జేయి వేయవే! ముందునుండి కౌఁగిలించుకొనుటకుఁ గడుపడ్డమైన యెడల వెనుకనుండి కౌఁగిలించుకొనవే! బోదకాలు మాత్రము మొకకంటఁ గనిపెట్టవే, యని సరసపుమాటలు మాత్రమే నేనను. మొదటి తొందర ననుసరించి యనవలసినదే కాని యాబనారసు కోక లేకపోవుటతోనే బుద్ధి యట్టె యట్టె వెనుకకు లాఁగినది, ఏమున్నది! తూతిగాదెలోనివైన రాజనాలు—పేడగాదెలోనివైనఁ బెద్దవరి. దినుసంతయు నొకటి—ఫలమంతయు నొకటి—ఏదో బేరము కొంత కదలినదిగదా! అదిగాక-నేనే ముందు తొందరపడిన యెడల ముసు వెక్కువయగును. కావున వెఱ్ఱిముండకొడుకువలె బిఱ్ఱబిగిసి కూరుచుండెదను. (అట్లుకూరుచుండును,)

[వెఱ్ఱిరామశాస్త్రి వీధిలోఁ బ్రవేశించును.]

రామ—జ్ఞానికి దేహమునందు మిథ్యాబుద్ధి కలిగినను దేహపోషణార్థమై అనాదిసంపాదనమునందు వానికిఁ గేవల ప్రారబ్ధము వలనఁ

బ్రవృత్తి సంభవించును. తెలిసినదా లేదా ? ఉ. వానరులే నరజాతికి మూలపురుషులగునప్పుడు జగత్తంతయు నొక్కసారి యద్భుతమైన దను వాదము పూర్వపక్షమైనదా లేదా? పూర్వపుశాస్త్రిలన్నియు నూటికొకటి—కోటికొకటి, వసిష్ఠుఁడు, సనత్సుజాతుఁడు, వాలఖిల్యుఁడు నను నీమూర్తిత్రియము మూలఁగూర్చుండి ప్రకృతిమాయలాడికిఁ దిరుగలోనై పదునెనిమిది యధ్యాయములుగల భగవద్గీతనిరువదియాఱ ధ్యాయములు గలదానిగా సొంతకవిత్వము కలిపి ధ్వస్తము చేసినారు. ఔచిత్యము విడిచి కవులు కవులు తిట్టులాడి దెబ్బలాడి, న్యాయసభల కెక్కుటకు సిద్ధపడినప్పుడు—సరస్వతి యేడ్చినదనఁగా నాశ్చర్యమేమి యుద్ధనిధికై కొంతసొమ్మియ్యవలసి సర్కారుపత్రము పట్టుకొని తిరుగుచున్నాను. ఇదే నివృత్తిలోఁ బ్రవృత్తి; నాటకపుఁ బాకయొద్ద యూరలేదు—సెట్టీ! సెట్టీ!

సుబ్బి—(లోపలనుండి) ఎవరు వారు !

రామ—పంతులుగారు సొమ్ముకొఱకు నోటుపంపినారు.

సుబ్బి—వేపారియాయనే? ఆరువందలరూపాయలనోటేనా? (తనలో) ఇప్పుడు పుచ్చుకొనకుండిన వీనియొద్దనుండి సొమ్ము తిరుగ రాదు. (ప్రకాశముగా) ఉండు! తలుపుఁదీయుచున్నాను ! (తలుపుసగముఁదీసి చేయిచాపును.)

రామ—ఇదిగో! (ఒకచీటినిచ్చును.) ముట్టినదికదా!

సుబ్బి—ఇది నోటుకాదు. పంతులుపేరున్న చీటి.

రామ—చీ! సొమ్మిచ్చినట్లు రసీదు తే!

సుబ్బి—(కోపముతోఁ దలుపుదీసికొని యీవలకు వచ్చి) సొమ్మియ్యవదే రసీదా?

రామ—దులుపు! చింతపండుబుట్ట దులుపు! (కోమటిని గొట్టి లోనికిఁబోయి తలుపు వైచికొనును.)



సుబ్బి—అయ్యల్లో! ఓరయ్యల్లో! కాళ్ళులటలటలాడెనయ్యల్లో! గుండె దడదడ లాడినది. కన్నులు చీఁకటులు పడినవి! అయ్యల్లో! (తలుపుఁగొట్టుచు) అయ్యల్లో! (తనలో) ఇనుపపెట్టె ప్రక్కయింటిలో నున్నది. భయమేమియులేదు. లోపల నెవరురో! అయ్యల్లో! (నిమ్మళముగా) ఓసీ! సుందరీ! సుందరీ! లోపలనెవఁడో దూఱినాడు. దొంగ ముండకొడుకేమో! జాగ్రత్త! సుందరీ! మునుఁగుపైకిఁదీయకుమా? ముడిచిపెట్టుకొని పండుకొనుమా? అయ్యో! దానికిఁ బెట్టవలయునని పెసరపుణుఁకులు. తాటితాండ్రి మూటగట్టుకొని వచ్చినాను. పెత్తిబిం కాలుపెట్టుకొని దానినొక్కముద్దైనఁ బెట్టుకొనలేకపోయినాను. నాయేండ్లు నష్టేటగలిసిపోను! అయ్యో! అయ్యో ! బేరమై—సిసలై—సిద్ధమై—కొట్టునకుఁ జేరినసరకు చేయిదాటిపోయినది. సరకన్నా సరకా! పొల్లు, దూళి, దూగరయన్న మాటలేదే! పట్టినికరపుసరకు! నిక్షేపమువంటి దినుసు! అయ్యయ్యో! ఇల్లుదూరిన ముండకొడుకెవ్వఁడో బోధపడదు! ఆముండకొడుకెవఁడో నన్ను వీథిలోనికిఁ గెంటుసరికి నడుమువిరిగినది. బుద్ధిచెదరినది. కాళ్ళుచల్లఁబడినవి. కన్నులు పచ్చబడినవి. నాకొంపదీయుటకు వేపారిముండకొడుకే యిల్లుదూరినాఁడా యేమి?

కృష్ణ—(ప్రవేశించి) నీగొంతుఁగొయ్య! నీపొట్టబ్రద్దలుగాను! నన్ను నీభటుఁడగు తురకచేతఁ గొట్టించి నాసానినీడ్పించుకొనిపోవుదువా! దొంగముండకొడుకా! సానిని గనఁబఱపనియెడలఁ జంపుదును.

సుబ్బి—పంతులూ! చూడు! తొందరపడెదవెందులకు! నిమ్మళించు ! శాంతించు ! ఇదిగో! రవంత తాటితాండ్రికావలెనా ? సరి క్రొత్తసరకు చూడు పంతులూ! బాకినిగూర్చి నిన్నప్పుడైనఁ దొందరసేసితినా? ఏదో మనకు।మనకుఁ గాతాజరుగుచున్నది—వెళ్లనీ? ఈలాగే వెళ్లనీ?

కృష్ణ—రాసాని యెచ్చటనున్నదో చెప్పెదవా? తన్ననా?

సుబ్బి—నీవు తన్నుదువుగానిలే. ఈకాలికి విశాఖపట్టణపు భాగ్యాలుగదా? ఈకాలిమీఁద నారికురుపుగదా ! నీవు తన్నినప్పుడు నేనుగూడఁ తిరిగి తన్నినప్పుడే సొగసున్నదిగానియూరకుండినందువలన విశేషమేమున్నది? నీయెడణాలు నాచేతిలోఁ బడినప్పుడు నామెత్తెడు బెల్లము. నీచేతిలోఁ బడును. సరకు తిరుగుచున్నఁగాని వ్యాపారానికి సులువేది ?

కృష్ణ—నేననుమాటలను నీవు పరిహాసముగా గణించుచున్నావు. జాగ్రత్త. నన్నుఁ దురకవానిచేఁ గొట్టింతువా ? నాసాని నపహరింతువా? గడ్డిబొద్దుముండకొడుక!

సుబ్బి—తురకయేమి! సానియేమి ! గడ్డిబొద్దేమి ! సందర్భము లేకుండ మాటలాడుచున్నావేమి ? గవలగంగమ్మగారిహస్తోదకమేమైనఁ దగిలినదా యేమి ?

కృష్ణ—ఓరీ! నీనాలుకఁగోయ! నేనే త్రాగితినఁటరా? చావు చావు ! (గ్రుద్దును)

సుబ్బి—ఉండు ! ఉండవయ్యా! ఈతొందరయేమి ! ఈగడబిడ యెందుకు! అయ్యో! ఒక్కటే గొడవ! ఈనడువీధిలో నీయల్లరియేమి ! పంతులూ! నిమ్మళము; చూడు ! కావలసియున్న యెడలఁ బదిరూపాయలు పట్టుకొనిపోరాదా ? పదిగాకపోయినయెడలఁ బదునాలుగా యెను. నీయవసరానికి నేనీయకపోయినదెప్పుడు?

కృష్ణ—ఓరీ గాడిదా! నాసానిని నీప్రక్కలో వేసికొంటివా ? నేనునోరుమూసికొనుటకై నాచేఁ బదిరూపాయలు పెట్టెదవా ? నేను దార్పుడు కాఁడననుకొంటివా? కొట్టు. కొట్టు. (గ్రుద్దును)

సుబ్బి—అబ్బ ! అబ్బ ! గట్టిగాఁగొట్టకు పంతులూ! కోటునలిగిపోవును. ఇది నాముహూర్తమునకుఁ గుట్టించుకొంటిని. ఏదీ! నాఁటికి నేఁడు!



కృష్ణ—నీకుఁ దిరుగ నేఁడు ముహూర్తమా! సానిపరసానికైనా యీపట్టుకోటు సింగారించితివి ! ఈకంఠమాల పెట్టితివి ? నాసాని యెచ్చటనున్నదో చెప్పు. లేనియెడల డొక్కచీల్చెదను.

సుబ్బి—ఉండవయ్యా! ఉండవయ్యా! ఒక్కటేతొందర! ఏదైనా దిరకాసు వచ్చినయెడల మనలో మనము వ్యవహారము సర్దుబాటుఁ జేసుకోవచ్చుననఁగా—ఒక్కటేగోల ! అయ్యో ! సానిసానియని యరిసి గొంతు చింపుకొందువు. సానినేమైన నమలివేయుదురా? మ్రింగివేయుదురా? దొడ్డసానిని సంపాదించినావు! అయ్యో; ఊరుద్దాటిపారిపోవుదుననుకొన్నావేమి ? ఎక్కడనో యొకచోట నుండక మాయమగుననుకొంటివా యేమి ?

కృష్ణ—అది యెచ్చటనున్నది ? మీయింటిలో దాఁచితివా ? చెప్పు. చెప్పు. (కొట్టును).

సుబ్బి—వీఁపుమీఁదఁ గొట్టకు మాతే! యీతుంటిమీఁదఁ గొట్టినయెడల దామరదురదయు దీరును, నీసరదయుఁ దీరును.

కృష్ణ—పౌణకంతముండకొడుకవు గాన దెబ్బ నీకు బ్రహ్మరంధ్రమున కంటలేదు. (రెండుచెవులు పట్టుకొనును) చెప్పు. చెప్పు. నాసాని నీయింటిలో నున్నదా ?

సుబ్బి—అయ్యల్లో ! ఓరయ్యల్లో ! వదలు వదలు వదలుదునుఁగాను ! అయ్యో! అయ్యో! ఎక్కడనో మోటుసరసాలు, ముక్కునొగమెఱుఁగనివానిలాగున !

కృష్ణ—చెప్పువఱకు వదలను. (గట్టిగలాగును)

సుబ్బి—అయ్యల్లో ! అయ్యల్లో ! ఉన్నదిబాబు. ఉన్నదిబాబు.

కృష్ణ—తురకయే దానిని దీసికొనివచ్చినాఁడా ?

సుబ్బి—ఇఁక వదలుము. కావలసినముచ్చట యేదోయయినది కాదా ? పూసగుచ్చిన ట్లన్నియుఁ జెప్పెదనువదలు. నన్నుఁగొట్టఁగలిగితివికాని—వెంకటప్పయ్యనుగొటు—సాగఁదీసి వదలిపెట్టును.

నన్నువీఁడు వదలునని తోఁపదు. కోమటియాతఁడేఁడీ! అయ్యయ్యో ఇదినాకు స్వప్నము కాదుగద!

రామ—పండితరాజేంద్రునకు ధామ్; తిరిగి మందు కూరవలయును. (చిలుముగొట్టములో గుడ్డఁ గుక్కును.)

సుబ్బ—ఇఁక మానప్రాణములు దక్కవు. పాఱిపోవుటకు లేచినయెడలఁ బట్టుకొనును. హా! భగవానుఁడా! ఈచిక్కునుండి విముక్తిసాధనమేదైనఁ దోఁపింపవా?

రామ—వెఱ్ఱిముండకొడుకునకు ధామ్; ఇఁక నంతే.

సుబ్బ—ఈతనివలెనే వెఱ్ఱితనమును నటించి యేదో యల్లరిచేసినఁగాని నన్నీతఁడు విడుచునట్లు తోఁపదు. ఎట్లో మర్యాద దక్కించుకొని బ్రతికి బయటఁబడవలయును. ఈతఁడు మొద్దులాగున నున్నాఁడు. ఏమో! మొట్లీతనితోఁ దంటాలు పడవలసివచ్చునో ధైర్యమవలంబింపవలయును. మొండితనమును బూనవలయును. మానప్రాణసంరక్షణార్థమయి యేమిచేసినను దప్పేమున్నది? అయినను నన్నిక్కడఁ జూచువారెవరున్నారు? ఇతఁడు పిచ్చివాఁడే కదా! వీధిలోనికిఁ బోయిన కోమటిని మానపుచ్చి యీతఁడు లోనఁ బ్రవేశించినాఁడు కాబోలు! కానీ! ఈదుప్పటియేల? తీసివైచి కూరుచుండెదను. అయ్యయ్యో! తీర పిచ్చి నభినయింపఁగలనో లేదో! ఈకర్మమెప్పుడైన నెఱుఁగుదునా యేద్తునా?

రామ—ఓహో! వహవ్వా! సెభాస్! బలీ! ఏమిది! యేమిది! ఓహో! సజీవసాలగ్రామము! కూర్మమూర్తి! వహవ్వా! పార్థివలింగము మాశారదాపీఠములో నవతరించినది! ఈమె మంగళసూత్రవిచ్ఛిత్తికాలమందే మాయజ్ఞోపవీత విసర్జనమైనట్లు కనఁబడుచున్నది. ఎటులైననేమి? శుద్ధబ్రహ్మచారిణీతత్వము. ఇఁకఁ బూర్వపుణ్యప్రభావముచేత నది రామశాస్త్రికి గృహిణి కావలసియున్నది.



ఇట్టి దుప్పటికట్టుట—ఇట్టి పెండ్లిమంత్రములు చదువుట—ఇట్టి సూత్రధారణము చేయుట — అంతే-అష్టమహిషీకల్యాణము. తాళ్ళపాకచిన్నన్నగారిదటు—అనాథమహిషీకల్యాణము తర్కశిరోమణి రామన్నగారిదిటు. వహవ్వా! పెండ్లికొడుకు వచ్చుచున్నాఁడు! ఓహో హో! ఓహోహో! ఓహో! ఓహోహో! ఓహోహో! ఓహో! (సవారిమూలుగు) పల్లకిబొంగు పందిటికిఁ దగులుచున్నది దింపు బ్రహ్మరథము దింపు! పెట్టు! వెఱ్ఱిముండకొడుకా! కుడికాలు ముందునకుఁ బెట్టు! హరిః ఓమ్ "శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణమ్ చతుర్భుజం ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వవిఘ్నోపశాంతయే" మంత్రాలు మానివేసి—ఆమశ్రాద్ధము చేయించినట్లు చేయింతును. అందులో నత్తగారి శ్రాద్ధము మొదలుపెట్టినట్టుగాని కర్చుకాకుండఁ జేయింతును. పూర్వసౌభాగ్యవతీ! ఆచమనము చేయుము! వ్యాసంక రాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిం, ఆవ్యాసుఁడు విధంతుప్రక్రియలో మాత్రము వీరపురుషావతారము! నీభర్త పేరేది? ఇదే గట్టిచిక్కైన ఘట్టము! ఉన్నయెడల విధంతువ్యక్తి కసంగతత్వాక్షేపము వచ్చును. శశవిషాణన్యాయముచేత- లేనియెడల వివాహమునకుఁ బ్రసక్తియే లేదు. ఉన్నదా లేదాయను మీమాంసలోనే కదా సాంఖ్యులకు యోగులకు జుట్టుజుట్టు పట్టువఱకు వచ్చినది?

సుబ్బ—ఇప్పుడు మనకు నంతే! జాగ్రత్తగానుండుము.

రామ—నీకు జుట్టేది? హెహెహె! (నవ్వును)

సుబ్బ—నీమతియున్న స్థలముననున్నది. పోయి వెదకి తెచ్చుకొనుము! ఛో! మాటలాడకు! దూరముగఁబో!

రామ—పనిలోఁబని నీజుట్టుకూడ దీసికొనిరమ్మందువా? నవరాలు సౌభాగ్యవతులకు శైలూషులకే చెప్పినాఁడు గాని యతులకు విధంతులకు మనుస్మృతిలోఁ జెప్పియుండలేదు. ప్రత్యక్షప్రాయశ్చిత్త

మేకాని పనికిరాదన్నచో బ్రహ్మాంతరమగునా! ప్రత్యామ్నాయ ప్రాయశ్చిత్త ముండితీరవలెను.

సుబ్బ.—నిజమే! ఎల్లకాలము మామిడికాయలు తినవలయున నిన నీశ్వరుని తరమగునా? మాగాయ, మెంతికాయ, తోడమెంతికాయ, ఆవకాయ, బెల్లపుటావకాయ దప్పళపుటూరగాయ యుండితీరవలయును. ఏది! తాండ్రకాక—

రామ—సెబాస్! నీవుకొంత శాస్త్రప్రవేశమున్నదానివలెఁ గనఁబడుచున్నావు! మనము ముఖాముఖిని గూరుచుండి త్వంశుంఠా త్వంశుంఠ యనుకొనకుండఁ బసందుగఁ బూర్వపక్షసిద్ధాంతాలను పఠించుచుఁ గ్రమముగాఁ జేయిచేయిఁ గలుపుకొన రవ్వంతసేపు శాస్త్రప్రసంగముతోఁ గాలక్షేపము చేయుదమా? మధ్యస్థుఁడు లేనివాదము, పురోహితుఁడు లేని పెండ్లివలె నసమంజసముగావున నిదిగో! మధ్యస్థపీఠమునఁ జిలుముగొట్ట ముంచుచున్నాను. ఇదిగో! నేను జుట్టుముడివైచుకొని, నడుముకట్టుకొని, యుపదేశముద్ర పట్టుకొని సిద్ధముగానున్నాను. ఇఁక నీవు ముసుఁగు జెనకనీయకుండ వైచుకొని యడ్డుకట్టు గట్టిగా బిగించుకొని బ్రహ్మాసనముమీఁద కూరుచుండి పళపళఁ బూర్వపక్షమెత్తుదువో సిద్ధాంతమెత్తుదువో కాని! లేనియెడల నేను సిద్ధముగానున్నాను. ముముక్షువునకు సాధనద్వయమున్నదని చెప్పివారుగదా—వానిలో నంతరంగసాధనమేది? బహిరంగసాధనమేది? దాని క్రమమేలాగు? దీనిక్రమమేలాగు? దీనికి దానికున్న భేదమేది?

సుబ్బ—పనసకాయకూర రెండుమార్గములుగా వండవచ్చును. పులుసుపెట్టి వండుట యొకటి—పెసరపప్పువేసి వండుటయొకటి. పులుసుపెట్టినదాని కావఁదగిలించినయెడలఁ దమాషాగానుండును. పప్పువేసినదానిలో నట్టి పడియములు వేసినయెడలఁ బసందుగానుండును. దానియందుఁ గారగుణము హెచ్చు. దీనియందుఁ దక్కువ. సంతర్ప



ణముల కది సాగను—సంసారపక్షములో నిది సాగను. పర్యవసానమే మనగా—ఆవ పెట్టిన దంతరంగసాధనము—పప్పువేసినది బహిరంగ సాధనము.

రామ—సరే. గురికి బారెడు హెచ్చుతగ్గుగా జెప్పినావు. చూడు! అహంబ్రహ్మజ్ఞాన మెవ్వరికి గలుగును?

సుబ్బ—మా బావగారికి గలుగును.

రామ—మీ బావగారు వసిష్ఠుఁడా? వ్యాసుఁడా?

సుబ్బ—నా పాలిటి మంగలివాఁడు.

రామ—నీవు కప్పదాటులు వైచుచున్నావు. చూడు! పూర్వజన్మవాసనయొక్క యానుపూర్వక వివరణమేది?

సుబ్బ—వాసనయనునది యనేకవిధములుగానుండును. ఒకనికిష్టమగు వాసన మఱియొకనికి గిట్టదు. కొత్తిమీరి కొందఱకు నల్లివాసన. వేపారుల కింగువయందెక్కువప్రీతి. అది తిరుగ రెండువిధములు. చెక్కయింగువయని, పొడియింగువయని; పొడియింగువ చారులో వేసినయెడల నుల్లిపాయలవాసన—ఆయుల్లి తిరుగ ద్వివిధము—కాకరకాయ పచ్చిపులుసులో నీరుల్లిపాయయే యుండవలయును. తెలకపిండికూరలో వెల్లుల్లియే యుండవలెను. ఉల్లిచేసిన మేలు తల్లియయినఁ జేయదని యందురుకదా అది యేయుల్లియో నీవుచెప్పు?

రామ—తిరుగఁబడి యీసారి కోటి నీవెత్తినావా? నీకు బాకశాస్త్రపాండిత్యమేకాని భాషాధ్యయనమున్నట్టు కనఁబడదు. కాని నీపాకశాస్త్రపాండిత్యము నావద్దఁ బనికిరాదు. నేతివాక్యాలలో మునిఁగి తేలిన ముండకొడుకను. జాగ్రత్త. ఇదిగో! మఱియొక ప్రశ్న పంచభేదములనఁగా నేమి?

సుబ్బ—రుద్రాక్షంచుపంచె, మామిడంచుపంచె, గోవులపంచె ఒకటిరెండు గలిపినైదు.

రామ—నీలెక్క సరిగానే యున్నదిగాని నీకు శాస్త్రజ్ఞానమున్నట్లు మాత్రము కనఁబడదు. అయినను "నత్వేవాహంజాతు నాసం" అనుశ్లోకములో ద్వైతముగా కనఁబడుచున్నదిగదా-త్వమేవాహం" అను దానిలో నద్వైతము స్పష్టముగానున్నదిగదా-ద్వైతాద్వైతమతసంబంధసాంకర్యమన్నివేళమునకు హేతుభూతత్వమైన కారణమేమి?

సుబ్బ—ద్వైతులు నిలువుబొట్టువారు; అద్వైతు లడ్డుబొట్టువారు. ద్వైతులలో మగవారు తఱచుగాఁజుట్టకొల్తురు. అద్వైతులలోఁ దఱచుగాఁబొడుముపీల్తురు. వారిలో నాడువారు కచ్చవోసిబట్టకట్టుకొందురు! వీరిలో నడ్డుకట్టాచారము. వారిలో వితంతువులు రాత్రియందుకులేకాని తినరు. వీరిలోమినుపరొట్టె మొదలైనవి తిందురు. వారు పచ్చడులు చేయుటలో సమర్థులు. వీరుకూరలలోగట్టివారు. వారికేకాదశీనియమము, వీరికి శివరాత్రినియమము.

రామ—చూడు! నిన్ను వెట్టియానువత్రిలోఁ జూచినట్లు జ్ఞప్తి యున్నది. అయినను శాస్త్రప్రసంగముగట్టిపెట్టి సముచితముగ లౌకికవ్యాపారప్రశంస కొంతఁజేయవలయును. ఇంతదూరమునుండి నీకు నాకు నెగుడుదిగుడుగా నున్నదిగాన దగ్గఱకువచ్చి—మఱి—దగ్గఱకువచ్చి దగ్గఱఁ గూరుచుండును)

సుబ్బ—ఉండు. దూరముగానుండు. (వెనుకకుఁబోవును)

రామ—వ్యవహారసత్యత్వ మంగీకరించినప్పుడు సందేహమింతమాత్రము నుండఁగూడదు. శుక్తిరజతభ్రాంతిలో దూరముగా నున్నంతసేపే రజతత్వముగాని దగ్గఱగాఁ బోయిన తరువాత=(దగ్గఱకుఁబోవును) శుక్తిత్వము నిలిచెనందువా లేదా? ఇంకను దగ్గఱగాఁబోయి మఱియింకను దగ్గఱగాఁ బోవునప్పుడు=ఆశుక్తిత్వమును బోయి బ్రహ్మత్వమగునా కాదా? మతగురువులందఱు సన్యాసులేకదా? వహవ్వా



బేహాగ్—చతురశ్రచాపు.

సాససనిధధ పధపమగ మరిగ సాససా
బోడిఁ వేపూఁబోఁడివే నినుఁ జూడవేఁడుకయ్యోనే॥
మాఁమమాగమపాసాససానిసరీ నినినిధపధప ధనీధపా
యేడనుండివచ్చినావో యెవతెవో మెఱిఁగింపవే॥బోఁడి॥
పపపపపసాససా పపపపపపపసాసస
తధిగిణత బోఁడివే తకదధిగిణత బోఁడివే॥

(తాళమువేయుచు నాట్యముఁ జేయును)

దంపులపాట. హిందూస్తాని కాఫి-త్రిశ్రచాపు.

సుబ్బ—

సాపాపాపాధాపా మమ పామాగరిసా
నీనీనీ సామామాగరిగారీ సనిసా ॥సాసా॥
నువ్వన్న నువ్వన్న సొగసులమిన్న
కలువలరేకుల కన్నులగున్న ॥నువ్వ॥ ఉ, ఉ.
చాయపప్పుదంపినముడిపప్పులయ్యెఁ
గందులు విసరిన సెనగపప్పయ్యె॥ ఉ. ఉ. నువ్వ॥
కోడలికి వేవిళ్లు మొదలు పెట్టినవి
అల్లునికి గాజులు దొడిగించినాము॥ ఉ. ఉ. నువ్వ॥
నామగఁడు తామర పీఁపంతబ్రాకె
చెవులు గోసినఁగాని మాసి పోదయ్యె॥ ఉ. ఉ. నువ్వ॥

రామ—

వహ్వా! నువ్వన్నా నేనేను, నేనన్నా నువ్వే,
నువ్వు నేను గలసి గువ్వ లౌదాము. ఉ. ఉ. నువ్వ॥
వహవ్వా! ఈసంసారము నీది! ఈయిల్లు నీది! ఈవాకిలి

నీది-అను పూర్ణాభిమానము నీకుండఁబట్టి లక్ష్మీదేవివరకలాగున విభూతిరుద్రాక్షులతో నాకాశమంత ముసుఁగుతో గల్లుగల్లుమంచువచ్చి సంసారపు టంగులన్నియుఁ జేసికొనుచున్నావు. ఇఁక నీకడుపున రెండు కాయలు గాచి—అందొక్కకాయ కోతకాయ, ఒకటిపిడిచి పుచ్చుకొనుకాయయగునెడల నేదో దానికది సరిపోవుచు-చేతిదండుగ లేకుండఁ గాలక్షేపము జరుగునని యున్నది. పడుకగది మనకు దక్షిణమున నున్నఁగాని వీలు లేదు గదా! అందును గూర్చి యేమి యోజించినావో చెప్పు!

సుబ్బ—గోవు పాటవచ్చును. గోవిందరామ పాటవచ్చును. ఏది పాడుమనిన నదిపాడఁగలను. కుక్కుటేశ్వరములో స్నానముచేయఁగా రొంపపట్టినదని గోదావరీస్నానమునకుఁ బోవఁగా మొసలి యీడ్చుకొని పోవలయునా? తుంటికిఁ బెట్టినఁ గంటికిఁ గంటికిఁబెట్టినఁ దుంటికైనప్పుడు-అదిగో! దగ్గఱకు వచ్చెద వేల? దూరముగఁ బో! పో దూరముగఁ బో!

రామ—మరుమరీచికా న్యాయములో దగ్గఱకుఁ బోయినకొలఁదియు దూరముగాఁబోవుట సంప్రదాయమేకదా! నరకమునకు స్వర్గమునకు బెత్తెడేకదా యెడము! మనము తరువాతఁ గుంభీపాకములో నున్నప్పటికి- ఇప్పుడు నిన్నుముద్దు పెట్టుకొనుటమాత్ర మజాగళస్తనన్యాయము గాకుండ నవినాభావసంబంధముగాఁ దప్పదు.

కీర్తన

జంఝూటి—చతురశ్రచాపు!

గాగా మగరిస సాస సారి పామమా
ముద్దిడరావె మోహనాంగిరో! ముద్దిడరావే ॥

(ఆడుచున్నాఁడు)



మామమామ మామమ మమ మాధపమాగరిసారి
ముద్దరాలా! నాపైనీకు మోడిగల్గ నెందుకే॥ ముద్ది॥
మామమగమ పప్పధాధధానిధపప్పధాధ ధాథపమా
కందిపప్పువంటి గారెముక్కవంటి ముంజెకాయవంటి
గాగగ రిస సారి॥
పొడుముపట్టువంటి ॥ముద్దిడరావే! ॥ (నాట్యముజేయును)
సుబ్బ— గౌళ—త్రిశ్రచాపు.
సాససస సారిసా సానీసారీరి, నీసనీసారిరిస సానీసా
అప్పడాల్వడియాలుగోవిందారామ-అకులందుంచిరి గోవిందా
పప్పులు పచ్చడులు గోవిందారామ-పళ్లెములనుంచిరి గోవిందా
వివిధంపుశాకముల్ గోవిందారామ-విస్తళ్లనుంచిరి గోవిందా
బజ్జులుపులుసులు గోవిందారామ- వడ్డనలుచేసిరి గోవిందా
పాలుమీఁగడదెచ్చి గోవిందారామ-పాత్రములనుంచిరి గోవిందా
అలభరద్వాజుఁడు గోవిందారామ-ఆరామలక్ష్మణులు గోవిందా
కడమవారందఱు గోవిందారామ-కలసిభుజించిరి గోవిందా
వత్తులయిపోయినవి గోవిందారామ-ప్రత్తి దొరకలేదు గోవిందా
పెండ్లిండ్లతొందరను గోవిందారామ-మంగలేదొరకడు గోవిందా
రామ—రావణుఁడురంభతో గోవిందారామ-చేయిచేయికలిపె గోవిందా (చెయిపట్టుకొనఁబోవును)
సుబ్బ—రంభరావణునంత గోవిందారామ-కాలితోఁ దన్నెను గోవిందా (తన్నుచున్నది)
రామ—అనురేందుఁడంతట గోవిందారామ-పైఁట నొడిసిలాగెగోవిందా (పట్టుకొనును)
సుబ్బ—పైఁటపట్టుకొనఁగ గోవిందారామ-మొగమంతబరికినది గోవిందా (బరకును)

రామ—ముండి రావణుఁడంతి గోవిందా రామ-ముద్దిడుకొనఁబో
యె గోవిందా (తలపట్టుకొని ముద్దిడుకొనఁబోవును)

సుబ్బ—ముండకొడక యుంచు గోవిందా రామ-మూతిపైఁ గొట్టె
ను గోవిందా (కొట్టును)

రామ—యజ్ఞపశువు యజమానుని మూతిమీఁద దన్నకుండిన యెడల రామశాస్త్రి యీసరికి సోమపానము చేత రామసోమయాజి కావలసినదే-కుండలాలు ధరించుటకు నీ చెవులకుఁ జిల్లులున్నవా. ఏదీ దగ్గఱగా వచ్చి చూడవలయును.

సుబ్బ—ఈమాటు దగ్గఱకు రా! నీత్రాడు ద్రెంపెదను.

రామ—హాహాహాహా! ఏమి సరసము! ప్రపంచమేమి చిత్రమైన నాటకము! కవినాటకమంతకంటెఁ జిత్రమైనది! కాళిదాసాదులు తమ నాటకములలో బుద్ధిచాకచక్యసంపన్నుఁడైన నాయకుని సుందరియగు నాయికతోఁ దారసింపఁజేసి శృంగారరసమును వర్ణించిరి. కాని యీమహావిచిత్ర నాటకములో మతిలేనివాఁడను నేను కథానాయకుఁడను. నాకంటె మతిలేనిది అపిచ—బోఁడిది—నాయిక—పహవ్వా! తప్పులశృంగారము! బరుకులసరసము! చెంపపెట్లసయ్యాటము! నాకు మతిలేకపోయినను మమ్మిట్లు కూర్చిన యాకవిబ్రహ్మకు మతిలేదా? హిహిహి! అపూర్వసౌభాగ్యవతీ! నీకు నాకు ఘటత్వాత్పటత్వాత్ వఱకు వచ్చుటయేకా గభిత్వాత్ గుభిత్వాత్ వఱకుఁ గూడ వచ్చినది. ఇప్పటియుద్ధమేదో చల్లారినతరువాతఁ గ్రమముగాఁ బిల్లత్వాత్ జెల్లత్వాత్ లోనికి దిగఁగూడదా?

సుబ్బ—దిగకేమి? నేను దింపుదును. గాడిపొయ్యిమీఁదనుండి పులుసు కళాయిని చెవులు పట్టుకొని దింపుదును.

(రెండు చెవులు పట్టుకొని యీడ్చును)

రామ—చెవులు బిగింపుచేత "కై" మని శ్రుతి తారకములోఁ బడి



నది. అహాహాహాహాహా! మా భారతమునకుఁ గర్ణపర్వమే యారంభము. అయినను శల్యపర్వములోనికిఁ బోవుచున్నది. అబ్బ! అబ్బ! ఈ స్త్రీపర్వమే వెడిసికొట్టిన యెడల మాకిఁక స్వర్గారోహణపర్వము తప్పదు. భారతముకంటె మాకు రామాయణమునందే యెక్కువ ప్రీతి (అని సుబ్బలక్ష్మి చెవులు పట్టుకొనును)

హిందూస్తానీ కాఫీ — చతురశ్రచాపు.

సా సా పా పా పా పా పా ధ ప మా గ మ ప మగ మా

రా వెరా వెలంకిణీ! రా వే మొళంకిని

పామాంగారి సానిధాని! సామగారి సససా

రా వెరా వెలంకిణీ! రా వే మొళంకిని

సుబ్బ—పోరపోరకోఁతిగాఁడ! పోర యోరిపోతుగాఁడ

పోరపోరకోతిగాఁడ! పోర యోరిపోతుగాఁడ (గెంటును)

రామ—గిఱ్ఱుగిఱ్ఱు త్రిప్పి త్రిప్పి క్రిందఁబడఁగఁ గొట్టెదను

రా వెరా వెలంకిణీ రా వే మొళంకిని (లాగును)

స్బు—మూతిపండ్లు విరుగఁదన్ని ముక్కుఁడబీఁకెదను

పోరపోరకోఁతిగాఁడ! పోర యోరి పోతుగాఁడ (గెంటును)

రామ—యిట్టెయిట్టె నిన్నుఁ బైకి నెగురవైచి తన్నెదను

రా వెరా వెలంకిణీ రా వే మొళంకిని (లాగును)

సుబ్బ—చెఱుకుముక్కలాగు నిన్ను గొఱికి నమలివైచెదను

పోరపోరకోఁతిగాఁడ పోర యోరిపోతుగాఁడ (గెంటును)

రామ—చిట్టినారకమ్మలాగు చీల్చిచీల్చివైచెదను

రా వెరా వెలంకిణీ రా వే మొళంకిని (లాగును)

సుబ్బ—(వదలివైచి) పోపో! దూరముగఁబో! పో!

రామ—తోఁక నడుమునకు గట్టిగఁ జుట్టఁబెట్టెదను.

(నడుముచుట్టు చేయి త్రిప్పి పట్టుకొనును)

సుబ్బ—(వదలుచుకొని) హాహ్హా! శరభశరభో! శరభశరభ శరభో! శరభ! నూటయెనమండ్రెక్కసెల్లెండ్రోయి! హ్హా! పొలిమేర కాపు పొలిమేర కాపో! హ్హా! వార వార వారోయి! హ్హా! దున్నపోతు నెత్తురు నెత్తురోయి! హ్హా! మీజాతర నాకు వద్దోయి! హ్హా! పేలాలు వేఁచినట్లు వేఁపుదునోయి! హ్హా! ఊరూరంత పురుగు నాకిపోయినఁగాని వదలనోయి! హ్హా! ఇంతలోఁ జల్లఁబడఁదలఁచుకొనలేదోయి! హ్హా! (అనినోరు తెఱచి సివాలాడును.)

రామ—(గడగడ వడఁకుచు) కాశిలో నాగేశ్వరశాస్త్రులు నాకుఁ జేతఁబడి చేసినప్పుడీగ్రామదేవతనే పంపినాఁడు. అదిగో! నోరు తెఱచుకొని మీఁదికి వచ్చుచున్నది.

సుబ్బ—వేఁపమండతో వీఁపు పగులగొట్టుదును కస కస, కఱకఱ, కటకట నమలి గుటుకుగుటుకు మ్రింగెదను. పోకు. పారిపోకు. కాలిక్రింద నల్లిని నలిపినట్లు నలిపెదను. పల్లాలమ్మ నెఱుఁగుదువా? గొట్టాలమ్మకంటెపైది. చలిమిడి చలిమిడి! చిమ్మిలిచిమ్మిలి! వహవ్వా! మునగాకు కూరలో ముక్కసెవులు నంజుకొందును. హాహాహాహాహా పంబపంబపంబో! శరభశరభశరభో! శరభ!

రామ—అమ్మయ్యో! అమ్మయ్యో!

(సుబ్బలక్ష్మిగళ్ళదుప్పటి కప్పుకొని రామశాస్త్రియొక్క మూల ముడుచుకొని పండుకొనును.)

సుబ్బ—అమ్మయ్యా! బ్రతికితిని. మనకంటెఁ బిచ్చివానికెక్కువ భయముండునుగాఁబోలు! అందుచేతనే నన్నాతఁడు బలాత్కరింప లేకపోయినాఁడనుకొందును. ఎటులైననేమి? దైవకటాక్షమున బ్రతికితిని. (నేపథ్యమున) కొట్టు. తలుపు పగులఁగొట్టు. లాగివేయుము,

సుబ్బ—అయ్యయ్యో! ఇదియేమి! మాగత్తరలో నిదివఱకిది వినఁబడియుండలేదు కాఁబోలు! అయ్యో! తలుపుపగులగొట్టి యె



వ్వరో లోనఁ బ్రవేశించునట్లున్నారు. తిరుగనిదియేమి ప్రారబ్ధమో! ఇల్లువదలి యెట్లుపాఱిపోవుదును? తిరిగ వితంతుస్వరూపమునఁ బాఱిపోవుటవలన నేమి యుపాయమగునో? (అటునిటుఁ బరికించి) గోడలకుఁ గట్టినవవియేమి? నటకుల గడ్డములు మీసములు కాఁబోలు! ఇవిధరించి పాఱిపోవుదును. తురకదుస్తుకూడ నిక్కడ లేకుండునా? ఈ పెట్టియందేమున్నదో (చూచి) ఇదిగో ఈమరాయిని, సీయంగరఖను ధరించి పాఱిపోవుదును. వీధిలోన నేకులున్నట్లున్నారు? వారింటిలోఁ జొరబడుసమయములో వీధిలోనికిఁ బాఱిపోవుదును. (గోవులపంచెమీఁద నే యవిధరించి తురకవేషము వేసికొని) హా! భగవంతుఁడా! ఎంతగతి కల్పించితివి! పెద్దలు చెప్పినమాట వినక వీధినిబడి యాడుదాని కింతకంటె మంచిగతియుండునా? హా! మాయక్క యేమైనదోగదా! అదిగో లోనికెవరో వచ్చుచున్నట్లున్నారు! పారిపోవుదును.

కృష్ణ—(ప్రవేశించి) ఆఁగు! ఆఁగు! నన్నుఁగొట్టినతురకవు నీవేనా? (పట్టుకొనఁబోవును)

సుబ్బ—(పట్టుతప్పించుకొని) ఇప్పుడుఁగూడఁ గొట్టినది నేనే! (కొట్టి పారిపోవును)

కృష్ణ—సెట్టీ! సెట్టీ! నన్నుఁగొట్టిన తురకవెంట నేను బోవుచున్నాను. ఆతనిఁజావఁగొట్టి యిప్పుడేవచ్చెదను. లోపల సుందరియేయుండునెడల నామెను మాత్రమిల్లు దాఁటిపోనీయకుము. జాగ్రత్త. జాగ్రత్త. (పరుగెత్తును)

సుబ్బి—(ప్రవేశించి) వేపారిముండకొడుకు నడుమువిఱుగఁగొట్టినాఁడు. షష్ఠిపూర్తిజా సంబరాలు సొగసుగనేయున్నవి. సుందరి సరసాలంతకంటె సొగసుగానున్నవి. లోకువయనికాఁబోలు. పంతులు నన్నుఁ గొట్టినాఁడు నన్నుఁ గొట్టినాఁడో తురకవానిచేత దెబ్బలుపడినాఁడో! ఇంతేకాదా! బాకీ వడ్డితోఁదీరిపోయినది. ఇదిగో. సుందరి. నేఁజెప్పినట్టుగళ్ళదుప్పటి కప్పుకొని ముడుచుకొని పండుకొన్నది. సుం

దరీ సుందరీ! పిచ్చివాఁడు నీయొడలిమీఁదఁ జేయి వేయలేఁడుగద! ఇదిగో వినుము వేపారయ్య వెళ్ళినాఁడు. వెత్రిముండకొడుకు కూడ సందడిలోఁ బోయియుండును. ఇదిగో నీవు నేను దప్ప నెవ్వరును లేరు. ఇదిగో ఒక్క ముద్దు (దగ్గఱఁగూరుచుండి) ఏదీ! ఏదీ! (పైనిబట్టిచూచును) ఇదేదో గట్టిగాఁదరవాణికుండలాగునున్నది. ఇది తలగాఁబోలు. నేనువంగి ముద్దుపెట్టుకొనుటకుఁ గడుకష్టముగానున్నది కావున నీవు తలయెత్తి ముద్దుపెట్టుకో. ఊ. చెప్పినమాటవినుము. వెత్రిముండా ఇదిగో! తాటితాండ్ర. రవంతముక్క తిందువుగాని లే! ఈబింకాలతోఁ దెల్ల వారిపోనీయకు! వేపారయ్య తిరిగివచ్చునేమో! ఏదో ఈవిశొక్కడికి కోమటయ్యాచేయి చల్లనిచేయి, లాభాలచేయి, సెట్టిని గనిపెట్టుకొన్నవారెవ్వరు నిదివఱకుఁ జెడినవారు లేరు. ఇదిగో ఊఁ (రామశాస్త్రి తల పట్టుకొని యెత్తును)

రామ—(లేచి) అమ్మవారిజాతరకు ధామ్; పోతురాజవీపుఁ పై ధామ్. (సెట్టినిగొట్టి పాఱిపోవును.)

సెట్టి—అయ్యల్లో! అయ్యల్లో! వెత్రిముండకొడుకు, కాఁబోలు! వీపుమీఁదఁగొట్టి పాఱిపోయినాఁడు అయల్లో! ఓఅత్తయ్యో! ఎవరునుమాటలాడకుండ నున్నారేమల్లోయి! ఏముహూర్తాన దిక్కుమాలి నషష్టిపూర్తి యారంభించితినో కాని తన్నులు, దెబ్బలేలాభాలు! పోయినదబ్బు పోయినది. దెబ్బలామిగులు. ఇదిగాక కంఠాభరణము వేపారివానిచేతిలోఁ జిక్కుకొన్నది! వేశ్య యేమైనదో కనఁబడదు. అంతయు మహామాయగానున్నది! పిచ్చివానియల్లరి యెక్కువగానున్నది. వేపారికిఁ దగినబుద్ధి చెప్పించినఁగాని నిలువఁదరమా? ఇప్పుడు వండుకొననేల? ఇప్పుడేపోయి ఠాణాలో ఫిర్యాదుచేసి వేపారిని గారాగృహమునఁ బెట్టించితీరుదును. పిచ్చివానినిగూడ బందిలోఁ బెట్టింతును. వెంకటప్పయ్యను బిలిపించి యిప్పుడే పోవుదును. సుందరియేమైనట్లో! దాని నెత్తికొనిపోయిన సాహేబెవ్వఁడో. (నిష్క్రమించును)

ఇది తృతీయాంకము.



శ్రీ

# కంఠాభరణము

## చతుర్థాంకము.

ప్రదేశము—మఱియొక వీధిలోనియిల్లు.

ప్రవేశము—రుక్మిణి, సుబ్బలక్ష్మి తురక వేసముతో.

రుక్మి—నాయనా! నాయనా! అంతతొట్రుపాటేల?

సుబ్బ—మీరు తురకలా?

రుక్మి—(అదరిపడి) కాము. నీవుతురకవా? ఇచ్చటికేలవచ్చితివి?

సుబ్బ—అమ్మా! నేనాఁడుదానను. నాపేరుసుబ్బలక్ష్మి. నన్నొక వేపారివాఁడు—కృష్ణరావు పేరిటివాఁడు తఱుముకొనివచ్చుచున్నాఁడు.

రుక్మి—ఆతనిపేరు నీకెట్లు తెలిసెను?

సుబ్బ—"వేపారి కృష్ణరావునే కొట్టితివా" యనియు, "నడుము జెణికినది కావున నిన్నుఁబట్టుకొనలేకుంటినిగాని" యనియుఁ గేకలువైచుచు నన్ను వెంబడించినాఁడు.

రుక్మి—సరే; నీవు లోనికిఁబొమ్ము! నేనాతని మందలింతునులే.

కృష్ణ—(తొందరతోఁబ్రవేశించి) ఈయింటియొద్దనే యొకతురక మాయమైనాఁడు ఆతఁడీయింటిలోకివచ్చెనా?

రుక్మి—తురకలు మాయింటికేలవత్తురు? అయిన వాతఁడు నీకేమిచేసినాఁడు?

కృష్ణ—నన్నుఁగొట్టిన సుందరియనునొక వేశ్య నాతఁడెత్తుకొనిపోయినాఁడు అయినను—ఆమెకు నాకు సంబంధము—లేదు—

రుక్మి—నిన్నుఁగొట్టిన తురకయేనా మాయింటిసమీపమున మాయమైనతురక?

కృష్ణ—నేను నిశ్చయముగాఁ జెప్పఁజాలను. మనసనేకకారణములచే బెదరియున్నది. కాని యీతురకయు నన్నుఁగొట్టినాఁడు.

రుక్మిణి—మొగముమీఁది యంగారపు నక్షతలుఁ జూడ వేపారిచిన్నవాఁడవైనట్లు తెలియుచున్నది. నీపేరు?

కృష్ణ—కృష్ణరావు.

రుక్మి—ఇద్దఱు తురకలచే దెబ్బలుతిని ద్వైతమతమును నిలువఁబెట్టుకొంటివా! అదృష్టవంతుఁడవు!

కృష్ణ—(తనలో) ఈమె నన్నుఁ బరిహసించుచున్నది. ఈమెనా మహాదృష్టమున వేశ్యాకాంతయే యగునేమో! ఇదియే నాకు స్వాధీనమైనచో నాజన్మమింకఁ దరించినదని చెప్పవచ్చును. ఇంతరాత్రివేళ నీమె యెవరికొఱకో నిరీక్షించుచుఁ దలుపుఁ దీసికొనియుండునా? ఈమె నాతోఁ బరిహసించునా? ఈమెయింటిసమీపమున నెవ్వఁడో తురక మాయమగునా? కావున నీమె వేశ్యయనియే నానమ్మకము—అది కాక—

గీ. కటికిచీఁకటినైనను । విటవరేణ్యుఁ
డిద్ది వెలయాలఁటంచు గు । ఱుతింపనేర్చు
నితఁడు విటుఁడంచు వేశ్యయు । న్గ్రహించు
నహహ! శృంగారరసము ది । వ్యాంజనంబు॥

గీ. బ్రహ్మకును బ్రహ్మయైన నా । రాయణుండు
మొదలుగా సర్వజీవస । మూహమునకుఁ
బ్రథానంబు శృంగార । రసముగాదె
సర్వలోకంబులకు నువ్వు । చందమునను.

(ప్రకాశముగా) ఇద్దఱుతురకలచే దెబ్బలందిని ద్వైతమును నిలువఁ



బెట్టుకొనరాలేదు. ఒక్కచక్కనిచుక్కతో సహవాసమొనర్చి యద్వయానందానుసంధానము నపేక్షించి యిక్కడకు వచ్చితిని. వారు తురకలు గారు. దేవదూతలు! వారివి దెబ్బలుఁ గావు. దీవనలు! ఆహా! మాకుఁ బ్రాణదేవుఁడగు ముఖ్యప్రాణమూర్తి నన్ను నీతో సంధానపఱచుటకు వారిచేనట్లుచేయించినాఁడు. లేనియెడల నింతదివ్యమంగళవిగ్రహదర్శన మింత యాకస్మికముగ నిట్టికారణమున సిద్ధించునా?

రుక్మి—మహావటుశిఖామణియు, మహావీరపాదారవిందమకరందపానవిస్మృతుఁడును. భవిష్యద్బ్రహ్మయు నగు మారుతి నీకుబంటై, కానిసయై, కన్యావనితాసంధానకర్తయయ్యెనా?

కృష్ణ—ఇష్టదైవసహాయ్యము లేకుండ నేకార్యమైననగునా?

గీ. బుద్ధిపూర్వకముగ నీదు । మూర్తి నేను
నాదుజన్మములోనఁగా । నంగఁగలనె?
దేవసాహాయ్యమునకంటె । దీనియందు
నితరమేమున్నదో చెప్పు । వేమృగాక్షి!

గీ. కఱచినట్టి కుక్కను గొట్టఁ । బరుగులెత్తి
ఱాయిఁ దీయఁగ బ్రహ్మహీ । రముగ్రహించు
పేదమానిసితనబుద్ధి । పేర్మి దానిఁ
గనియెనే? దైవసాహాయ్య । మునను కాక?

రుక్మి—నీమాటలనుబట్టి నీవుదైవపరతంత్రుఁడవు వలెఁగనుపట్టుచున్నావు. అట్టినీకీవేశ్యాలంపటత యేల?

కృష్ణ—నామనస్సున నన్నిరసము లున్నవి. సదాచారమున్నది; వ్యభిచారమున్నది; భక్తియున్నది; రక్తియున్నది; వైరాగ్యమున్నది. పామరత్వమున్నది. నామనస్సృష్టివైఖరియట్టిది!

సీ. తులసి సాలగ్రామ । ములమీఁద నుంతును
పూవులు వేశ్యకొ । ప్పున ముడుతు

వాయుస్తుతిని గవి ఽ ప్రభు నభిషేకింతుఁ
బన్నీటి జడి వార ఽ భామ కిడుదుఁ
జందనాగరుచర్చ ఽ స్వామికి నర్పింతుఁ,
జందనాగరు చర్చ ఽ సానికిడుదుఁ
గర్పూరపుటారతి ఽ కంసారి కొసఁగుదు
మణిదీపములు వెల ఽ మగువ కిడుదు
బట్టమెడఁజుట్టుకొనుచు శ్రీ ఽ వల్లభునకు
భక్తి సాష్టాంగ మొనరింతుఁ ఽ బాపహృతికిఁ
బైఁటచేఁబట్టి జారిణీ ఽ పదములందు
వ్రాలుచుందును బ్రియణకో ఽ పంబుదీఱ.

రుక్మి—నీవనినమాటలు వారనారీవారమునకు గౌరవదాయకము లైనందులకు సంతసించితిని. కాని నీయద్భుతచర్యకర్థమేకనఁబడదేమి? ఒకసారి యొడల గోపీచందన మలందుకొని మఱియొకసారి గోమయము రాచికొననేల ? ఒకసారి పవిత్రస్నాన మొనరించి మఱియొకసారి పందిగుంటలోఁ బడనేల? ఒకసారి పద్మాసనముపై బ్రహ్మనిష్ఠనుండి వేఱొకసారి పట్టెమంచముపైఁ బణ్యాంగనాగోష్ఠినుండనేల? నీకీసంకరచర్య యెందులకు? ఏయనుభవమును బూర్తిగాలేక, రెంటికిఁ జెడి నడుమ నీకీత్రిశంకుస్వర్గదుర్గతి యేల ! చేతనైనయెడల సంసారబంధమును నడఁబ్బకొని తారకమంత్రజపపరాయణుఁడవై ముక్తినొందుము. కాదందువా? యజ్ఞోపవీతమును బోగముదానిగాగరాబొందునకుముడి వైచుకొని "తధిగిణతోం" అని కలసి మత్తాయింపుము.

కృష్ణ—నాచరిత్ర నిగూఢమైనది ! నీకు భావప్రకటనమైనట్లు తోపదు. ఇది విచిత్రమైన జాతీయసమస్య—

గీ. అధికతనహాస్రవారనా ఽ ర్యధరమధుర
మధురసాస్వాదనోద్భవ ఽ మహితపాప



మంతయును బటాపంచలై ఽ యంతరించుఁ
దులసికాతీర్థలవపాన ఽ కలనవలన.

రుక్మి—హరిహరీ ! పుణ్యపాపసమార్జనము జమాకర్చులెక్కగా భావించి యీవర్తకమారంభించితివా ? ఇప్పటికి నిలువ పాపమా? పుణ్యమా ?

కృష్ణ—ఎవరుచూచినారు? నీవనినట్లు లేదో వ్యాపారము జరుగుచున్నది. వారకాంతాసాహచర్యమందెక్కువ ప్రీతియున్నమాట సత్యము. అది నాకుఁ దప్పదు. నిత్యవిధి వింటివా ? కాని,

గీ. పొడుము చిటుకంత మిరియాల ఽ పొడుము చేతఁ
బానకపు మత్తుఁ బాపిన ఽ పసిఁడిగాన
వారకామినిపదములఁ ఽ బట్టిపట్టి
స్వామికొకసారిచేఁదిప్పి ఽ సంతసింతు.

గీ. కులుకు వెలయాలి మొలనూలిఁ ఽ దులకరించు
గంటలరవంబు రేయుంబ ఽ గల్పవినుచు
దేవతాహ్వానలాంఛన ఽ దీప్తిఁ గాంచు
గంట నొకసారి వాయింతు ఽ గట్టిగాను.

కాని, సుందరియను వేశ్య నాకు లభించిన కొన్నిమాసములనుండి మాత్రము సదా దాని యింటనే కాలక్షేపముఁ జేయుచుఁ బెట్టెడి నైవేద్యమైనఁ బెట్టుట మానితిని.

రుక్మి—సుందరికి నీకు నేమియు సంబంధము లేదని యిప్పుడు వచించితివిగదా ?

కృష్ణ—ఇప్పుడు సంబంధమేమున్నది! దానిని బూర్ణముగా వదలుకొంటినిగాదా?

రుక్మి—ఎప్పుడు ?

కృష్ణ—ఒకగంటకింద.

రుక్మి—ఏమి కారణమున వదలుకొంటివి?

కృష్ణ—సీ. మల్లెయత్తరు వరీ । మళమనహ్యంబయి
నీరుల్లిపాయపైఁ । గోరికయ్యెఁ
గోరమీసంబుల । కులుకులుచులకనై
బోదకాళులపైని । బుద్ధిపాఱె
దోసిళ్ళకొలఁదులౌ । కాసులు రోఁతయై
పిచ్చికుంచముమీఁదఁ । బ్రీతిగలిగె
లలితసల్లాపక । లాపముల్ వెగటయి
చేరంపుబెకబెకల్ । ప్రియములయ్యె
సానికట్టిపోఁగాలంబు । సంభవించె
భండనమునకు ఖరమును । బంపనెంచి
యన్నివిధములఁ జెడమేవి । యట్టివదల
నఱచుచును జాకిరేవుకై । పరుగులిడదె?

రుక్మి—నీసానిని గోమటి హరించినాఁడా? ఇదివఱకు మహమ్మదీయుఁడెత్తికొనిపోయెనంటివి కాదా!

కృష్ణ—ఆమహమ్మదీయుఁ డాకోమటిభటుఁడని నా యభిప్రాయము.

రుక్మి—ఆతఁడు నిశ్చయముగా సెట్టిభటుఁడేయని నీకేమినమ్మకము? ఈమహమ్మదీయాస్థానములోఁ దురకభటులకు లోపమేమి? ఆతఁడే యాతఁడని నీవెట్లు చెప్పఁగలవు?

కృష్ణ—కొంతనిజమే.

గీ. శిరములను బోఁడి; గడ్డాల । చివర దాఁడి;
యత్తులను వేఁడి; పెదవుల । యంచుబీడి;
మాటలను వాఁడి; గలమహ । మ్మదియులందు
స్థూలదృష్టిని భేదంబు । జూడలేము?



కానియీరాత్రి నాకింతవఱకేమియో తిక్కగానున్నట్లున్నది. ఏదియెట్లుజరిగినదో చెప్పలేకుండ నున్నాను. ఎట్లుజరిగియుండినను నాకిఁక విచారమెందులకు?

గీ. అబ్ధినీఁదుపానుచే నల్ల । లాడియాడి
యొక్కకెరటంబుచే నొడ్డు । నొందినాఁడఁ
బ్రాఁతతోల్బొమ్మ తెర దిగఁ । బరమనవ్య
భవ్యసాలభంజిక తెర । పైకినెక్కె.

రుక్మి—ప్రాఁతదైననుఁ గ్రొత్తదైననుఁ దోలుబొమ్మయే కాని దానికంటె నెక్కువది కాదు. అయినను నేను నీకు స్వాధీన నగుదునని నీకీ వెఱ్ఱినమ్మకమేల?

కృష్ణ—ఏలయో నాకుఁ దెలియదు. ఇదివఱకు నేనెందఱకాంతలనో చెప్పఁజాలను—మట్టిముద్ద మొదలు తుట్టెపురుగువఱకు—అంటకుండ మొద లపరంజి కొండవఱకు—కట్టెసెమ్మె మొదలు బుట్టబొమ్మవఱకు—పొట్టపిచ్చుక మొదలు సిట్టతాడివఱకు—అన్నిరూపములవారి, నన్నిగుణములవారి, నన్నిరంగులవారి, నెఱుఁగుదును. కాని నిన్నుఁ జూచునట్టి యానందము మాత్రము నాకు సంభవింపలేదు.

గీ. జాఱుపైఁటలేదు । సర్దుకొనుటలేదు
కోరచూపులేదు । కులుకులేదు
తెరసిగ్గులేదు । తెగనీలుగును లేదు
బెళుకులేదుమాయ । తళుకులేదు.

గీ. స్వచ్ఛమగుపాలరాతి పాం । చాలికోలి
సరసపరిశుద్ధశృంగార । సరసిపరుస
స్వర్గనిర్గతదేవతా । వనితగతిని
నాకుఁ బ్రత్యక్షమైతివో । నలిననేత్ర!

గీ. కశ్మలాంగుఁడు గంగావ । గాహనంబు
నాచరించి పవిత్రుఁడై । యలరినట్లు
భవ్యభవదక్షిసంభూత । వైద్యుతాచ్ఛ
కిరణపరిణతిఁ బరిశుద్ధిఁ । బొరసినాఁడ.

గీ. ప్రసవమాలిక నిష్టదే । వతకు భక్తిఁ
డర్పణముఁ జేసి సాష్టాంగ । మాచరించి
నట్టులీకంఠమాల నీ । యంసపీఠి
నుంచి యిదిగో! చేతులను జో । డించుకొందు

(కంఠాభరణ మామె మెడలో నుంపఁబోవును)

రుక్మి—ఆఁగు! ఆఁగు! అది నాకక్కఱలేదు.

కృష్ణ—అయ్యయ్యో! అటులంటివేల?

రుక్మి—నాకు ధనమందంతయాశ లేదు.

కృష్ణ—గీ. కాంచనాశాసహితవార । కాంతలందుఁ
గలిగితివి వెఱ్ఱిదానవో । క్కతెవు నీవు
సారధీధారులైన వే । పారులందు
బుద్ధిహీనుఁడనగు నేను । బుట్టినట్లు.

రుక్మి—నీవు బుద్ధిహీనుఁడవని నిశ్చయముగా నీకు నెవ్వఁడు [illegible]ఁ చినదో యిప్పుడు బాగుపడెదవనుటకు సందియమున్నదా?

కృష్ణ—బాగుపడుటకే కాదా నీపాదసాన్నిధ్యము నాకు లభించినది. ఎట్లు నన్నుఁ జేపట్టి యాదరించి ప్రేమించి కాపాడుదువో! ఒక్కఁడను; 'నా' యనఁదగినవాఁడు లేఁడు. "మా" యన్నమాట యంతకంటె లేదు.

రుక్మి—దూరబంధుఁడు కూడ నెవఁడైన లేఁడా?

కృష్ణ—దూరమేమి దగ్గఱయేమి! వారికి నాయం దభిమానము లేనప్పుడు వారు నాకు లేనట్లు కాదా?



రుక్మి—వారెవరు?

కృష్ణ—మామగారు.

రుక్మి—మేనమామగారా?

కృష్ణ—కాదు; బిడ్డనంటఁగట్టిన మామగారే; ఆయనయిప్పుడు నాపైఁ బ్రళయకాలరుద్రుఁడువలెనున్నాఁడఁట; ఆయనకంటఁబడకుండ దూరమునఁ గాలక్షేపము చేయుచుంటిని గాని కర్మము చాలక కంటఁబడియుండినయెడలఁ గసిదీఱఁ గొట్టియేయుండును. అందులకు సందేహము లేదు.

రుక్మి—నీకుఁ బెండ్లికూడనైనదా? నీభార్య జీవించియున్నదా?

కృష్ణ—జీవించియుండినయెడల మామగారి నీడ్చి నేనే కొట్టియుందును.

రుక్మి—అటులైన మామగారిని గొట్టుటయో మామగారిచే దెబ్బలఁబడుటయో మనువునకు ఫలమని నీయభిప్రాయమా? కాని నీ భార్య యెచ్చటనున్నది?

కృష్ణ—ఎచ్చటనో యన్నమాటయేమి? ఇచ్చటనే యున్నది. నాకదృష్టముండిన యెడల నీవు నాభార్యవు కాఁగూడదా?

రుక్మి—నాభార్యాత్వముమాట తరువాతఁ జూడవచ్చును గాని నీవు నీభార్యతో నేల కాఁపురము చేయుట లేదు?

కృష్ణ—నాకామెయం దనిష్టత.

రుక్మి—ఎందుచేత?

కృష్ణ—ఇష్టతకు నసిష్టతకుఁ గారణమేమి?

గీ. ఉల్లిపూవాసనకు నొక్కఁ । డుత్సహించు
మల్లెపూఁ జేరనొక్కఁడు । తల్లడించు
వట్టిచింతకాయకొకఁడు । లొట్టవేయుఁ
బంచదారకునొక్కఁడు । ప్రాణమిచ్చు.

గీ. దేవగాంధారికొక్కఁడు | తెయ్యమనును
జక్రివాకంబున కొకండు | సణఁగుకొనును
సుదతిగుండ్రమో యొకనికిఁ | జుట్టుకుదురు
చెలువకోలమో యొకనికిఁ | జెవ్వటట్ట.

గీ. ఒకనిభోగము మఱియువే | యొకనిరోగ
మొకనియిష్టము మఱియువే | యొకనికష్ట
మొకనిదాపుష్టి మఱియు వే | యొకనినష్టి
యొకనిభృతియాను మఱియువే | యొకనిమృతిగ.

గీ. మంచిచెడ్డలెపుడు | మనములోనుండును
గానివస్తుచయము | కోన లేవు
ప్రకృతిభేదములను | బట్టి యీభేదంబు
లన్ని సంభవించు | నబ్జనయన!

రుక్మి—పెండ్లామును విడుచుట ధర్మమని యెంతపెద్దయుపన్యాస మొనర్చితివి; సరే, కాఁకరకాయచేఁదు నీకిష్టము కాదు. చింతకాయపులుసు నాకిష్టము కాదు. అది యనిష్టమని నీవనుటకుఁగాని యిది యనిష్టమని నేననుటకుఁ గాని దాని నొకసారియైనను మనము నోటఁ బెట్టియుండనక్కఱలేదా? చెట్టుమీఁదఁ జింతకాయ యుండగానే పులుసు నాజిహ్వకుఁదగులునా? పాదుమీఁదఁగాఁకరకాయ యుండగానే చేఁదు నీనోటి కంటునా? అట్లే నీయిల్లాలిని నీవెంతకాల మనుభవించి యేవపడితివి?

కృష్ణ—నాకుఁ గలిగిన పెద్దయాక్షేపమదియే; తల్లి తొందరచేత దానికినాలుగవయేఁట వివాహమైనది. పెండ్లికాలమందు నేనుదిన్నగ దానినిజూడనేలేదు. తరువాత దాఁదాపుగాఁ బండ్రెండుసంవత్సరములైనది. ఇప్పటివఱకుఁజూచియుండలేదు. భవిష్యద్వృత్తాంతమును



భగవంతుఁ డెఱుఁగును. అది పెద్దదియై నాలుగైదు సంవత్సరములై యుండును.

రుక్మి—పునస్సంధానమునకు నిన్ను మామగారు పిలుచుకొని పోలేదా?

కృష్ణ—రాకేమి! వచ్చినాఁడు, అప్పటికి నేను మఱియొక గ్రామములోనుంటిని. నాస్థితియప్పుడు నిత్యకల్యాణము—పచ్చతోరణముగ నుండెను. నావ్యాపారమున కప్పుడు గురుఁడే కాదశమునందుండెను. నాలుగంతరువుల మేడలో నివాసము. పన్నీటితొట్టెలలో స్నానము. బంగరుపళ్ళెరములో భోజనము. తూఁగుటుయ్యెలలో గాలిపఱపులపైఁ గాంతాపరీరంభము. తమలపాకులు చుట్టియిచ్చుట కొకదాసి, విసరుట కొకదాసి, కాళ్ళుపట్టుట కొకదాసి, చేయూతనిచ్చుట కొకదాసి—ఆదినములలో విటమహాచక్రవర్తినై వెలిఁగిపోయితిని. వేశ్యాలోకమంతయు నేకచ్ఛత్రముగఁ బరిపాలించితిని. నామనుమరాలికిఁ గన్నె చెఱ వాపవలసినదని యొకతెయు, గర్భవతియైన నామేనగోడలికి మీచేతిమీఁదుగా గాజులు తొడిగింపవలెనని యొకతెయు, నామనుమనికి మీపేరు పెట్టుకొనుట కనుజ్ఞయిమ్మని యొకతెయు, వారాంగనామహాజనసభ కగ్రాసనాధిపతిగానుండుమని యందఱును, నిటులే నాకు దరఖాస్తులను బంపుకొనుచుండెడివారు వానిమీఁదనాముద్రవైచి యుత్తరువు లిచ్చుచుండువాఁడను. నీవు నవ్వుచున్నావు నేనింకఁ జెప్పను.

రుక్మి—చెప్పుము. ముద్ర—ఏపేరితోఁ జెక్కించితివి?

కృష్ణ—గోపీకాకృష్ణుఁడని వెనుకనున్నట్లు, వేశ్యాకృష్ణుఁడని చెక్కించితిని.

రుక్మి—సరే. చెప్పవలసినదానిని మఱచినావు. నీమామ నిన్నచ్చట గలిసికొనెనా?

కృష్ణ—అతఁడు వచ్చి మాయింటి వీధియరుఁగుపై మూఁడు దినములు కూరుచుండినాఁడు. లోని కెన్నివార్తలో దాసీజనముచేఁ బంపినాఁడు. దర్శనమిచ్చుటకు వీలులేదని వార్త నంపితిని. ప్రాణము విసిఁగి యాతఁడు పోయినాఁడు. అతని పెద్దపట్టేమనఁగా—ఎదిగినపిల్ల నటులే యుంచఁగూడదు; తరువాత దానితోఁ గాఁపురము చేయకున్నను శుభకార్యమైనఁ జేసికొని పొమ్మని యనేకులచే వార్త నంపినాఁడు. కాఁపుర మేలాగునైనను లేదుగదా, గర్భాధానము మాత్ర మెందులకని నిరాకరించినాను.

రుక్మి—మంచిదే! ఆవశ్యకము కానప్పుడు మానివేయ వచ్చును. కాని నీభార్య చక్కనిదో కాదో యెఱుఁగుదువా ?

కృష్ణ—నేఁజూచి యేడ్చితినా ? కాని మామామ రాయబారులు వచ్చి యతిసౌందర్యవతి యని నేనడుగకుండఁగనే చెప్పుచుండెడివారు. అత్తవారింటకి సన్నాకర్షణ మొనరించుట కిదియతిశయోక్తి కదా యని గ్రహించితిని. పెండ్లామొప్పులకుప్పయైనను బేడకుప్పయే. సాని కొంకినక్కయైనను జక్కనిచుక్కయే. ఇది శృంగార రహస్యము.

రుక్మి—సంసారిణికి సద్గుణమే చక్కఁదనము. నీభార్య గుణవతియో కాదో నీవు తెలిసికొంటివా ?

కృష్ణ—కేశములకుఁ దైలసంస్కారము లేక, యొడలికిఁ జందనాదిచర్చలు లేక, కడుపునిండ నన్నమైనఁ దినక, మాసినగుడ్డకట్టుకొని యధశ్శయన బ్రహ్మచర్యవ్రతములు చేయుచుఁ "కృష్ణా" యని స్మరించుచుఁ గాలక్షేపము చేయుచుండునని యత్తవారి యూరినుండి వచ్చువారు పదేపదిగ వెఱ్ఱిధోరణిగఁ జెప్పుచుందురు.

రుక్మి—అయ్యో! పదునాలేండ్ల పడుచు. చక్కనిది. గుణవతి. నీనామమే దైవనామముగ స్మరించుకొనుచు, నీవె గతిగా నమ్మి సుఖపడవలసిన దినములలో నీకొఱకే యింతదుఃఖమందుచుఁ—గాల



క్షేపము సేయు నిల్లాలిని నీవుపరిత్యజించితివే ? నీకు దయాదాక్షిణ్యము లున్నవా ? హృదయమున్నదా ? నీవు మనుజుఁడవేనా ? పెందలకడనే చెప్పితివి వేగ మఱియొకచోటికిఁ బొమ్ము. కట్టుకొన్నవారి యెడలనే నీవింత కటికవాఁడవై యుండ నింక నుంచుకొన్నవారి యెడలనా ? ఈదూఁకుడేదో యడఁగిన తరువాత సానిలోకమంతయు నొక్కసారి చావవలయునని నీవు కోరుకొనుట కేమైన సందేహమున్నదా? వెనుక నెవ్వరో సర్పయాగ మొనర్చిరి. కాని నీవు ముందు సానియాగ మొనర్చు మహానుభావుఁడ వగుదువు. చాలు చాలు నడు నడు.

కృష్ణ—నారీమణీ! నావలన లోపము లేదు. కమలగంధను వహించిన మాత్రుఁడెన్నటికిఁ గఠినహృదయుఁడు గాడు. నాభార్య దురవస్థవిని నే ననేకపర్యాయము లత్తవారింటికిఁబోవ నెంచితిని గాని గయ్యాలిముండ లెప్పటికప్పు డేదో వంకఁ గల్పించి నన్ను గదలనీయ లేదు. అందఱు నీవంటి యుత్తమవేశ్యలుందురా ? అందుచేతనే నిన్నుఁ జూచుటతోడనే నాకు బ్రహ్మానందమైనది.

రుక్మి—ఆహాహా! ఎంతమాటాడితివి, వేశ్యలబ్రతు కెంతనీచపుబ్రదుకో చూచితివా? ఎంతనిందాపాత్రమైన బ్రదుకో చూచితివా? నీకు బుద్ధిలేక నీభార్యను వదలుకొనుటయేమి? వేశ్యలు నిన్ను వెడలనిచ్చిరి కారని వారి కీనిందయేమి ? వారాఁపిన నీవాగుదువా ? బుద్ధిలేక భార్యనువదలి యొడలిమదమునఁ దెగిపడి సానివీధినిఁబడిన నిన్ను, ధనాశచేనైనను వారలాదరించి నీయవసరముఁ గడపినందులకిప్పుడు వారికి గయ్యాలిముండలని తిట్టులా ? నేను నీబారిఁబడక మిగిలితిని గాని నన్నుఁగూడ నీవిట్లేతిట్టుట కేమైన సందేహమున్నదా?

కృష్ణ—అయ్యయ్యో ! నిన్నుఁ దిట్టుదునా ? నీవందఱివంటిదానవే యగునెడల నాకిట్లు నీతిబోధన మేలచేయుదువు ? నీదారియే

వేఱు—నీమొగము చూచుటతోడనే గ్రహించినాను. దైవవశమున నీబారిఁబడితిని—నన్నట్లుదిద్దుకొని యాదరింతువో? అయిన నిట్టి వేశ్య యిదివఱకు లభింపకపోవుటచే నన్ని పాటులైనఁ బడితిని---ఇప్పటికా లోపము తీఱినది. నీవు నాకు గొన్ని సంవత్సరములకు బూర్వమే దర్శనమిచ్చి యుండినయెడల నేనింతగాఁ జెడిపోయియుండను.

రుక్మి—ఇంత చెడినవాఁడవు— నీవు నన్నట్లు పోషింపఁగలవు?

కృష్ణ—ఆసందేహము నీకెంతమాత్ర మక్కఱలేదు. ఎంత చచ్చు వేపారివాఁడైనను వేశ్యను బోషింపక పోలేడు. సాని సంరక్షణమున నతఁడు సహజపండితుఁడు.

రుక్మి—నీసహజపాండిత్యము చట్టుబండలుగాను! ఏదైనవృత్తి జేసికొనినఁ గాని ధనము రాదుగదా? చదువుమాని సానికొంపలఁబడి యల్లాడినట్టి నీవిప్పుడేవృత్తి జేసికొనఁగలవు?

కృష్ణ—విద్య లేకపోలేదు శ్రోత్రియశిఖవలెఁ బరిమితముగా నున్నది. ఆసాహిత్యముతోడనే యట్టియట్టియల్లి కొంతరసపుష్టిగాఁ గవిత్వముఁ జెప్పఁగలను? ఇప్పటి కవులకంటె నేనేరవ్వంత మెఱుఁగనిపింపఁ గలను పూర్వకృతులు, జావళీలు, స్వరజతులు ముఖస్థములైయున్నవి, కావున వానికిఁ బాఠాంతరములను వ్రాసి పసందుగా నంకితముఁగూర్చి పాటల నాటకముల వ్రాసి ప్రచురించినయెడలఁ బైసంవత్సరములో పాలఱాతిమేడలోఁ బవడంపుఁగోళ్లల పట్టెమంచముపైఁ బట్టుపఱుపులపైనిన్నుఁ బరుండఁబెట్టఁగలను. ఆ ఆధైర్యము నాకున్నది.

రుక్మి—పైసంవత్సరమువఱకు బ్రతుకుట యెట్లు? ఇప్పుడు నీకేపనియైనఁ జేతనగునా?

కృష్ణ—చిరకాలవేశ్యాంగనాసాంగత్యమువలన మద్దెల దివ్యముగా వాయించఁగలను.



రుక్మి—అయ్యయ్యో! మద్దెలవాద్యమా?

కృష్ణ—చర్మపుఁగట్టు వాద్యములలో నంతటిది లేదు.

రుక్మి—మేజువాణిలో వాయింతువా?

కృష్ణ—వాయింతునని చెప్పలేదు. దానిలోఁ బ్రావీణ్యముగలదని చెప్పితిని. ఆ. మఱియొకటి-నాజట్టులో నన్ను మించినవారు, నాకంటె నొకటిరెండాకు లెక్కువఁజదివినవారున్నారు. వారినందఱను జేర్చి నాటకసంఘమొకటి స్థాపించినయెడల నామెడలోఁ గాజుపూసలు—నీయొడిలో గుజ్జుపుఁగాసులు. నాకుఁ గాకిబంగారపు గద్దె-నీకుఁ గడవఱాలమిద్దె.

రుక్మి—పాలఱాతిమేడ తెప్పపాటులోఁ గడవఱాల మిద్దెక్రింద జంకినదా? ఎందుల కీయనావశ్యక వాక్యాడంబరము!

కృష్ణ—నీదయమాత్ర ముండవలయును. అదియొక్కటి కలిగినయెడల లాలించినట్లే లాలించి కోపించి నన్ను దిబ్బమీఁద గూరుచుండఁబెట్టి పాఱిపోయిన యదృష్టదేవతను బైటచెఱఁగుపట్టి పఱపఱ నీడ్చుకొనివచ్చి నీ పాదాక్రాంతురాలినిగఁ జేయనా?

రుక్మి—మహానురాగమున నాదరించి, ప్రేమించి, నిన్ను నెత్తిమీఁదఁ బెట్టుకొని సర్వదా విడువకుండ నుండవలసిన సుందరస్వరూపయు, గుణవతియునగు నిల్లాలిని దెచ్చుకొనుటకే—చేతఁగానివాఁడవే? అట్టిచో మాయలాడియు, టక్కులాడియు, రూపశూన్యయునగు భాగ్యదేవతను—నిన్ను గిఱగిఱఁద్రిప్పి నేలఁగొట్టి పాఱిపోయిన భాగ్యదేవతను—దిరుగఁ దెచ్చెదనని చెప్పుచుంటివా?

కృష్ణ—నాభార్యను నేను దెచ్చుకొని పోషించుట చేతఁగాక యూరకుండలేదు.

రుక్మి—కట్టుకొనినదానిని బుట్టినయింటనే యుంచుట గౌరవమని యూరకుంటివా?

కృష్ణ—గౌరవమున్నదని నేనంటినా యేమి?

రుక్మి—భార్యనేడ్పించుట పరలోకసాధనమని యూరకుంటివి కాఁబోలు!

కృష్ణ—కాంతామణీ! నన్నిట్లు హృదయభేదకములగు మాటలాడనేల ? నేను నీసేవకుఁడను. నీయిష్టము వచ్చినట్లు నన్ను దిద్దుకొనుము.

రుక్మి—అట్లయిన నీభార్యను దెచ్చుకొనుము?

కృష్ణ—నీకిష్టమైనయెడల, నీసెలవగునెడలఁ దెచ్చుకొందును. కాని—అది నీకు మంచిది కాదు; నాకు మంచిది కాదు; దానికిని మంచిది కాదు. ఈసంగతి వెనుక నాలోచించివిడిచిపెట్టినదే!

రుక్మి—ఏ మంత బాధ యున్నది?

కృష్ణ—బాధయని నిమ్మళముగా ననుచున్నావా? ప్రాణబాధ—యమబాధ—

రుక్మి—అంతయో యింతయో బాధను సహింపవచ్చునుగాని యప్రతిష్ఠను సహింపఁదగదు.

కృష్ణ—అప్రతిష్ఠ యుండునెడల నాకుఁగాని నీకేమి?

రుక్మి—నీయప్రతిష్ఠ నాది కాదా? నాయప్రతిష్ఠ నీది కాదా?

కృష్ణ—ఆహా! ఇందఱుసానులను జూచితినేగాని ఈమాత్రపు గలుపుఁగోరుమాట యొక్కతెయైన నన్నాడలేదు సుమా?

రుక్మి—బంగరుబొమ్మవంటి భార్యను బాసి దృష్టిబొమ్మలను సేవించు నీయప్రతిష్ఠమాట యటుండుము ! ఇఁక నాయప్రతిష్ఠ యేదో విను; "తా నాడుది కాదా? తనవంటిదే యాతనిభార్యకూడఁ గదా ? తన కత్తెఁడు గాకపోయిన మఱి పలువురున్నారు గదా? దాని గతి యేమి కావలసినది? మగఁడో మగఁడో యని యేడ్చు నిల్లాలిని రవంత భర్తతోఁ గలుపఁ గూడదా? ఇదియంతయుఁ దానే నెత్తిఁ



గట్టుకొని పోవలయునా? నిర్భాగ్యపుముండ! ఆలుమగలకు విడాకులిప్పించి, తానేమాత్రము ముట్టిగట్టుకొని యూఁగులాడును"? అని సంసారిణులు, సానులుఁగూడ నన్ను దుమ్మెత్తి తిట్టుదురు.

కృష్ణ—నిన్నుఁ బల్లెత్తుమాట యనువారికన్నులు చిల్లులు పడును. నీకా సందేహ మక్కఱలేదు. నీసంతోషము కొఱకు నాభార్యతో నుందును. కాని, యప్పుడైనను నాయప్రతిష్ఠ పోదుగదా ! ఏమిలాభము?

రుక్మి—పోవును. పోయితీఱును. భార్యచాటున నెన్ని పైయాటలైనఁ గప్పఁబడిపోవును; నీవు కూడ నీభార్యతో నున్నయెడల నందఱదారివంటిదే నీదారియు నగును.

కృష్ణ—ఏమో!

రుక్మి—ఆ. ఏమో యనుచున్నావేమి?

కృష్ణ—నీవన్యథా యెంచకుము. నేను సర్వదా విధేయుఁడను. నాబ్రతుకంతయు నీచేతిలో నున్నది. నీసెలవైనది. కావున నాభార్యను నేను దీసికొని వచ్చెదను. కాని నీవే నాకుఁ బ్రప్రథమురాలవు. అది నాకేదో యుండియుండనట్లుగ—నప్రతిష్ఠానివారణము కొఱకు మాత్రమే—నీకోపశాంతికొఱకు మాత్రమే—ఇంటిలో నాఁడది లేదన్నలోటు లేకుండుటకు మాత్రమే యుంచుఁగాక?

రుక్మి—ఎంతమాట నాడితివి. దానితో సహవాసము నీ వథమపక్షముగ భావించుచున్నావా? అదియే నీకు ముఖ్యము. అదియే నీకగ్రగణ్యము. తనువు తరించుటకై కదా ధర్మపత్నిని దెచ్చుకొంటివి. ఉత్తమగతికై నీకుఁ దొత్తులగుదురను కొంటివా? అదియే మొదటిది. నేనే ద్వితీయను. తెలిసినదా?

కృష్ణ—రెండుసంసారములు సంబాళించుట కష్టము.

రుక్మి—అటులైన నన్ను వదలుకో.

కృష్ణ—నా ప్రాణముతో నిన్ను వదలుకొనను. యాదృచ్ఛికముగా నా భాగ్యదేవతవలెఁ బ్రత్యక్షమై నాకు మహానందమొసఁగుచున్న నిన్ను నాముక్కున నూపిరియుండఁగా వదలి పరు లనుభవింపుచుండఁగాఁ జూడఁగలనా? ఎంతమాట!

రుక్మి—వెఱ్ఱివాఁడా! నేను పరాధీననై పోదునేమో యని దేవులాడుచుంటివా? మా కెప్పుడుఁ బరాధీనతయే; నీభార్య నీకొఱకేడ్చియేడ్చి, ప్రాణమువిసిఁగి, భర్త్రపేక్షచేఁ బైగ్రామములలోఁ దిరువీధులు వేంచేయునేమో యని నీ కాందోళనము లేదా?

కృష్ణ—అది యట్టిది కాదు. గుణవతియని నాకు విశ్వాసము.

రుక్మి—అట్టియాలికేనా యిట్టియాదరణము. అది యన్యథా వర్తించు నాటకకర్త్రియే యైయుండినయెడల నోరుమూసికొని, చేతులు కట్టుకొని, బానిసీడవై దాని పాదముల నాశ్రయించియే యుందువు. కాని—ఏమో యెల్లకాలము బుద్ధినిశ్చలముగా నుండునని యెవ్వరు చెప్పఁగలరు? అనిలభక్షణమొనర్చు మహర్షులకే యసాధ్యము కాదా? అట్టిచో నాఁడువారిమాట చెప్పవలసినదేమి? ఏనిముసమున కేబుద్ధిపుట్టునో? చేయి దాఁటిపోయినతరువాత వంశములోనివంక దిద్దుకొనుట నీతరమగునా? నిన్నుఁ బుట్టించిన బ్రహ్మతరమగునా?

కృష్ణ—నీమాటవలన నాగుండెలుజలదరించుచున్నది. నేను డెల్లవాటిసతోడనే పోయి ముందుగా నాభార్యను దెచ్చుకొందును. నిన్నుమాత్రము వదలను సుమా! నీకా సందేహ మక్కఱలేదు; అక్కఱలేదు.

రుక్మి—నీభార్యతో నీవు సుఖముగా నున్న నాతో నుండిన యట్లే సంతోషింతును.

కృష్ణ—కాని, నేనిచ్చిన యీకంఠమాలను దీసికొంటివి కావు. అనుగ్రహించి కైకొనుము.



రుక్మి—నాకక్కఱలేదు. అది నీభార్యకిమ్ము.

కృష్ణ—అట్లు కాదు! భార్యకింక నగలే లేకపోవునా? నీవు నాకు నీతిని బోధించితివి. గురుదక్షిణగ దీనిని గ్రహింపవలెను.

రుక్మి—సరే. ఇమ్ము. దీనిని నీవు నీభార్యకిచ్చువఱకు నాయొద్ద నుంతును.

కృష్ణ—(కంఠాభరణమును రుక్మిణిమెడలో నుంచఁబోవును.)

రుక్మి—ఆఁగు—! నీవు వేయకుము! ప్రమాదమున నీచేయి నాకుఁ దగులునేమో? నీభార్యను నీవు స్పృశించువఱకు నీవు నన్ను స్పృశింపఁదగదు.

కృష్ణ—(కంఠాభరణము నామెచేతులలో నెత్తిపడవేయును)

రుక్మి—(అది ధరించును.)

కృష్ణ—ఆహా! కంఠమాలనడుమ నీ మోమెంత ప్రకాశించుచున్నది!

గీ. రవలనడుమను నీమోము ప్రభనుగాంచు
జుక్కలందునఁ జంద్రుని సొగసుమీఱి
యన్ని యంకంబులందు నీ యంకమొకటె
స్వచ్ఛమై నాటక మందుఁ జెలఁగు!

గీ. తురకచే దెబ్బలనుదిని తొత్తుచేతఁ
"బందు" లనిపించుకొనిన వే పారిపంతు
లద్భుతాద్భుతభోగినీ వ్యక్తిచేత
సద్వితీయద్వితీయుఁడై యలరినాఁడు.

నా రీమణీ! నీపేరేది! ఇదివఱకడుగ మఱచితిని?

రుక్మి—భారతి—నీభార్యపే రేది?

కృష్ణ—భార్యపే రట్లు చెప్పవచ్చునా?

రుక్మి—పెదవిమైన దాఁటకుండ దానిపేరట్లు కాపాడుకొనుట యే పురుషలక్షణము.

కృష్ణ—ఇఁక నెందులకు? నాకు నచ్చినది కాదా; నిద్దుర వచ్చుచున్నది! ఆప్రక్కనున్న పంచపాళిలోఁ గొంచెము విశ్రమింతును. సెలవా?

రుక్మి—పెట్టుకొనుటకుఁ గంఠాభరణ మిచ్చిన పరసునకు. బండుకొనుటకుఁ బంచపాళియైనఁ జూపింపలేకుందునా?

కృష్ణ—దయయుంచుము! (నిష్క్రమించును)

రుక్మి—నేను నాగదిని బండుకొందును. అతఁ డింకనెందులకు రాలేదో! అయినఁ గొంత శుభవార్త వింటినిగదా? అతఁడు వచ్చువఱకు నేను స్వతంత్రింపఁగూడదు. ఈతఁడు తెల్లవాఱువఱకు నిక్కడనే యుండునుగాదా? ఇంతలోఁ దొందర యేల? కాని, యీ యాఁడుసాహేబు సంగతి యేదో కనుఁగొనవలయును. సుబ్బలక్ష్మీ! ఇటురమ్ము?

సుబ్బ—(ప్రవేశించి) అమ్మా! నన్ను రక్షించితివి;

రుక్మి—నీవింకను దురక వేసముతో నుండ నేల?

సుబ్బ—ఏమో! ఈయింటనుండి కూడఁ బాఱిపోవలసి వచ్చునేమో? పితంతు స్వరూపముకంటె నీస్వరూపముకొంత మెఱుఁగు కాదా యని యిటులే యుంటిని.

రుక్మి—నీ కెట్టిచిక్కు వచ్చినది?

సుబ్బ—సర్కసులోనికిఁ బోఁదలఁచి నేనును మాఅక్కయు బయలుదేఱి యీగ్రామమునఁ దప్పిపోయితిమి. నేనన్ని యోచిక్కులఁ బడితిని. ఆమె యెచ్చటికిఁ బోయెనో యెఱుఁగను.

రుక్మి—సరే; కాని నాపేరు సుబ్బలక్ష్మియనియుఁ దప్పిపోయితి ననియు మఱెవ్వరితోడను జెప్పకుమా? తప్పిపోయినవారినిఁబట్టుకొని



ముందుఁ గారాగృహమున నుంతురు. నీకేమియు భయములేదు, నీవు నాయొద్ద నుండుము. ఇంతలో మీయక్కయుఁ గనఁబడవచ్చును.

సుబ్బ—అమ్మా! అలాగే! నీవెట్లు చెప్పిన నట్లుచేయుదును. నాపేరు పార్వతమ్మ యని చెప్పుదును.

రుక్మి—పవిత్రస్వరూపవగు నీకీసాహేబువేసమువచ్చినది పాపము!

[సాహేబువేసముననున్న శ్రీనివాసరావును సుందరిని
గలిపి చేతులకుబిగించి సేవకులు కత్తులతో
వీధిని బ్రవేశింతురు,]

మొదటిసేవకుఁడు—సాహెబూ! ఈవీధిని నిన్నుఁ దీసికొని పొమ్మనుటెందులకు?

శ్రీని—ఈవీధిని నే నెఱిఁగినవాఁ డొకఁడున్నాఁడు.

రెండవసేవకుఁడు—అతనితో నిన్ను మాటాడనీయను.

శ్రీని.—ఎందుచేత?

మొద—కారణమేల? నోరు మూసికో!

శ్రీని—నన్ను నోరు మూసికొనుమందువా? (అతని దౌడపైఁ గొట్టుచున్నాఁడు.)

మొద—తమ్ముఁడా! కొట్టు! చావఁగొట్టు! (అని కేకలు వేయును)

కృష్ణ—(వెలుపలికివచ్చి) ఎవ రా కేకలు వేయువారు? ఏమి యీయల్లరి?

రెండ—నీ కెందులకు? పో?

కృష్ణ—కొట్టు? తన్ను? ఈడ్చికొట్టు?! నన్నుఁగొట్టి నాసానిని వారించిన సాహేబవు నీవేనా? ఇదిగో! సుందరి! కోమటిసుందరి! తురకసుందరి! నీవు నాకక్కఱలేదు. నీకు నేనిచ్చిన రెండువేలరూపాయలనగలు నాకిమ్ము? ఇచ్చెదవా? లేదా? (సుందరినిదన్నును.)

సుంద—భటులారా! కన్నెతికములరాయఁడైనకృష్ణరావెక్కడనున్నాఁడని పుతికొందఱు భటులు వెదకుచుమనకు దారిలోఁగనఁబడిరే! అతఁడితఁడే.

మొద—అలాగా! పట్టుకో?

రెండ—తగిలించు చేతి కరదండములు! తగిలించు! (తగిలించును)

కృష్ణ—నాకు బంధ మెందులకు?

రెండ—కోమటివాని కంఠమాల హరించితివి కాదా?

కృష్ణ—చెప్పియే తీసికొంటిని.

సుంద—ఇక్కడ నొకసానిని దిరుగ సంపాదించితివా దొంగముండకొడుక?

కృష్ణ—ఏమంటివి? (సుందరిని దన్నును)

సుంద—అయ్యో! నీళాలు విఱిగిపోను! ఎంతతన్ను దన్నితివి. అయ్యో! (ఏడ్చును)

రుక్మి—(వెలపలకువచ్చి) ఆకేకలేమి? అయ్యయ్యో! అదియేమి? ఆరక్షకభటులేమి? ఆబద్ధులేమి?

కృష్ణ—భారతీ! నీవు లోనికిఁ బొమ్ము పొమ్ము.

సుంద—అదిగో! ఆసానిమెడలోఁ గంఠమాల! భటుఁడా! పట్టుకో?

మొద—పట్టుకో? పట్టుకో?

రెండ—(రుక్మిణిని బట్టుకొని కృష్ణరావుచేతికి లంకెవేయును)

కృష్ణ—ఈలంకెయన్నిలంకెలకంటె సొగసుగా నున్నది? భారతీ! ఇదిగో! నన్నుఁగొట్టిన సాహేబు! తిరుగ నీడ్చి కొట్టినాను సుమా? (శ్రీనివాసరావును జూపును.)

రుక్మి—(అదరిపడి) ఆ! ఆ!



శ్రీని—(పెదవులమీఁదఁ జేయివైచుకొని మాటలాడవలదని సంజ్ఞజేయును.)

కృష్ణ—భారతీ! చూచితివా? వెనుకటిసాని యదిగో? దానికి నీకు నెంత భేదమున్నదో? భార్యను దెచ్చుకొనుటకుఁ దలఁచిన నాకిట్లంతరాయము గలిగినది. చూచితివా నాకర్మము?

మొద—నడువుఁడు? నడువుఁడు?

రుక్మి—పార్వతమ్మా! ఇంటిలో భద్రముగానుండుము?

సుబ్బ—(సాహేబువేషముతోఁబ్రవేశించును)

కృష్ణ—ఈసాహెబే నన్ను రెండవసారి కొట్టినవాఁడు, భటుఁడా! అతనిఁగూడఁ బట్టుకో?

సుబ్బ—నేను సాహేబనుగాను. ఆఁడుదానను. నన్నుఁ బట్టుకొననేల? అయ్యో ఈగడ్డ మూడిరాదేమి? మీటబిగిసికొని పోయినది కాఁబోలు? అయిననేమి? పరాయిని నంగరకును విప్పివైతును. (అట్లుచేసి గోవులపంచెతో గడ్డముతో నిలువఁబడును) ఇదిగో! చూచితిరా బోఁడిదానను! గడ్డ మూడిరాకపోవుటచే వికృతరూపముగా నుంటినేమో?

మొద—ఇదియేమి! ముండాసాహేబు! హెహెహెహె! బీబీమియా! సలామలేక్.

రెండ—ఇదికూడఁ గేవలము దొంగవలెనున్నది. దీనినిఁగూడఁ బట్టుకొందము,

(మొదటివాఁడు పట్టుకొనును)

మొద—నీవు గడ్డముతో నుండవలెను. ఊడఁదీసిన యెడలఁ బండ్లూడఁ గొట్టెదను. నీపరాయి, నంగరకానుగూడ తీసికో. ఏవస్తులతో నేరూపములతోఁ బట్టుకొంటిమో యావస్తులతో నారూపము

లతోడనే నవాబుగారియెదుటఁ బెట్టవలెను. మీయందఱితోఁ గూడ నీమాట చెప్పుచున్నాను ఖబర్ దార్,

సుబ్బ—ఆహా! నాకుఁ గారాబంధము కూడనా?

కృష్ణ—(తనలో) నీవు బోడిదానవా? సాహేబుచే దెబ్బలు తినినను గొంతగౌరవము గాని విశంతువుచే దెబ్బలు దినుట వేపారివంతులకు మఱింత యగౌరవము గాదా?

రెండ—నడువుఁడు, నడువుఁడు తెల్లవారుచున్నది. ఇఁకఁ బిచ్చివాఁడొక్కఁడు దొరకవలయును.

(అందఱు నిష్క్రమింతురు)

ఇది చతుర్థాంకము.





శ్రీ

# కంఠాభరణము.

## పంచమాంకము.

ప్రదేశము—వీధి.

[ప్రవేశము: రామశాస్త్రి]

రామ—వెఱ్ఱిరామశాస్త్రిని బట్టుకొనవలయునని రెండుదినములనుండి యల్లాడుచున్నారఁట. ఏదీ, బోఁడిది పట్టిన పట్టుకంటె నీగాడిదె లెక్కువగట్టిగఁ బట్టఁగలరా? పట్టుకొని బంధింతురాయేమి? హుఁ మాయాబంధముకంటె మాకు గారాబంధ మెక్కువది కాదే—ఓ! ఎవఁడువచ్చిన రావచ్చును—ఎక్కడఁ బరీక్షఁజేసికొన్నఁ జేసికోవచ్చును-పత్రికావాదమే ప్రధానమైనయెడల నందునకుఁగూడ సిద్ధముగనే యున్నాము.

"అసివా తత్త్వమసివా పరజీవప్రభేదివా
విద్యారణ్యమహారణ్య మక్షోభ్యమునిరచ్ఛినత్"।

అనిచెప్పిన వేదాంతదేశికులనప్పుడు వెఱ్ఱరాముఁడే యుండు నెడలఁ దోఁకతోఁ బక్రిందఁ గొట్టియుండకపోవునా? జీడిపప్పుకంటె బోఁడిదాని ముద్దెక్కువ రుచివంతమని రామశాస్త్రిగాఁడు కళాశాస్త్రమున కద్వైత భాష్యములో సిద్ధాంతముగా వ్రాసినాఁడు. శాఁకరపర్తి స్వాములవారికి గారెలన్నఁ బ్రాణము. గజచర్మమందు శివుని కెంతప్రీతియో బోఁడిది యిచ్చిన గళ్ళదుప్పటియందు మాకంత ప్రీతి-మాకు మదపుఁబిచ్చియని కొందఱువైద్యు లిప్పుడు ప్రతిపాదించుచున్నారఁట.

[ఆయుర్వేదభిషక్ప్రవర్తియగు శంకరశాస్త్రి ప్రవేశము.

శంక—(తనలో) విద్వాంసుఁడగు పిచ్చివాఁడెవఁడో గ్రామము లోనికిఁ గ్రొత్తగా వచ్చినాఁడని విని యాతనిఁ జూచుటకై తిరుగుచున్నాను—ఆతఁడే కాఁబోలు-ఏమనునో విందును (ప్రకాశముగా) విద్వచ్ఛిఖామణీ! నమస్కారము.

రామ—మాతత్త్వము మీరు బాగుగాఁ గనిపెట్టినారు. పాదభిక్షకై వచ్చినయెడల హస్తోదకమిచ్చుటకు సిద్ధముగా నున్నాను. మీ రే శాస్త్రమునఁ బండితులు?

శంక—నేను—వైద్యుఁడను. ఆయుర్వేదభిషక్ప్రవర్తియని నాకు బిరుదున్నది.

రామ—విధవకు మునుఁగెట్టినో వైద్యులకు బిరుదట్టిది. నీతో నొకచేయి చూడవలయును. ముందొకసారి మాచేయిఁజూఁడు?

శంక—(చేయిఁజూచుచున్నాఁడు.)

రామ—"తర్జన్యాంపిత్తనాడీచ కఫనాడీచ మధ్యమే। అనామిక్యాంవాతనాడీ ఏవంతీర్థంత్రిధావిధమ్.

శంక—ఆహా! నాడి యేమి తీవ్రముగనున్నది? శాస్త్రీ! నీకుజ్వరమువచ్చినదా? (ఒడలుముట్టుకొనఁబోవును.)

రామ—ముట్టుకొనకు? ముట్టుకొనకు? మాభార్యముండమోసినందులకింక మేము స్నానమేచేయలేదు. నేను బిచ్చియాసుపత్రిలో నున్నప్పుడక్కడి వైద్యుఁడొక చిన్నపాదరసపుగొట్టమును బాడుము పీల్చినతరువాతఁ జేయిదులిపినట్లు దులిపి చంకలోఁ బెట్టుకొనుమని చేతికిచ్చినాఁడు. ఒక్కనిమిషమైనతరువాతఁ దెమ్మనఁగ నిచ్చితిని. పాదరసము పైకెక్కలేదు కావున నితనిని గ్రిందికి దింపుఁడని కేకవైచినాఁడు. ఓరి గుడ్డిముండకొడుకా! పాదరసపువైపు మేము చంకలోఁ బెట్టుకొనలేదు. పైవైపుబెట్టుకొంటిమి. వెఱ్ఱిముండకొడుకవు నీవా? నేనా?



అని సాగఁదీసి ఒక్కలెంపకాయ యిటులేకొట్టినాను. (శంకరశాస్త్రిని గొట్టును.)

శం—హరహరా! ఎంతదెబ్బఁ గొట్టితివయ్యా?

రామ—భిషక్సార్వభౌముఁడను బిరుదూడినదా? కోటిఫలిలో ధ్వజము విఱిగినప్పుడే దుంతివిఘ్నేశ్వరుని తుండము వంకఁబోయినది. ఆదెబ్బదెబ్బ అహోబిలమువఱకు నొక్కటే భూకంపము! ధామ్మని స్తంభము పగిలినది. ఇదిగో! ఉగ్రనారసింహస్వరూపము; ఈదినము రాక్షసవధయయి తీఱవలెను. (మీఁదికిఁబోవును)

శంక—ఆఁగు! ఆఁగు!

రామ—ఆఁగుమన్న వాఁడవు నాబోఁడివానిని జూపించి మఱి కదలుము? మాకుమాత్రమమ్మ వారెందులకుఁ బూనదు? ఒక్కపల్లాలమ్మ తప్ప-శరభ శరభ శరభో! శరభ! నేను మరిడమ్మను, హా! నాచెల్లెలు నూకాలమ్మ హా! మాకిద్దఱకుఁ బచ్చగడ్డివేయ భగ్గుమనుచున్నది. హా! మొదట నేను, నాతరువాత నూకాలమ్మ, ఇద్దఱుగ్రామదేవత లింత చిన్నయూరనుండఁ గూడదని పెద్దలు చెప్పనేచెప్పినారు. మాయిద్దఱి నడుమను ఊయిడఁ బడలేక మునసబు కరణములు చచ్చుచున్నారు. పంబ పంబ పంబో.

శంక—ఇతనికి విద్యున్నిద్రఁ గల్పించి మాయింటికిఁ దీసికొని పోవుదును. విద్యుచ్ఛక్తి ప్రయోగమువలన రెండు మూఁడు దినములలో నీతని పిచ్చి కుదిర్చెదను. (రెండుచేతు లతని మోముపై నూఁపుచున్నాఁడు.)

రామ—ఈఁగలను దోలుదువా? కన్నులూడలాగుదువా? (కన్నులుమూసికొని జోఁగుచున్నాఁడు.)

శంక—(ఆతనినిఁ బట్టుకొనును.)

(నేపథ్యమున)

భటులారా! పిచ్చివాఁడును మఱియొక్కఁడు నావీధిలోఁ గాను గుదెట్టుకొంద నున్నారు.

శంక — శాస్త్రీ! రావయ్యా! పోదము. (కూడనడిపించుకొని నిష్క్రమింతురు. సోమావధానులు, వెంకటశాస్త్రి ప్రవేశింతురు)

సోమా — రెండవదినముననే దర్శయగుటచేత సర్వకర్మము పూర్తియైనది. ఇఁక నవభృథస్నానమే తరువాయి.

వేంక — అవభృథస్నానమని సెలవీయవలయును.

సోమా — ఆ! చూడు! నాభార్యకు ఘటశ్రాద్ధము యథావిధిగాఁ జేసికొంటినిగదా? దేహమునకిప్పుడు శుచిగా నున్నది. మనస్సునకిప్పుడు నిండుగానున్నది, ఆత్మకు మహానందముగ నున్నది.

వేంక — మీరు బహుఘోరకృత్యమొనరించితిరని విచారించుచున్నాను.

సోమా — విచారమునకిక్కడ నవకాశమేమున్నది? ఏకర్మలోపము జరిగినదని విచారింపవలసియున్నది? ఎటువచ్చినను-దానికొఱకు--స్వయముగా దాని పేరిమీఁదుగాఁ గట్టించిన ఘటశ్రాద్ధపుఁ బాకలోనే యీకర్మము జరిగియుండినయెడల నెక్కువ వైభవముతోను నెక్కువ వేడుకగాను జరిగియుండును.

వేంక — ఈదిక్కుమాలిన యపరకర్మములకే మీరింత ముచ్చటపడుచుంటిరే! శుభకార్యములనఁగ మీరెంత యామోదింతురో?

సోమా — శుభమన్నమాట నాచెవిని వేయకేమి! మామిడితోరణము కట్టిన కొంపలో నట్టికాలుపెట్టనే! ఇదియంతయు నెందులకు! కుక్కమూతివంగపిందిలాగిప్పటివఱకు నిలిచియున్న కుఱ్ఱబ్బిగాఁడున్నాఁడే! వీని వివాహములో నైదుదినములుఁ గూడ నేనునట్టింటఁ బ్రాణాహుతులు పుచ్చుకొనలేదు, ఇంటికి దూరముగానున్న దొడ్డి



లోఁ జిన్నమోరపాక వేయించి యక్కడ నత్తెసరు వేయించుకొని నిత్యవిధిఁ జేసికొంటిని. మావియ్యంకులు దిగ్గంతులవంటి పండితులు.

వేంక — దిగ్దంతులని సెలవీయుమయ్యా?

సోమా — వారు పాకలోనికివచ్చి మహదాశీర్వచనములైన రండని ప్రార్థించిరి. కుండలోఁ బిడుక నిప్పుంచుకొని కూడబట్టుకొని వత్తును. మీకిష్టమా? యని యంటిని. హా! హా! అంతపండితులుఁగదా-- అలిచిప్పంత మొగములుచేసికొని కర్మయోగితోఁ దిరిగి యుక్తి చెప్ప లేక చల్లచల్లఁగ జారిపోయినారు. కర్మశాస్త్రము ముందుఁ దర్కవేదాంతము లాఁగునా?

వేంక — తర్కమయ్యా! మీకు మతిలేదేమోయని నాకొక్కొక్కప్పుడు తోఁచుచున్నది.

సోమా — నాకుత్పాతమనియే? యెంతమాట?

వేంక — ఉత్పాతమనునది తప్పుమాటయే; ఉన్మాదమని చెప్పవలయును.

(నేపథ్యమున)

నీవటురా? నేనిటువత్తును.

వేంక — అదేమి! అదేమి! రక్షకభటులిటకువచ్చుచున్నారు?

(ఇద్దరుభటులు ప్రవేశింతురు)

మొద — పట్టుకో! పిచ్చివానినిఁ బట్టుకో?

రెండ — ఇదిగో! ఇదిగో! (సోమావధానినిఁ బట్టుకొనఁబోవును)

సోమా — దగ్గఱకు రాకు. అదిగో! ముట్టుకొనకు. మీరు మ్లేచ్ఛులు. నేను స్వచ్ఛమైన బ్రాహ్మణుఁడను. మీరునన్నెక్కడఁ దాఁకుదురో యక్కడఁ గోసికోవలయునుగాని గత్యంతరము లేదు.

వేంక — గత్యంతరమని సెలవీయవలయును.

సోమా — శిందుఁడు! దగ్గఱకు రాకుఁడు? నేను దర్భలుముట్టు

కొన్నవాఁడనే కాని తురకగడ్డములఁ దాఁకినవాఁడనుగాను. విభూతి పండ్లను బట్టుకొన్నవాఁడనే గాని, తురకబుఱ్ఱలంటినవాఁడనుగాను. మడి కొల్లాయలను ముట్టుకొన్నవాఁడనేగాని మైలపరాయిలను దృశించిన వాఁడనుగాను.

వేంక—దృశించి కాదయ్యా నీయిల్లు బంగారముగాను; స్పృశించి—

మొద—పట్టుకోవేమి ?

సోమా—ఉండు! ఉండు! జందెము మెడకుఁ జుట్టుకొని ప్రాణ భరణము చేయుదును, జాగ్రత్త.

వేంక—ప్రాణహారణమని సెలవీయవలయును. భటులారా! మీరీబ్రాహ్మణు నేలపట్టుకొందురు ?

రెండ—పిచ్చిశాస్త్రిలను బట్టుకొనుమని మాప్రభువువారి సెలవైనది. ఇదిగో యీగానుగుచెట్టుక్రింద వాతఁడున్నాడని మాయధికారి యిప్పుడే సెలవిచ్చినాఁడు.

సోమా—పిచ్చివాఁడైనవానిని బట్టుకో? గోష్పాదమంత జుట్టున్నవాఁడు పిచ్చివాఁడా? ఇటుచూడు! బిళ్లకచ్చపోసికొన్నవాఁడు పిచ్చివాఁడా? స్వచ్ఛమైన కర్మయోగి పిచ్చివాఁడా? లేచిపోయినభార్యకు ఘటశ్రాద్ధము చేసికొన్నవాఁడు పిచ్చివాఁడా? ఇదిగో! కడుపుపై "బ్రహ్మోహమ్మ"ని పచ్చబొటుభార్యచేతఁ బొడిపించుకొన్నవాఁడు పిచ్చివాఁడా?

వేంక—బ్రహ్మోహమ్మను నవశబ్దము శాశ్వతముగా నచ్చు బొడిపించితి వేమయ్యా?

సోమా—(అపవారించి) శాస్త్రీ! ఈమహాపాతకము దాఁటి మనము పైఁబడుమార్గ మాలోచింపవలయునయ్యా ?



వేంక—భటులారా! నామాటవిని మీరీబ్రాహ్మణుని మాత్రము ముట్టుకొనకుఁడు?

రెండ—మానబాబుగారి సెలవైనప్పుడు మాకెట్లుతప్పును ?

సోమా—ఇది యెక్కడి యమంగళపుటూరైపోయెను! ఆచారము లేదు, వ్యవహారము లేదు. మడి లేదు. మైల లేదు. పిన్న లేదు. పెద్ద లేదు. మీనబాబైనమాత్ర మూడిపడినాఁడా ? ఆతఁడు సింహాసనము మీఁదఁ గూర్చుండినయెడల నేను బ్రహ్మాసనముమీఁదఁ గూర్చుందును. ఆతనిచేతిలో నధికారమున్న యెడల నాచేతిలో నగ్నికార్యమున్నది. ఆయనకోటలో మహాలక్ష్మి తాండవమాడుచున్న యెడల మాయింటిలో సుబ్బలక్ష్మి యిదివఱకు వంటచేయుచుండెను. తాను ప్రభువైనంతుల కు—కర్మయోగులను భ్రష్టయోగులను జేయునా? భటులుగానుండుటకు మ్లేచ్ఛులే కాని పనికిరారా? రవ్వంత నాటకాలంకార సాహిత్యముండి శ్రోత్రియకుటుంబములోఁ జేరినవారిని భటులుగా నియమింపఁ గూడదా? మావంటి కర్మవిధానులను బట్టుకోవలసివచ్చినప్పుడు మడి చెడకుండ దర్భలతోఁ జేతులుగట్టి తీసికొనిపోవచ్చునే?

వేంక—భటులారా! ఈతఁడు శుద్ధఛాందసుఁడు. పిచ్చివాఁడు కాఁడు. వదలిపెట్టిపొండు.

మొద—వదలిపెట్టినయెడల మాబుఱ్ఱ లెగిరిపోవును?

వేంక—అటులైన నేను బట్టుకొని తీసికొనివత్తును. మఱేమియు భయము లేదు. మీరు నడువుఁడు.

సోమా—నన్నెక్కడకు వారు తీసికొనిపోవుదురు?

వేంక—కారాగృహములోనికి—

సోమా—అక్కడ నగ్నిశాల—దేవతార్చనపుగది—యుండునా?

వేంక—తురకల మసీదులోఁ దులసిబృందావనముండునా ?

సోమా—అటులైన నీదినఁపు నిత్యవిధిమాట యేమి ? ఇంకను స్నానము చేయ లేదుగదా ?—

వేంక—ఏమి చేయవచ్చును ? ప్రభువాజ్ఞ ?

సోమా—ఈదినమున జరుగు కర్మలోపమునకు బాధ్యులెవరు ? సాహేబులా ? నీవా ? ప్రభువా ?

వేంక—ఎవఁడునుగాఁడు. మీ ప్రారబ్ధము.

రెండ—ఆలస్యమగుచున్నది రండు ?

వేంక—అవధానులుగారూ ! ఆలోచించినఁ గార్యము లేదు. నడువుఁడు.

సోమా—ఈదిగువున జరుగవలసిన యగ్నిహోత్రముమాట యేమియో యది ముందుచెప్పు ?

వేంక—మీరు భార్యావిహీనులై యున్నారుగదా ? అగ్నికార్యాధికార మపత్నీకునకు లేదుగదా ?

సోమా—ఈయధిక్షేము వచ్చుననియే—నారదమహర్షి కళత్రవియోగమైన తరువాత బంగారుద్రౌపదిని జేసి భార్యగా నుంచుకొని రాజసూయము చేసినట్లు నేను పేడ బంగారిని జేసి ప్రాణప్రతిష్ఠ చేసినాను.

వేంక—హరి హరీ! మహాపతివ్రతయైన ద్రౌపదీదేవికిని, బరమపవిత్రుఁడైన మహర్షికిని లంకెపెట్టినావేమయ్యా? ఎంత ప్రారబ్ధము!

రెండ—త్వరగా నడువుఁడు?

వేంక—భటులారా ! ఈశాస్త్రులుగారు మిగుల గౌరవ్యులు, మీరు వీరిని బాగుగా నాదరింపవలయును?

మొద—ఆలాగే.

(వెనుక తెరయెత్తఁగఁ గారాగృహము)



రెండ—ఇదియే ఖైద్‌ఖానా! అరే ! శాస్త్రీ—లోపలికిపదు?

సోమా—అయ్యో! అయ్యో! తప్పదా? (లోనికిఁబోవును)

వేంక—ఆహితాగ్నులగు మీకెంతగతిపట్టినది! అయ్యయ్యో!

సోమా—చూడు ! భార్యబంగారి బండలైనది—నిత్యదేవతార్చన కడ్డులేకుండ జరుపుచున్న మఱఁదలు సుబ్బలక్ష్మి మాయమైనది. ఒక్కఁడను విదేశమున నున్నాఁడను—నాకు భార్యయైన మఱఁదలైన నీవేకాని మఱియొకరు కారు. ఈదినమున నగ్నికార్యము లేనియెడల నేనెట్లు నిలువఁగలను ?

వేంక—ఇఁక నొకచేయగ్నికార్యమువలెఁ గనఁబడుచున్నది. అయినను మీవిడుదలకు నేనొక యుపాయ మాలోచించెదను. నేను జెప్పినట్లు చేయుదురా?

సోమా—(అఁగీకరించి) అభ్యంతరమేమి?

వేంక—నేను బోవుదును. భటులారా ! ఈయనకు భోజనము నేనుదెచ్చిపెట్టెదను. అప్పుడు తలుపుదీయఁ బ్రార్థించుచున్నాను.

భటులు—సరే పో: (వేంకటశాస్త్రి పోవును. భటుఁడుప్రక్కకుఁబోవును.)

సోమా—అన్ని విధములైన కర్మములకుఁ దగిన యంగులతో నున్న యిల్లువదలి వేంకటశాస్త్రియింటఁ బ్రవేశించినందులకే విచారించుచుండఁగా—నదియు వదలి కారాగృహమున నుండవలసివచ్చెను. ఇక్కడదర్భలా? తండులములా ? తిలలా? గోమయమా? ఏమున్నది? ఓకర్మదేవతా ! ఓశ్రాద్ధపురుషా ! నన్నెట్లుద్ధరింతువో ?—

(ప్రక్కకొట్టులోనున్న సుబ్బలక్ష్మి యదరిపడి కిటికీసందునుండి చూచును.)

సుబ్బ—(తనలో) అయ్యయ్యో ! మాబావ! అతనికిఁ గూడ నిక్కడకు రావలసిన గతి యేల సిద్ధించెనో ? అయ్యయ్యో ! మహా

మాయగానున్నది. అక్క యేమయ్యెనో తెలియదు. నాబ్రతుకిట్లయినది. పైని ముసుఁగేమి! క్రింద గడ్డమేమి? గడ్డమూడఁదీసికొనిన యెడల మూతిమీఁద గొట్టెదనని యాఁతఁడెవఁడో బెదిరించినాఁడు! ఒక్కసారి మా బావను బిలుతునా? ఇట్టిస్థితిలో నన్నానవాలు పట్టఁగలఁడా? అదిగాక—గడ్డము బిగిసి పట్టుటచేత గొంతునకు మామూలుధ్వని లేకుండనున్నది. అయినను మనస్సుండఁబట్టలేదు. పిలుతును (నిమ్మళముగా) బావా! బావా!—

సోమా—ఎవరు నన్ను బావా యని పిలుచువారు? (ప్రక్కకుఁదిరుగును.)

సుబ్బ—నేనే బావా! నన్నెఱుఁగవా ?

సోమా—ఓరితురకముండవాఁడా! బావా బావా యని నన్ను బిలుచుచున్నావా ? నేను బిచ్చిముండకొడుకునని యేనా నీనమ్మకము! "క్రోఁతీ నా ముక్కు దురద" యని పిల్లవాఁడు క్రోఁతినాడించినట్లు నీవు నన్నేడ్పించెదవా?

సుబ్బ—అడుగుగడ్డముచూచి మోసపోకుము. పైముసుఁగు బరిశీలింపుము. నేను సుబ్బలక్ష్మిని—మాయక్క బంగారమ్మ కనఁబడినదా?

సోమా—(తనలో) నా భార్య బంగారమ్మ బండలైనది—మఱఁదలు సుబ్బలక్ష్మి మాయమైనదని యిప్పుడే కాదా యిచ్చటిభటులు వినుచుండఁగా వేంకటశాస్త్రితోఁ జెప్పితిని? ఆమాటలనుబట్టి యాభటులలో నొక్కఁడీవేసమున నన్నుఁ గిటికీలోనుండి తొంగిచూచుచుఁ బరిహాసించుచున్నాఁడు! ఏమున్నది! నలుగురుఁ గలసి పిచ్చి పిచ్చియనిన యెడల నాకుఁ బిచ్చియెత్తుట కేమైన సందేహమా ? ఇచ్చటనుండి త్వరగఁబోయినఁగాని మతిపోవుచున్నట్లున్నది.

సుబ్బ—బావా! మాటలాడవా ? బంగారమ్మ యేమైనది?



సోమా—బంగారమ్మ చచ్చిపోయినది. ఘటశ్రాద్ధమైపోయినది. నాకు మతిపోయినది. సుబ్బలక్ష్మి చచ్చిపోయినది. పో! ముండకొడుక ! నీకెందులకు ?

(నేపథ్యమున)

బద్ధులగువారొకరితో నొకరు మాటలాడుకొనుచున్నారు. జాగ్రత్త. ఈకొట్టులోని సాహేబుముండను మఱియొక కొట్టులోనుంచుము ?

భటు—(ప్రవేశించి) రంజాసాహేబ్! నీవు రెండవకొట్టులోనికిఁబో. నీమాటవినఁబడిన యెడల వీఁపు చిటులఁగొట్టెదను. (సుబ్బమ్మ లోనుండియే నిష్క్రమించును)

సోమా—(తనలో) ఇంకను వేంకటశాస్త్రి రాలేదు. ఎందుచేతనో తెలియదు. కర్మమున కాలస్యమగుచున్నది. ఏతంటాలుపడియైన వెలుపలఁ బడినఁగాని కర్మప్రాణములు దక్కవు.

వేంక—(పళ్ళెరము చేతఁబట్టుకొని చెంబుతోఁగూడఁ బ్రవేశించి) (అవవారించి) అవధానులుగారూ! నేను చెప్పినట్లు వినినఁగాని మీరు వెలుపలఁబడలేరు.

సోమా—(అవవారించి) నాయనా ! నీయిష్టమెటులో యటులే చేసెదను.

వేంక—భటుఁడా!

భటు—ఎందులకు ?

వేంక—ఈ బ్రాహ్మణుఁడు భుజియించును. తాళము తీసెదవా?

భటు—(తాళము తీయును.)

వేంక—ఈయన గొప్పవాఁడు. ఆహితాగ్ని— కొట్టులోనే భుజియించుట కిష్టపడఁడు ! కొట్టునకీవలనున్న యీబయట భుజియించును. ఆయన భుజియించుచుండఁగా నీవు చూడఁగూడదు. కావునఁ గొంచెము చాటునఁ గూరుచుండుము?

భటు—బాపన్ పచ్చపులు మన మాతికి థోడా తగిలించుచే.

వేంక—నీకు దీనిలోని దిప్పుడియ్యఁగూడదు. వెడలి పోవునప్పుడు మిగిలినది నీకేయిచ్చెదను.

భటు—బస్! (నిష్క్రమించును.)

సోమా—అబ్బ! అబ్బ! ఎంతగతిపట్టినది! (వెలుపలకువచ్చి) వేంకటశాస్త్రీ! నీకుమతిలేదా? నాకిప్పుడాహారమేల తెచ్చితివి ?

వేంక—విను! (పళ్ళెరముపైమూఁతఁదీసి) ఇదిగో గోవులపంచె. మామేనత్తది—చాటునకుఁబోయి కట్టుకొని పాఱిపోవలయును. ఏమి నీయభిప్రాయము ?

సోమా—నాకిక్కడనున్న యెడలమతిపోవుట తప్పను. ఇక్కడ తురకలందఱుఁ జేరి నేనుబిచ్చివాఁడనని రెచ్చఁగొట్టుచున్నారు. మతిపోయినను నిత్యకర్మము జరుపుకొందునుగాని మతిపోయినతరువాతజరుపుకొనలేను.

వేంక—సరే. అటులయినఁగట్టుకో. సందేహించుచున్నావేమి? అడ్డుకట్టు చేతఁగాదాయేమి?

సోమా—ఇంటి పదిమందియు గంగాభాగీరథీసమానులైనప్పుడు—అడ్డుకట్టుచేతఁగాకేమి ? ఈబిళ్లకచ్చమీఁదఁగట్టుకునా ? ఇదితీసివైచి కట్టుదునా ? అని చూచుచున్నాను.

వేంక—తీసివైచియే కట్టుకొనుము. ఆలస్యముచేసిన లాభము లేదు. ఆచాటునకుఁబోయి చప్పునఁ గట్టుకొనిరమ్ము. అయ్యో! తిరుగఁగొట్టులోనికే పోవుచున్నావేమయ్యా ? ఇది నీకుఁ దప్పదాయేమి కర్మము ఆప్రక్కకుఁ బొమ్ము?

సోమా—(చాటునకుఁ బోవును)

వేంక—ఎలాగుననైన నీబ్రాహ్మణుఁడు వెలుపలఁబడినయెడల నేనదృష్టవంతుఁడను. ఏగోదావరిజిల్లావాఁడో యాత్రామూలముగా నిక్కడకు వచ్చుటయేమి—మాకొంపలోఁ బ్రవేశించుటయేమి—ఇది



పఱకీర్తియు మాయమగుటయేమి—ఈతనియవస్థ యిటులుండుటయేమి—కర్మము లేని యెడల నీముండకొడుకు నాలుకలాగికొని చచ్చునేమో? ఈబ్రహ్మహత్య నానెత్తిని బడునేమో కర్మము! అవధానులు గారు! అయినదా?

సోమా—(చాటునుండి) ఆ. ముసుఁగు వేసికొనుచున్నాను. (వెలుపలికి వచ్చును.)

వేంక—పహా వ్వా! బ్రహ్మభేద్యముగ నున్నావు. సెలువు తలకుఁ జుట్టుకొన్నప్పుడు సీతారామాభ్యాన్నమ యనిచుట్టుకొంటివిగదా—ముసుఁగు వేసికొన్నప్పుడు—ఏమని వేసికొంటివి? నీవు కట్టుకొన్నబట్ట—అంగవస్త్రము—ఆకంబళిచుట్టుమీఁద గప్పి చప్పునఁ బాఱిపొమ్ము. గడ్డిపఱపుమీఁదనవధానులుగారు పండుకొనినట్లే కనఁబడును. తెలిసినదా ?

సోమా—నాకీయింటికిఁదూర్పుదిక్కు తెలియకుండనున్నదిపఁడి?

వేంక—సాయంసమయార్ఘ్యప్రదానమునకాయేమి ? ఇప్పుడు తూర్పు దిక్కెందులకు ?

సోమా—తలవైపు తూర్పుగా నుండినయెడల యథావిధిగా నుండునుగదా ?

వేంక—అవధానులుగారనాథలగుట యథావిధిగా నున్నదాయేమి? చప్పున గానిచ్చి రావయ్యా?

సోమా—(కంబళిచుట్టుపై వస్త్రమునుగప్పి) ఇదిగో; వచ్చితిని.

వేంక—సరే! చూడు. తిరుగ నాంజనేయునికోవెలయొద్ద—తెలిసినదా—పెద్దచెఱువుగట్టుమీఁది యాంజనేయుని కోవెలయొద్ద—నన్నుఁగలిసికో ? (సోమావధాని నిష్క్రమించును )

వేంక—భటుఁడా! కొట్టునకుఁ దాళము వేయుము?

భటు—(ప్రవేశించి) శాస్త్రిజీయప్పుడే బిఛానా వేసినాఁడా?

వేంక—అతనికిఁ జేయి కడుగుకొనుటతోడనే నిద్రపోవుట యలవాటు. ఇదిగో! భక్ష్యముల పొట్లము. మీదయకు సంతసించితిని. ఇదిగో! ఈనాణెము కూడఁ బరిగ్రహింపుము. (ఇచ్చును.)

భటు—సలాం. సలాం (తాళము వేసికొని యచ్చటఁ గూరుచుండును.)

వేంక—నేను బోవుదును. (నిష్క్రమించును)

[వెనుకఁ దెరదింపఁగ సోమావధాని పరుగెత్తుచుఁ బ్రవేశించును.]

సోమా—రాకు. నావెంట రాకు ?

[ఒక భటుఁడు ప్రవేశించును]

భటు—నీవెవ్వరవు ?

సోమా—ఎవరని యెన్నిసారు లడుగుదువు ? ఇదివఱకుఁ జెప్పలేదా? విధవను. మఱియొకసారి విధవను. చచ్చువిధవను; తెలిసినదా? నడు. నడు. నీకెందులకు ?

భటు—నీపే రేది?

సోమా—నాపేరెందులకు? నాయూరెందులకు ? అల్లరిచిల్లరిదాననను కొంటివా ? (పోఁబోవును)

భటు—(కూడఁ బరుగెత్తును) నీపేరు చెప్పినఁగాని నేను నిన్న వదలను,

సోమా—అటులైన నాపేరు సుబ్బలక్ష్మి.

భటు—అదే—నాకుఁగావలసినది— అందుకొఱకే నీవెంట వచ్చుచుంటిని. వేంకటశాస్త్రియను నాతఁడు సుబ్బలక్ష్మి బంగారమ్మ యను పేళ్లుగల యిద్దఱు స్త్రీలు కనఁబడలేరనియు, వారిని పట్టుకొని మా రక్షకభటాలయములో భద్రముగా నుంపుఁడనియు మూఁడుదినముల క్రింద మాకొక్క ప్రార్థనాపత్రము పంపియున్నాఁడు.

సోమా—నాతోఁ జెప్పకుండ నతఁడేల పంపినాఁడు ?



భటు—నీవు పాఱిపోయిన సుబ్బలక్ష్మివైనప్పుడు నిన్నెట్ల డుగును ?

సోమా—(తెల్లబోయి) సరిసరి! ఆసుబ్బలక్ష్మి వేఱయ్యా; అది యొక దిక్కుమాలిన సుబ్బలక్ష్మి, నేనొక చచ్చుముండ సుబ్బలక్ష్మిని—

భటు—గోవులవంచె కట్టుకొన్నదని దీనిలో వ్రాసినాఁడు; ఇదిగో! గోవులవంచెల చామనచాయిగలదని వ్రాసినాఁడు నీది చామనచాయ. పొడుగుగాదు పొట్టిగాదని వ్రాసినాఁడు. నీవు నట్లే యుంటివి.

సోమా—అది పడుచు సుబ్బలక్ష్మియయ్యా ! నేను ముసలిముండ సుబ్బలక్ష్మిని.

భటు—దీనిలో నడిమివయసని వ్రాసినాఁడు. నీవుమాత్రమేమంత ముసలిదానవు !

సోమా—బ్రహ్మచర్యవ్రతమున నీలాగునఁ గనఁబడుచుంటినే గాని నేను ముసలిదాననే నయ్యా ?

భటు—నాకిన్ని తెలియవు రమ్ము. (పట్టుకొనును)

సోమా—సరే—సరే—భటుఁడా ! మీ కారాగృహములోఁ రండాసాహెబు లేఁడుగద ?

భటు—అక్కడ సాహెబు లెవ్వరును లేరు.

సోమా—సరే—కొంతవఱకైన శ్రోత్రియపుఁ గొట్టేకద ? (తనలో) హరహరా! వేంకటశాస్త్రిగాఁడు నాతోఁ జెప్పకుండ నీపత్రము వ్రాయనేల ? పోనీ; వ్రాసినతరువాత నైన నాతోఁ నేడువఁగూడదా? మఱియొకపేరైనఁ జెప్పి యేడ్తునే, (భటుఁడు, సోమావధానియు నిష్క్రమింతురు)

వేంక—(ప్రవేశించి) ఆంజనేయులగుడి లేదు.—అమ్మవారిగుడి లేదు. ఏమిగతి. మఱెక్కడనైనఁ బోయి వెదకుదును. ఇంతయుఁ జేసిన తరువాత మఱెక్కడనైనఁ దిరుగఁజిక్కునేమో ? (నిష్క్రమించును.)

ఇది పంచమాంకము.



శ్రీ

# కంఠాభరణము



## షష్ఠాంకము.



ప్రదేశము — వీధి

[ప్రవేశము — సూరయ్య, కామయ్య]

సూర — పీర్లపండుగలోవలె నూరఁతయు డప్పులధ్వనియే వినఁబడుచున్నది!

కామ — పిచ్చివాఁడెవఁడో గ్రామములోనికి వచ్చినాఁడఁట! అతఁడేమో మహావిద్వాంసుఁడఁట! ఈదినమున నిక్కడఁగనఁబడి రైలెక్కి పోకుండ తేపు రెండువందలమైళ్ళ దూరమున నున్న మఱియొక యూరఁగనఁబడునఁట! చిదానందపురుషుఁడఁట! అతఁడు కారాగృహము నుండి తప్పించుకొని పాఱిపోయినాఁడఁట!

సూర — ఆసంగతి నేనుఁ గూడఁ గొంచెము వింటిని. కాని యింకొక యాఁడుది తప్పిపోయినట్లును నామెను వెదకి పట్టుకొనవలసినదనియు మఱియొక చాటింపైనది నీవువిన్నావా?

కామ — నేను వినలేదు కాని నాభార్య విని చెప్పినది. బంగారమ్మయను పేరుగల యొకపుణ్యస్త్రీ తప్పిపోయినఁదఁట.

[లోపల డప్పులధ్వని]

ఈదినమున రెండుగడియల రాత్రియగుసరికిఁ బిచ్చిశాస్త్రిలను బంగారమ్మను నబాబుగారి కచ్చేరికి హాజరుపెట్టనియెడల రక్షకభటాధి



కారుల తలలు నిలుపవని రూఢిగానమ్మవలసినది. పిచ్చిశాస్త్రిలకు తమ యింటిలో దాఁచినవారి యీనాములు నిండ్లు నబాబుగారు జప్తిచేయుదురనియిందుమూలముగఁ దెలిసికోవలసినదోహోయి! (డప్పుధ్వని)

సూర — నబాబుగారు రాత్రికచ్చేరి చేయుదురు కాఁబోలు! నేనుబోయి యేమిచిత్రములుజరుగునోచూతును. నీవుగూడవచ్చెదవా?

కామ — ఇంటియొద్దఁ జేయుపనిమాత్రమేమున్నది; అలాగే.

సూర — అటులైనఁ ద్వరగ భోజనముఁజేసి వేగరా! వేగఁబోయినఁ గాని మనకుఁ దావు దొరకదేమో?

కామ — అటులే! (ఇద్దఱు నిష్క్రమింతురు.)

ఇది విష్కంభము



ప్రదేశము—నవాబుగారి కచ్చేరి.

ప్రవేశము—రంగాచార్యులు—సుబ్బిసెట్టి.

రంగా—ఈరోజున విచారింపఁబడు కంఠమాలమొకద్దమాలో సాక్షులను వకీలును జాగ్రత్తపఱచుకొంటివా ?

సుబ్బి—(మూటవిప్పుచు) మాజాగ్రత్తలేమి బాబూ! కోమటి వారము! ఎప్పుడైనను గచ్చేరి మొగము చూచినవారమా? సాక్షులేమో—సారాంశమేమో—వకీళ్ళేమో—వల్లకాళ్ళేమో—యెప్పుడైన బుద్ధి పుట్టి మొఱఁగిన తరువాత విని యేడ్చితిమా? కోమటయ్యలా గాలన్నీ కుంచముపట్టులో నున్నట్లు, కచ్చేరి కీలకమంతయు మీ? లోనున్నది.

రంగా—ఇంతసేపటినుండియు విప్పుచున్న యామూట యేమి?

సుబ్బి—బాబూ! తమకు దాఖలుచేసికొనుటకు రవంతముద్ద కజ్జూరము దెచ్చినాను. మాకేమున్నది బాబూ! కొట్టునిండే—కడుపునిండు! యుద్ధాలువచ్చినప్పటినుండి యొంటిపూటభోజనమే కద! కొట్టులో సరకు లేకపోయినను—దమ తరువు సరుకులో నెప్పుడైనఁ దేడామాటఁ జెప్పినవాఁడనుగానుగద! ప్రతిచింతపండుబుట్టయే దాఖలు చేసికొందురో, కొత్తధాన్యము బస్తాయే దాఖలు చేసికొందురో చేతులుగట్టుకొని సిద్ధముగానున్నవాఁడనుగదా! మీయిష్టమేయిష్టము; మీదయయే దయ!

రంగా—సెట్టీ! నీవే యట్టి బీదయఱపు లఱచిన నిఁక నితరుల మాటఁ జెప్పవలసినదేమి! నవాబుగారిచ్చుచున్న నాల్గువరాలతో మాకు మాత్రము సంసారము జరగునా? కజ్జూరపు ముద్దతోడనే మొకద్దమా తీరుమానమగునని యెంచితివా? దర్బారుద్యోగుల నెంత తేలికగాఁ జూచుచున్నావు?



సుబ్బి—ఎంతమాట సెలవిచ్చినారు బాబూ! మీరు మానెత్తి మీఁదివారు. మీరు బ్రాహ్మణులు. ఉద్యోగులు. ఉల్లిపాయలమ్ముకొను కోమటివారము మేము. మీరెక్కడ మే మెక్కడ—మిమ్ము దేలికగాఁజూచుటకు గుండెలున్నవా? తేలికమెంటనే బరువుగాఁ జూచి పైవారియొడిలోఁ బాఱఁబోయు భయస్వభావముగలవారి నింతమాటయనుట న్యాయమేనా? బాబూ! ఊరిలోనుండుమన్న నుండెదను. పొమ్మన్నఁబోయెదను. మాకింతబత్తెమున కేమైన నిచ్చి కొట్టుకొట్టు మీరే దాఖలు చేసికొనుఁడు? అందులో సౌభాగ్యాలు, సంబరాలు నేమియు లేవు.

రంగా—వెఱ్ఱిచదువు చదువకు. ఏఁబదిరూపాయలిచ్చినమొదల నీకంఠాభరణము నీకిప్పింతును?

సుబ్బి—రవంతముక్క నామీఁదఁ బాఱవైచి యేఁబది కాదు నూఱు తీసికొనుఁడు. వద్దన్నవారెవ్వరు?

రంగా—నోటు వ్రాయుమందువా? తనఖాదస్తావే జిక్కులేదుకదా?

సుబ్బి—బాబూ! రంగాచార్యులుగారూ! మనకు మన కెన్నఁడైన భేదాలున్నవా? ఈయుడుపు దాఖలు చేసికొనుఁడు? (చేతిలోఁ బెట్టును.)

రంగా—అయిదురూపాయలా యిచ్చెదవు? ఛీఛీ!

సుబ్బి—వ్యవహారము పైసలయిన తరువాత నొకమణుగు బెల్లపుముక్క తీసికొనరాదఁటయ్యా? నేను మిమ్ము సంతోషపెట్టెదను? వచ్చినబేరము వదలుకొనకుఁడు బాబూ! మాలాగున మీకేమి వడ్డిదండుగులు—పెట్టుబడులు—కొట్టుతఱుఁగులు—సంచితఱుఁగులు లేవుకదా? మీకేమిమహారాజులు! ఎంతవచ్చిన సంతేలాభము! అంతయు మీదే. మేము మీవారముకామా? మీయింటిలోఁ బెండ్లికి దో

రక్షిన తిరువెంగడమ్మగారిచేతి ప్రసాద మిప్పటికి మఱపురాదుగద? ప లగకాయపచ్చడి యీయమ్మయే చేయవలయును?

రంగా—ఎన్ని పనికిమాలిన మాటలైన విడిచెదవు గాని పైస విడుచుటకుఁ బ్రాణ మొప్పదుగదా? నాలుగైదు దినములక్రిందట షష్ఠి పూర్తి చేసికొంటివఁట—నన్నుఁ దాంబూలమునకుఁ బిలువ నక్కఱలేదా?

సుబ్బి—నేనేమి యెఱుఁగుదును? ఏదో కార్యకర్మమని—మేజువాణియని—వేపారివాఁడు నాకొంపయన్నివిధములఁ దీసినాఁడు. వానికి స్థిరమైన చుఱకయొకటి వేయించు బాబూ! పదియూపాయలసొమ్ము బదులైనఁ దెచ్చి మీచిన్నకొడుకు పెండ్లికిఁ గట్నమైనఁ జదివించెదను?

రంగా—గొప్పసాహసమైనపని చేయఁదలఁచుకొన్నావు! నడు. నడు. నబాబుగారు వచ్చుచున్నట్లున్నారు. అదేమి! ఖర్జూరపుఁ బండుపొట్లము తీసికొనిపోవుచున్నావేమి?

సుబ్బి—మీకక్కఱలేదని సెలవిచ్చితిరి కాదా? మీకుఁ గావలసినయెడల సాయంకాల మంపింతును.

(నేపథ్యమున)

నబాబ్ సర్కార్ సయ్యద్షా మహమ్మదుహమీనుద్దీన్
ఖాదర్నాయబే రసూలిల్లాఖాన్ బహద్దర్ గండేసవా
యీకే సాహేబ్ సలామతీ!

రంగా—(లేచి) సుబ్బిసెట్టి! లే?

(నబాబుగారు పరివారముతోఁ బ్రవేశింతురు)

రంగా—ఆదాబ్! బాదుషాహీ సర్కార్!

సుబ్బి—అబ్బో! అబ్బో! సలాములు సలాములు, నబాబుగారికినాలుగువందల సలాములు బాబూ!



నబా—హుక్కాలారే?

భటు—(గొట్టము నందించును)

నబా—(పీల్చుచు) రంగాచారి! యెః కోన్రే! బఖాల్ సాదిస్తాహై!

రంగా—జీసర్కార్! కోమటియే! సుబ్బిసెట్టి. ఈగ్రామములోఁ బెద్దవర్తకుఁడు, అతని కంఠాభరణ మొకవేపారి హరించినాఁడని హుజూరులో మొకద్దమా దాఖలు చేసికొనినాఁడు అది యీరోజున విచారణ. అందుచేత వచ్చినాఁడు.

సుబ్బి—అంతేకాదు. నబాబయ్యగారూ! నడుమువిఱుగునట్లు కొట్టినాఁడు.

రంగా—(అపవారించి) దెబ్బలస్థలమేదో చూపించుసెట్టీ!

సుబ్బి—(వెనుకకుఁ దిరిగి) ఇదిగో! పాదుషాగారు చిత్తగింపవలెను. (పృష్ఠభాగముఁ జూపును)

నబా—అరే! గులామ్! యెః బఖాల్కు మార్. బేహాయా గద్ధా నబాబుసర్కార్కే ముగంమీఁదా తేరా పిఱ్ఱాదిఖాయించి—హైవాన్—(భటుఁడు కొట్టును)

సుబ్బి—అయ్యల్లో! అయ్యల్లో!

నబా—పిఱ్ఱాఫర్ లగావ్? జాన్వరకూ. (భటుఁడుకొట్టును)

సుబ్బి—అయ్యల్లో! (అపవారించి) రంగన్నగారూ! చూపింపుమని చెప్పితివేమయ్యా? మీమూలమున దెబ్బలుఁగూడనా?

రంగా—(అపవారించి) పిసిఁడిముండకొడుకా! అయిదురూపాయలు చేతఁ బెట్టెదవా?

సుబ్బి—(అపవారించి) ఇంక నొక పావులాకాసు తీసికొనరాదయ్యా—వద్దన్నవారెవరు?

నబా—రంగాచారి! బోగందానికి బులారే?

రంగా—ఈరోజునఁ బెద్ద మొకద్దమా యున్నది.

నబా—బఖాల్ దేనా ?

రంగా—ఈతని మొకద్దమాతో సంబంధించి రెండుమూఁడున్నవి. అంతయుఁ జిక్కువ్యవహారములాగునఁ గనఁబడుచున్నది. అందుచేతఁ గంచనిని బిలిపింపలేదు—

నబా—బులారే ! కంచనిలేని కచ్చేరీ క్యామజారే ? మేజవానిగడ్‌బడ్ జరూర్ లేదులే? దగ్గరా బైఠాయించి థోడీఖుష్‌ఖబ్‌రీ—

రంగా—జీ సర్కార్ ! ఎవరిని బిలుపింపుమని హుకుమ్?

నబా—సుందరికి బులావ్ ?

రంగా—సుందరి యీవ్యవహారములో నొకముద్దాయిగా నున్నది.

నబా—బస్. మఱింతమంచిది. అందఱికి హాజర్ పెట్టు?

[సాహేబువేసమున నున్న శ్రీనివాసరావు, సుందరి, యొకరిచేతికొకరుకట్టఁబడి, కృష్ణరావు, రుక్మిణి, సుబ్బలక్ష్మి, యొకరిచేతికొకరు కట్టఁబడి, యిద్దఱు రక్షకభటులతోఁ బ్రవేశింతురు]

రక్ష—ఆదాబ్ నబాబ్ సర్కార్ !

నబా—వహవ్వా ! క్యారేరంగాచారి : ఎద్దులకు యెద్దులకూ లాగు జోడీజోడీ టకాయించివుందీ! బలే! వహీలేజోడీ యెః సాహేబు ఔర్ యెఃసుందరికీ ముందుకూ లాగుచే ?

రక్ష—(వారిని ముందునకు లాగి నిలువఁ బెట్టును)

రంగా—ముందు సెట్టి కంఠమాల మొకద్దమా విచారించిన మొదల మిగిలినవన్నియు దాని వెనుక సందర్భముగా వచ్చును.

నబా—సందర్భమూ గిందర్భమూ హంకూజరూర్‌నహి. సానీయెక్కడ హాజర్ అక్కడే మూకు సందర్భం—ఁరిమొకద్దమా షురూకరో



రంగా—సాహేబూ ! నీపేరేది ?

నబా—రంగాచారి ! బుద్ధిలేదూ ! మొదట సానికీ దరియాప్తుకరో ?

రంగా—అమ్మా ! నీపేరేది ?

నబా—హహహహ ! అమ్మా!— అమ్మా క్యారే ? సానీ నీకూ తల్లీ చే? ధూ ! ధూ ! బాపనవానికి సిగ్గూలేదు. దానిపేరూ నీవెఱుఁగుదువుగాదూ; తరువాత ఖయాయిష్‌పూఛో ?

రంగా—సుందరీ ! నీవెఱిఁగినసంగతు లేవియో ప్రమాణము మీఁద సర్కారువారితో మనవిఁజేసికో ?

సుంద—నాకొక్క వకీలున్నాఁడు.

[వకీలు ప్రవేశించును.]

వకీ—సలామ్ నబాబ్ సర్కార్ ! సుందరి తరపున నేను వకీలను.

నబా—వకీల్ గికీల్ బేజరూర్ ! తూ జా.

వకీ—ఇతఁడు బలాత్కారముగా సుందరియొద్దనుండి విడుదల దస్తావేజు వ్రాయించుకొన్నాఁడు. గొప్పనేరము. వకీలున్నఁగాని సర్కారువారికి యథార్థము విశదముకాదు,

నబా—జారే! వకీల్కీ జరూర్ నహీ ! జారే ! ఖబర్‌దార్ ! పట్టా ఉఖాడుంగా? (వకీలుపోవును.)

రంగా—సుందరీ! నీవెఱిఁగిన సంగతులేవో మనవిఁజేసికో?

సుంద—నబాబుగారూ ! నేను వేశ్యను. నన్నుఁ గొన్నిమాసములనుండి కృష్ణరావను వేపారిపంతులుగారు పోషించుచున్నారు.

నబా—కృష్ణరావు కహా ?

కృష్ణ—జీ సర్కార్ ! ఇచ్చట నున్నాను.

నబా—బలేవాఁడవు నీవు! సుందరికీ నీకుజోడీ బనాయించినది.

సర్కార్కి ఖుషీగానున్నది. వేశ్యకు వేపారివండల్ కు మాంసానికి మసాలాకున్న దోస్తు.

సుంద—నాల్గు దినములక్రిందట నొకరాత్రి సుబ్బిసెట్టిగారి యింటిలో మేజువాణి కానిచ్చుకొని—

నబా—సెట్టికి సానికి ములాఖాత్ క్యా? ఇంగువయెక్కడ హీనాకీఅత్తర్ యెక్కడ?

సుంద—సుబ్బిసెట్టి షష్ఠిపూర్తిమహోత్సవసందర్భమున మేజువాణీచేసితిని.

నబా—షష్ఠిపూర్తీ క్యారే?

రంగా—అఱువదియవ సంవత్సరము మనుజునకు మహాగండము. అది దాఁటుటకుఁగాను వైదికులు ప్రాయశ్చిత్తము కొందఱు చేసికొందురు,

నబా—ఖూఖూ! జానేదేవు! తరువాత?

సుంద—వీధిలోనుండి యింటికిఁబోవుచుండఁగా నీ సాహేబు కృష్ణరావును జావగొట్టి నన్ను బలాత్కారమున నొకయింటికి లాగుకొనిపోయి యచ్చట నిదివఱకు వేపారివంతులు నాపేరఁ జిత్తుకాగితముమీఁద వ్రాసియిచ్చిన మాన్యములను రుక్మిణమ్మయను నొకయామెపేర వ్రాయించినాఁడు. చంపునేమోయను భయముచే నామెపేర ముద్రకాగితముమీఁద వ్రాసియిచ్చితిని. నావ్రేలిముద్రను వేయించుకొనినాఁడు. మునుపు వేపారివంతులు వ్రాసియిచ్చిన చిత్తుకాగితమెచ్చటనున్నదో తెమ్మని నన్నడిగినాఁడు. అదియింటియొద్దనున్నదని చెప్పితిని. నన్ను దిరుగ నింటికిఁదీసుకొనిపోవుచుండగా గస్తితిరుగు నీరక్షకభటుఁడు నాకుఁ గనఁబడెను. అతనితో నీసంగతి చెప్పుకొనియేడ్చితిని. అంతట నాతఁడు మమ్మిద్దఱను గట్టకట్టి కారాగృహమున నుంచినాఁడు.

నబా—సుందరికి వేఱుచేసి దగ్గఱకు లాగించు?



రక్ష—జీ సర్కార్! (తీసికొని వచ్చును.)

నబా—వహవ్వా! నబాబ్ సర్కార్ కీ యిప్పుడు ఖుషీ! రంగాచారీ! పై మొక్కద్దమా కానీ?

రంగా—సాహేబూ! నీపేరేది?

నబా—థోడారహో! సుందరీ! ఏక్ టుమ్రీ-ఏక్ టప్పా-గానాబజావ్, తురకలే తమామ్ జహాఁకు నబాబులు. ఎన్నిజాగీర్లిందఱి కిచ్చినారు! దుస్రేకు పెట్టినవారే—ఖాన్ తిన్నా వారే! ఖానా-జనానా—అవుర గానా—ఈమూఁడూ వారికి హమేషా రహానా? ఇవి మెంతజాస్తిగానున్న—అంఖ్వాన్దానీ—మూబాబ్ జీ రోజీనా మూఁడువందల కూరలతో భోజనంజేసి భర్ పూర్ అయ్యేవారు. ఇప్పుడూ మేమూ మూఁడువందల కూరలు లగాయించీ బాబాజీకా నామ్ యిక్కడ ఖడాయింపు చేసివున్నామ్. రెండుకోళ్ళ పలావ్-ఏక్ గుటకా మే ఫైసలా! ఇప్పటికైనా సరే; మూఁడువందల కూరలు యెవఁడుఖానా కర్నేకు తాఖత్ దార్ అగునో వాఁడూ మఱునాటికీ నబాబ్ కావలసినదే; గోలకొండ నబాబుగారు పరదాదాజీకి దాదాజీకియీ జాగీర్ కూరలకోసరంయినాయతు ఫరమాయించినారు. గుజిస్తా బాతూం కాహేకు. బస్ బస్! సుందరీ! ఏక్ టుమ్రీ.

సుంద—హిందుస్తాని పాటలు నాకు రావు.

నబా—తెలంగీ పట్టిగడ్డిబాస. ఉన్ మేరస్ నహీ. ఔర్ జీవ్ నహీ. జానేదేవ్! గావ్?

సుంద—సుతిలేదు-మద్దెలలేదు-ఎట్లుపాడఁగలను?

నబా—జరూర్ లేదు. ఖాలీపాటకే మజాజాస్తి-అల్లాయిచ్చిన గల్లా బేషక్ ఉండవలెను. అది యొక్క సానికీ లేపట్టు మొవాఫిక్ ఉండును. ఒక్క దానికీ తెలికపిండిలాగుండును, గావ్ గావ్?

సుంద—కీర్తన నాటకురంజి-మిశ్రచాపు.

సారిగా మాగామమగరిరిగారిసా నీనిసారీగా రిగరిసా ధానిసా సనినీధా
నిసారిగ మాగామమగరిగామాసామరీపా దానిసా సనినీదా

ఎన్నఁడునీసేవ! దొరకుననియున్నాను—ఇపుడుదొరకి
నందు, కానందింపుచున్నాను॥ ఎన్నఁడు॥
ఏదారినామీఁద నీదయయుదయించు నీదర్శనంబయ్యె
ఫాదుషామహారాజా॥ ఎన్న॥

సభా—సెబాసు సుందరీ! వహవ్వా! హహహహా! (నవ్వును)

సుంద—వేఁడుకలమీఁద వేఁడుకలగుచుమీ
దాడీచల్లగనుండఁ దగును మహాప్రభూ ॥ ఎన్న॥

సభా—ఇప్పుడు మామీఁద కవిత్వం కట్టించినావు! అచ్ఛా! మాదాడీచల్లగా నుండవలెనా? ఏక్ ముద్దు! ఏదీ! ఏక్ ముద్దు! మాదాడిపై తగిలించు?

సుంద—(దాడిని స్పృశించి చేతిని ముద్దిడుకొనును.)

సభా—అదికాదు—ఇది(సుందరిని ముద్దుపెట్టుకొనఁ బోవును)

(సుందరి దూరముగాఁ బోవును)

సభా—బస్ రంగాచారీ! మొకద్దమా కానీ?

రంగా—సాహెబూ! నీపేరేది?

శ్రీని—నాపేరు శ్రీనివాసరావు.

సభా—నీవు కాఫరువా? కాఫరుకి గడ్డమెందుకు?

శ్రీని—ప్రచ్ఛన్నతకొఱకు నేనిదిధరింపవలసివచ్చినది. (తీయును

కృష్ణ—(తనలో) అయ్యో! నామామగారు?

శ్రీని—ఈకృష్ణరావు నాయల్లుఁడు ఈతఁడు భార్యమొగము పండ్రెండేండ్లక్రిందఁ బెండ్లికాలమందుఁ జూచినాఁడు. అదిపెద్దదై నాలుగేండ్లు దాటినది. ఎందఱచేతఁ జెప్పించినను వినకవేశ్యాప్రియుఁడై



సొమ్మంతయుఁ దగులఁబెట్టినాఁడు. కొన్నిమాసములనుండి యీసుందరి నుంచుకొని యీమాన్యములు దానికి వ్రాసి యిచ్చినాఁడు. నేనన్నిసారులాతనిఁ జూడఁబ్రయత్నించినను నన్నుఁ జూచుట కంగీకరింపలేదు. ఇట్టిదారుణచర్యను జూడలేక యీవేషమును ధరించి, యాతనిఁ గొట్టి సుందరి నొక్క-పాడుదేవాలయములోని కీడ్చుకొనిపోయి, యీమాన్యములు నాకూఁతురుపేర వ్రాయించికొంటిని. ఈపనిలోఁదప్పున్నయెడల నన్ను శిక్షింపఁ గర్తలు. కూఁతురట్టి దుస్థితిలోనున్న యేతండ్రి యిట్లు చేయకుండునో సర్కారువారు ఫర్మాయింతురుగాక?

సభా—శ్రీనివాసరావూ! బలేపనిచేసినావు. ఆదస్తావేజు మేము ఖాయపఱచినాము. సర్కారుముద్ర దానిపై రంగాచారీ! తగిలించు. కృష్ణరావూ! సిగ్గులేదా? పందమందిసానులనుంచుకో-మాఖుషీ. లోకానికి మంచిది. కాని కట్టుకొన్న పెండ్లామును ఛోడ్నా నామర్దా. ఇది యదికూడ సంబాలించుకొనవలెను. మేము నీలాగే చేయుచున్నామా?

కృష్ణ—సర్కార్! నాకు సిగ్గువచ్చినది. బుద్ధివచ్చినది. నాభార్యను నేనుదెచ్చుకొనుటకు సిద్ధముగా నున్నాను. మామగారూ! క్షమింపుఁడు. నమస్కారము.

సుబ్బ—(అప) అమ్మా! రుక్మిణీ! నేను నీయింటిలోఁ దురకవేసమున రాత్రి ప్రవేశించినప్పుడు నన్నుఁ జూచి నాయనా! ఈతొట్రుపాటేల యని యంటివి. నన్ను నీతండ్రిగారనుకొంటివా?

రుక్మి—(అప) అవును. ఆయనకొఱకే తలుపు తీసికొని నిరీక్షించి యుంటిని.

సుంద—సర్కార్-ఈకృష్ణరావు దొంగ—భార్యనుదెచ్చుకొందునని మీతోఁ జెప్పినాఁడుకదా? అప్పుడే యదిగో అమ్మవారంతసానిని సిద్ధపఱచి యున్నాఁడు-దానికే సెట్టిగారికంఠమాల నిచ్చినాఁడు.

నబా—కృష్ణారావూ! ఆసానిని నీవుంచుకొంటివా?

కృష్ణ—ఉంచుకొంటిని. కాని నాభార్యను నేను దెచ్చుకొనుట కామె యభ్యంతర మెంతమాత్రము లేదు సరికదా, ఆమె ప్రోత్సాహముచేతనే నేను దెచ్చుకొనుట కంగీకరించినాను. ఆమె నాకు నీతిని బోధించి సన్మార్గమునకుఁ ద్రిప్పినది.

నబా—ఏదీ! మామొగముమీఁద దానినడుగు?

కృష్ణ—భారతీ! నాభార్యను నేనుదెచ్చుకొనుట నీకిష్టమేనా?

రుక్మి—నేను వేశ్యనని మీకనుమాన మక్కఱలేదు—త్రికరణశుద్ధిగా మీధర్మపత్నిని మీరు పరిగ్రహింపవచ్చును.

నబా—బస్—కృష్ణారావూ! నీవిప్పుడేపోయి నీభార్యను దెచ్చుకొనిరా?

కృష్ణ—చిత్తము. ఇచ్చటకు దూరముననున్న గ్రామములోనున్నది. నాల్గుదినములు వాయిదా దయచేయవలయును?

నబా—దియా. దియా, జా—రంగాచారీ! మిగిలిన మొకద్దమావిచారణ కయిదుదినములు వాయిదా ఫర్మాయించినాము. కచ్చేరీ బర్ఖాస్త్.

శ్రీని—సర్కార్—ఒక్కమనవి. కృష్ణరావెక్కడికో పోనక్కఱలేదు. ఆమెయే నాకూఁతురు. కృష్ణరావుభార్య—ఆమెను నాతోఁగూడ నీగ్రామమునకుఁ దీసికొనివచ్చినాను. ఏదోయొకమార్గముగా భార్యాభర్తలను గలుపుటకు దానినక్కడకుఁ దేవలసివచ్చినది. నాప్రయత్న మావశ్యము లేకుండ భగవంతుఁడే వారిని దారసింపఁ జేసినాఁడు.

కృష్ణ—హాహాహా! ఏమి నాయదృష్టము—చాయిల్లాలే—నా ధర్మపత్నియే! మామగారూ! ఇదివఱకెంత వేశ్యాదాసుఁడనో యిప్పుడంతకంటె భార్యాదాసుఁడను. క్షమింపవలయును. (మ్రొక్కును)



నబా—అంధాక్యారేతూ. మంకూహాకి, అంగులాడికి తేడా తీయలేని నీవు వేపారియింట కైసా పైదాహువారే. నామర్ద్—అహమక్—సాహేబ్—ఉస్కా బజా?

భటు—బుద్ధిలేదు? సానియేదో భార్యయేదో యెఱుఁగవా? (కొట్టును)

సుబ్బి—(అవ-కృష్ణారావుతో) అంతే కావలెను. అంతే కావలెను. నన్నుఁ గొట్టితివో, వడ్డితో సాహేబుచేఁ దింటివో; ఇంతే కాదా సంబరాలు. ఈమాత్రపు భాగ్యాలకీ తెగనీలు గెంతులకు?

నబా—అవ్వుర్ బజావ్?

భటు—(తిరుగఁగొట్టును)

కృష్ణ—సర్కార్—మీరునన్నుఁ గొట్టించిన సరే; నశిక్షించిన సరే; కాని యీమహానందపారవశ్యమున నాకీదెబ్బ లేమియు నాటవు.

నబా—సాహెబ్—ఈజోడీకి కేటాయించు. (భటు డట్లుచేయును) అరేరేరే-యెః క్యారే రంగాచారీ! యెః క్యారే ఒబ్లే తక్ హంనేఖ్ నహి. ఇది మగదా. ఆఁడువాఁడా? అరరే! దగ్గఱకు లాగించు. వహవ్వా- బురాఖ్ బొమ్మ బలే గోవుల్కి కష్టా యేమి? సాహేబుకి దాడీయేమి? యెః ఇఙ సాఙ యాస్తే తాఙ - అరరే, నెత్తిమీఁదముసుఁగు మూఁతిమీఁద మీసము, వహవ్వా, బీబీసాహెబ్! సలామ్, వహవ్వాదాడీముండ. సలాము లేక్ రంగాచారి! పూఛో?

రంగా—అమ్మా! నీపేరేది. నీకు దెలిసిన సంగతులేవో చెప్పు?

సుబ్బ—నాపేరు సుబ్బలక్ష్మి.

నబా—క్యారే, క్యారే సుబాల్ కిమీ.

రంగ—సుబ్బలక్ష్మి.

నబా—సుబాల్ ఖిమా? ధూ-ధూ-కైసానామ్ రే!

రక్ష, భ—నబాబ్ సర్కార్! తన పేరు పార్వతమ్మయని యీమె నాతోఁ జెప్పినది.

నబా—రంగాచారీ! ఉస్కా పూఛోరే?

రంగ—సుబ్బలక్ష్మీ! నీసంగతులన్నియు దాఁచకుండఁ బ్రమాణముమీఁద సర్కారువారితో మనవి చేసికో?

సుబ్బ—చెప్పవలసిన సంగతు లేవియు లేవు-

నబా—లేవా? ఝూటీబాత్, ఇంటిలో బైఠాయించి దూది లాగిలాగి బత్తిబనాయించు బస్మన్ రాండీకి మొహరమ్ పండుగలో ముండాసాహెబు వేస సుందుకోసరము? గులామ్! ఉస్కాబజా?

రంగ—సర్కార్, ఆఁడుదానికి దెబ్బలశిక్ష లేదని ఖాయిదా యున్నది. రక్షింపవలెను.

నబా—గోషామే కూర్చున్నదియాఁడుది. కాని గడ్డము తగిలించుకొని కాలికొలఁది గాడిదెలాగున దిరిగినది యాఁడుదిచే?

రంగ—సర్కార్! ఖానూన్ గౌరవింపఁదగును.

రక్ష—పేటలోనున్న చిన్న రక్షకభటాలయములో సుబ్బలక్ష్మియనుపేరుగల యామె యొకతె యున్నదని యీయాలయాధికారి యీసాయంకాలమే నాకుఁ దెలియఁబఱచినాఁడు.

నబా—ఉస్కా బులా?

రక్ష—సాహెబూ! నీవు పోయి తీసికొనిరా? (భటుఁడునిష్క్రమించును.)

నబా—సుందరీ! మొకద్దమా విచారణ ఖడాయించినది. ఫిర్ గానాబజా? ఏదీ మామీఁద థోడా అభినయము తగిలించు?

సుంద—వెనుకంగుచేయువాఁ డున్నఁగాని యభినయమునకు వీలుండదు.



నబా—పేషారీవండత్—సుందరికి వెనుక తరఫ్ హాంగుబజా? అరే! కృష్ణరావు! అరే!

కృ—నబాబ్ సర్కార్! క్షమించుఁడు. నాచేతఁగాదు.

నబా—అరే బుద్ధిలేదు. తూ చావల్ ఖరాబ్. ధూ. ధూ? రంగాచారీ! ఉఠోరే. పగడి బల్లపై రఖాయించి హాంగుబజానే కేఆరే

రంగా—జీ సర్కార్! మేజువాణి గడబిడ జరూరు లేదని మొదట సెలవిచ్చియు నిప్పుడి ట్లాజ్ఞాపించుచున్నారు?

నబా—ఘుస్సాహూ హామారీ. అవ్. ఖలంవదలి తాళపుచిప్పపట్టో?

రంగా—నబాబ్ సర్కార్! పర్వర్దిగార్ క్షమింపవలెను.

నబా—నౌకరీ బర్త్రఫ్. ఖబర్దార్. నాచీకి వెనుక హాంగుకు తాఖత్ లేనివాఁడవు నబాబుసర్కారులో ముస్షికి కైసీ తాఖత్. ధూ. ధూ. జల్దీ జా?

రంగ—తప్పు క్షమింపవలయును. (అంగుచేయును.)

నబా—అవ్. నౌకరీ తమామ్. నబాబుసర్కార్. ఖుషీకో షరము.

రంగ—సుందరీ! చిప్పతాళము లిటుదే?

సుంద—(రొండినుండి తీసియిచ్చుచు) సుతి యవసర మున్నది. అది యెవరు వేయుదురు?

రంగ—సర్కార్. సెట్టి సుతివేయఁగలఁడు. ఊఁయనుటయే కాని యంతకంటె నేమియు లేదు.

నబా—అరే బఖాల్! ఊఁ బోలేరే?

సుబ్బి—(అప) రంగన్నగారూ! నాకొంప తీసెదరా?

రంగ—(అప) ఇంత మొకద్దమా కైదురూపాయ లిచ్చెదవా?

నబా—సెట్టీ! జల్దీ 'ఊఁ' బజా?

సుబ్బి—ఊఁ (బొంగుగా నఱచును)

నబా—అరెరే. సెట్టీ! మెండూక్ లాగున బెకబెక కర్తారే? ఛూ. ఛూ.

సుబ్బి—ఊఁ (గట్టిగా నఱచును)

రంగ—సెట్టీ! సన్నము. సన్నము.

సుబ్బి—మూకు సన్నాతేలాగున వచ్చును. కుంచమంత కంఠమయ్యెను. గూనయంత కడుపయ్యెను.

నబా—రంగాచారీ! సెట్టి నెత్తిమీఁద చిప్పతో బజాయించు?

రంగ—(సెట్టి నెత్తిమీఁదఁ గొట్టును) (అవ) ఏఁబదిరూపాయలిచ్చెదవా? ఇంకొకటి కొట్టనా?

సుబ్బి—(అవ) గట్టిగాఁ గొట్టకు, పదునాలురూపాయలకు పైసలు: ఇఁక మాటలాడకు—(ప్రకాశముగా) ఊఁ.

నబా—అదేమి. అదేమి. నక్కలాగు ఊఁకర్తా-రంగాచార్! మార్, ఏక్ దఫా మార్?

రంగ—సర్కార్! సెట్టిపలనఁగాదు.

నబా—సాహెబ్! తూ ఆ- ఇదరా?

[సాహెబు సోమావధానితోఁ బ్రవేశించును]

సాహే—వచ్చుచున్నాను. సర్కార్, ఇదియే సుబ్బలక్ష్మి.

నబా—హాహాహా! క్యారే! ఇది ఖుస్సా. కొజావాఁడు; హాహా, దగ్గఱకు లాగించు (భటుఁడు సోమావధానులను దగ్గఱఁ బెట్టును)

హాహా! ముసుగుఁబట్టి యాఁడుది. మొగముఁ బట్టి మొగవాఁడు, హెహె.

సోమా—నేను మగవాఁడను (ముసుఁగు దీసి) ఇదిగో! గోష్పాదమంత జుట్టు, గోపులపంచె ప్రారబ్ధము వేంకటశాస్త్రుల మూలమునఁ గలిగినది.



రంగ—అయ్యా! నీపేరేది? మీకుఁ దెలిసిన సంగతులేవో ప్రమాణముమీఁదఁ జెప్పవలయును?

సుబ్బ—(అవ) బావా! నేను సుబ్బలక్ష్మిని; నాగతియిట్టులైనది; అక్క బంగారమ్మ కనఁబడినదా?

సోమా—(తనలో) నాకు మతిపోవుటకు నీవు తిరుగ నిక్కడకు దాఁపురించితివా? నిన్నుఁ దప్పించుకొనుటకే నేను గారాబంధము నుండి పాఱిపోవలసివచ్చినది.

రంగ—అయ్యో! చెప్పవేమి?

సోమా—నాపేరు సోమావధానులు. నేను బిచ్చిముండకొడుకనని నన్ను బంధించినారు. నేను శుద్ధకర్మయోగిని. ఇదిగో! యీరండాసాహేబు నన్ను బావాబావాయని పరిహాస మొనర్చినాఁడు. వేంకటశాస్త్రి యిచ్చిన గోపులపంచెకట్టుకొని పాఱిపోయితిని. నాపేరు సుబ్బలక్ష్మియని చెప్పఁగా నన్ను దిరుగఁ గారాగృహమందుంచిరి, ఇది నా భవిష్యద్వృత్తాంతము.

సుబ్బ—బావా! బావా! నిజముగా నేను సుబ్బలక్ష్మిని—గడ్డము కొంతబిగిసియుండుటచేత నామాట నాతఁడు బాగుగా నానవాలు పట్టలేకుండనున్నాఁడు. మహాప్రభూ! నాగడ్డము తీయించుఁడు?

నబా—కృష్ణారావు-సుబాల్ కిమికిగడ్డములాగివేయి? జల్దీదిఖావు (కృష్ణారావు తీసివేయును)

సుబ్బ—బావా! బావా! నేను సుబ్బలక్ష్మిని.

సోమా—నాకుఁ జూపు తిన్నగా నానదు. అందులో రాత్రివేళఁ జెప్పవలసినదేమి? దగ్గఱకు రమ్ము-అయ్యో! అయ్యో! అయ్యో! సుబ్బలక్ష్మివే? నాభార్యతోఁబుట్టినదానవే?

సుబ్బ—(అవ) ఔను బావా! నాలాగే గోపులపంచెకట్టుకొంటివేమి? నాలాగే ముసుఁగు వేసికొంటివేమి?

సోమా—(నుదుటిమీఁద గీత యని సంజ్ఞచేయును)

సబా—సుబాల్ కిమీ! నీకు వీఁడు బావా? నీగడ్డమొక దఫాయతనికిఁదగిలించు; ఊఁ కాని, వక్ నకో. తగిలించుమనగాను—థూ! థూ!

సుబ్బ—(గడ్డముతగిలించుచు) నాకుఁ జాకిరేవులో బలాత్కారముగాముసుఁగిప్పించినందులకు నీకు సాహేబుగారిసభలో నేను గడ్డ మిప్పించుచున్నాను. (గడ్డము తగిలించును)

సోమా—సబాబుగారూ! కర్మప్రధానుఁడను, బ్రాహ్మణ్ణి. నితంతువునయిరయే యేడ్చుచున్నాను. గడ్డమొకటి దగిలించి నాగంగాభాగీరథీత్వముఁ గూడ గాడిదవాలకముచేయుంచుట న్యాయముకాదు.

సబా—అరే, శాస్త్రీ! భార్యయంటివి. నీభార్య యెచ్చట నున్నది?

సోమా—నాభార్యయు సుబ్బలక్ష్మియు నీగ్రామములో నేతప్పి పోయినారు. సుబ్బలక్ష్మి మాత్రము దొరికినది.

(బంగారమ్మ వేంకటశాస్త్రి, వాతాపిశాస్త్రి ప్రవేశింతురు)

భటు—సర్కార్! బంగారమ్మదొరికినది. ఈమె బంగారమ్మయు వేంకటశాస్త్రి మూలమున మాకుఁ దెలిసినది. వాతాపిశాస్త్రి బంగారమ్మతోఁ గూడ వచ్చినాఁడు.

సబా—బస్-బస్-దేఖేంగె-(హుక్కా పీల్చును)

సుబ్బ—అక్కా! బంగారమ్మా! బాగుగా నున్నావా?

బంగా—అమ్మా! సుబ్బలక్ష్మీ! నిన్నెన్నాళ్ళకుఁ జూచితినే?

సుబ్బ—ఇదిగో! బావ—గోవులవంచెకట్టుకొని గడ్డము పెట్టుకొని యున్నాఁడు.

బంగా—అయ్యయ్యో! అదేమి! అదేమీ! ఇదిగో! ఓ! మాటలాడరేమి?



సోమా—వేంకటశాస్త్రీ! నీవు గోవులవంచె కట్టించినావు. సబాబుగారు గడ్డము దయచేయించినారు. ఆహితాగ్నియైన గృహమేధి ప్రతి కీలాగునైనది.

వేంక—అయ్యా! గృహమేధి యని సెలవీయఁదగును.

బంగా—ఇదిగో! ఓ! ఇదిగో! ఓ! ఈవేషమేమిటి?

సోమా—వేంకటశాస్త్రీ! నాతో మాటలాడవలదని దానితోఁ జెప్పు? దానికి నేను లేను; నాకది లేదు. ఘటశ్రాద్ధపూర్తి యయినది. కర్మము యథావిధిగ నడిపింపవలయును.

బంగా—అయ్యో! అయ్యో! ఘటశ్రాద్ధమేమి?

రంగా—ఊరకుండుఁడు; మీలోమీరట్లు మాటలాడుకొనఁదగదు. సర్కార్! అడుగుమని సెలవా?

సబా—బేషక్.

రంగా—బంగారమ్మా! ఈసోమావధానులు నీకుభర్తయేనా?

బంగా—ఔను.

రంగా—నీకింకఁ దెలిసిన సంగతులేవో చెప్పు?

బంగా—వాతాపిశాస్త్రీ! నీవు చెప్పుము. నేను సందర్భముగాఁ జెప్పలేను.

వాతా—ఈబంగారమ్మ యీగ్రామములో దారితప్పి పోయెను. ఒకబండివానిని కుదుర్చుకొని వానిబండి యెక్కెను. వాఁడు మాయూరివాఁడు; వానికిఁ జెవుడు; బంగారమ్మ చెప్పినదేదో తెలియక యాతఁడీమెను మాయూరి చెఱువుగట్టునొద్ద దింపెను. స్నానమునకుఁ బోయిన నేనీమె నానవాలుపట్టి యింటికిఁ దెచ్చితిని. మేమిద్దఱ మక్కసెల్లెండ్ర బిడ్డలము; వెంటనే యీమె నిక్కడకుఁ దీసికొని రావలసినదే కాని యీమెకు నాల్గుదినములు విశేష జ్వరముచేత నొడలే తెలియలేదు. ఉత్తరము వ్రాయుట కీగ్రామమున పేరిబనయేదో

తెలియదు. ఆమె నీగ్రామములోనికిఁ దీసికొనివచ్చి బస వెదకుచుండఁగా యాదృచ్ఛికముగా వేంకటశాస్త్రికనఁబడి బంగారమ్మా! బంగారమ్మా! యని గట్టిగఁ గేకవైచెను. వెంటనే రక్షకభటుఁ డీమెను బట్టుకొని యిచ్చుటకుఁ దెచ్చెను. కూడ మేము వచ్చితిమి.

సుబ్బ—అన్నయ్యా! వాతాపీ! నీమూలమున బ్రతికితిమి.

వాతా—సుబ్బలక్ష్మీ! సుఖముగా నున్నావా?

సుబ్బ—సుఖమేదో చూచుచునే యున్నావుకదా?

నబా—రంగాచారీ! బంగారమ్మను సోమావధానికి జోడాయించు?

సోమా—నబాబుగారూ! నాకామె యక్కఱలేదు. శాస్త్రములోఁ జెప్పినకర్మమేదో చేసికొన్నాను. ఇఁక నామెకు యథావిధిగా మాసికములు తద్దినములు పెట్టవలసినవాఁడనుగాని మఱియొకటి కాను.

నబా—బ్రతికియున్నప్పుడు తద్దినమెందుకు?

సోమ—అదిమీకుఁ దెలిసినవిషయము కాదు. మాకర్మశాస్త్ర మందుల కంగీకరించినది కొండు.

నబా—మీశాస్త్రము తీసికొని దర్యామే డాలో—థూథూ! బుద్ధిలేదా? బ్రతికియున్నదానికి తద్దినమా? ఇందుకోసరమే కనఁబడిన బమన్ గల్లా సాఫ్ నఱికివేయుమని మహమ్మదు పైగంబరుగారి—సల్లల్లాహో అలేహి వసల్లమ్—హుకుమయినది. థూథూ! నీదియొక్కమతమా! గోవుపేడ గోవునీరుకలిపి గులాబ్ షర్బత్ లాగు గుడుగుడు త్రాగివేసిన బమ్మనులకు మతమా? థూథూ.—మీఖారార్ మాకు కౌడీబరాబర్, మాశాస్త్రాల ప్రకారము మేము తీర్పు ఫర్మాయించినాము. నీకది భార్య.

సోమా—కర్మము నిప్పారిముల్లంతయయిన దాటినవాఁడను గాను. నాకామె యక్కఱలేదు.



నబా—సాహెబ్—ఉస్కూబజా?

సాహే—(సోమావధానిని గొట్టును)

సోమా—శివోహామ్, శివోహామ్.

నబా—ఫిర్ మారో—ఫిర్ మారో?

సాహే—(కొట్టును)

సోమా—సోహం. సోహం.

వేంక—నబాబ్ సర్కార్! క్షమింపుఁడు; పెద్దబ్రాహ్మణుఁడు; శుద్ధఛాందసుఁడు; తెలియనివాఁడు; బంగారమ్మ నంగీకరించునట్లు మేము చెప్పెదము.

నబా—మీరు చెప్పవలెనా? మేము చెప్పినతరువాత?

సోమా—నబాబుగారూ! మీకొఱకు—విన్నారా—మీకొఱకు మాత్రమే—ఆమెను భార్యగా నంగీకరించితిని. కర్మముకొఱకు మాత్రము కాదు.

నబా—థూథూ! రంగాచారీ! వారిద్దఱను జోడించు?

రంగా—సోమావధానీ! బంగారమ్మా! మీరిద్దఱు దగ్గఱగా నుండుఁడు?

నబా—అటులైన నిజమైన పిచ్చివాఁడేఁడీ?

భటు—వెలుపల నెవ్వరో యిద్దఱు కూరుచున్నారు—లోపలికి వచ్చెదమని చెప్పినను స్థలములేనికారణమున రానీయలేదు.

నబా—రమ్మని చెప్పు—

(భటుఁడు నిష్క్రమించును)

[శంకరశాస్త్రియు రామశాస్త్రియుఁ బ్రవేశింతురు]

శంక—నబాబ్ సర్కార్! ఈరామశాస్త్రులు రెండుదినముల క్రిందటివఱకుఁ బిచ్చివాఁడు. నే నీతనిని మాయింటికిఁ దీసికొనిపోయి యున్మాదరోగమును నూతనవిద్యుద్వైద్యమాహాత్మ్యముచే నివారణ

చేసితిని. పిచ్చివాని నింటవాఁచుకొన్న వానియిండ్లను, భూములను సర్కారువారు జప్తిచేయుదురని దండోరామూలముగా విన్నవాఁడ నగుటచేత నీతనిని హాజరుపెట్టితిని.

నవా---రామశాస్త్రీ! నీకుఁ బిచ్చి కుదిరినదా ?

రామ---దైవ కటాక్షమునను శంకరశాస్త్రి వైద్యమాహాత్మ్యమునను బూర్ణారోగ్యవంతుఁడనై యున్నాను.

వాతా---సోమావధానీ! రామశాస్త్రివంకఁ జూడు; అయ్యయ్యో! ఆతఁడు మనసుబ్బలక్ష్మిమగఁడు ?

రంగా---అయ్యయ్యో! ఔనమ్మా! ఔనమ్మా! రామశాస్త్రులూ! నాతండ్రీ! వచ్చినావా? సుబ్బలక్ష్మీ! నీపుణ్యమమ్మా? నీభాగ్యమమ్మా? మీ బావగారు నీపసుపు, కుంకుమ మాపి, నిన్ను మంగలి చేతిలోఁ బెట్టి, మూలఁ గూరుచుండఁ బెట్టినను భగవంతుఁడు నిన్నుఁ బైకిఁ దెచ్చినాఁడమ్మా! మా అమ్మా! మగనియెదుట నింకమునుఁగెందుకమ్మా? సొంతమగఁడెదుట నుండఁగా నింక ముసుఁగువైచుకొనుట ఓగాత్యమమ్మా?

సుబ్బ---(అక్క) అక్కా ఈముసుఁగు తీసివైచినయెడల మఱింత నవ్వులాటగా నుండదా? (తనలో) ఆహా! కోమటి యింటిలోఁగనఁబడిన వెఱ్ఱిశాస్త్రి లేనా నామగఁడు?

నవా---హాహా! రామశాస్త్రి సుబాల్ఖమి మగఁడా ?

వాతా---సర్కార్!---అవును.

నవా---దీనికి మగఁడుండఁగా బోడితలకు క్యాసబబ్?

సోమా---ఇతఁడు నవద్వీపమునకుఁ బోయి పండ్రెండు సంవత్సరములవఱకుఁ రాకపోవుటఁ జూచి దాని బావగారినైన నేను విధివిరోధముగాఁ దలవెండ్రుకలు దీయించినాను.

వేంక---విధివిధేయముగాఁనని చెప్పవయ్యా?



నవా---అరెరే బ్రతికియున్న భార్యకు తద్దినము బనాయించినావు! మగఁడున్న మెఱఁదలు బుఱ్ఱకు హజామద్ చేయించినావు! తూఇక్ సాన్ యాజన్వర్ గులామ్ ఫిర్ ఉస్కా మారో?

భటుఁడు---(సోమావధానిని గొట్టును)

సోమా---శివోహం-శివోహం-నవాబుగారూ! మఱఁదలకు మంగళసూత్రమండనముచేయుట యందేమి, బ్రతికియున్న భార్యకుఁ బిండప్రదానము చేయుటయందేమి, నేను ఋషులు నివర్తించినట్లు నివర్తించినవాఁడనే కాని---

వేంక---ప్రజలపై దైవకటాక్ష మెన్నఁడైన వచ్చినప్పుడే మీ వాగ్దోషములు శాంతింప వలయునుఁగాని మనుష్యప్రయత్నమున మాత్రమట్లు జరుగనేరదు.

రామ---అన్నగారూ! నమస్కారము. మీరట్లు వికృతవేషులై యున్నారేల?

సోమా---రామశాస్త్రీ! పూర్వాపరములన్నియు సావకాశముగా మాటలాడుకొందము. తల చెడినందులకు నీవు నీ భార్యను ముందుగాఁ బరామర్శింపుము?

రామ---తల చెఱచినందులకు మిమ్మభినందింప నక్కఱలేదా?

నవా---చుప్రహో--- రంగాచారీ--- ఆలస్యమైనది. ఇంకే మున్నది?

రంగా---సెట్టి కంఠమాలవ్యవహారము మాత్రమున్నది.

కృష్ణ---అది యాతనియొద్ద నేనడిగి తీసికొంటిని, సుందరిక నఁబడువఱకు నాయొద్ద హామీగా నుంచుకొందునని చెప్పితిని. సుందరికిచ్చిన నగలునాకక్కఱ లేదు. కంఠాభరణమును సెట్టికిప్పించుటకై సర్కారును బ్రార్థించుచున్నాము.

నవా---బస్. ఉస్కా దే.

రంగా—సెట్టీ! ఇదిగో నీకంఠాభరణము.

సుబ్బి—నబాబూగారూ! సలాములు. సలాములు.

నబా—రంగాచారీ! ఇంత మొకద్దమా మొదటి సబబ్ క్యా?

రంగా—ఏమున్నది? బంగారమ్మ, సుబ్బలక్ష్మి యాగ్రామమునఁ దప్పిపోవుట మొదటికారణ మని తోఁచుచున్నది.

నబా—థూ! థూ! అదికాదుజీ దానికి సబబ్. మొకద్దమాకి పహిలే సబబ్ కనిపెట్టవలసినది, అఖల్ మందీ.

రంగా—వారిద్దఱు తప్పిపోవుటకు సబబేమున్నది? సర్కసు చూచుట కిల్లు తప్పిపోయినారు.

నబా—బస్. బస్. ఇఁకనేమి? పహిలే సబబ్ సర్కస్. జవాన్! సర్కసువాలీకి పకడ్ కర్ కచ్చేరీకిలావ్? ఉస్కా బేషక్ మారుంగా?

రంగా—కడపటి యాట కానిచ్చుకొని వారు నాల్గుదినముల క్రిందటనే యెక్కడకో పోయినారు.

నబా—థూథూ. బస్ బస్ కచ్చేరీ బర్ ఖాస్త్.

శ్రీని—నబాబూగారూ! ఈ కాగితముమీఁద సర్కార్ ముద్ర వేయవలసియున్నది.

నబా—బస్—రంగాచారీ! కానీ. (రంగాచారి ముద్ర వేయును)

సుంద—నాకునవి యొక్కటి యున్నది. బంగారమ్మ సోమావధానులకు లభించినది. రామశాస్త్రికి సుబ్బలక్ష్మి లభించినది. వేపారి పంతులకు భార్య లభించినది. కోమటికిఁ గంఠమాల లభించినది. నాకు మాన్యములూడినవి. ఉంచుకొన్న మగఁడూడినాఁడు; న్యాయము దయచేయించి నన్ను రక్షింపవలయును.

నబా—మేము నిన్నుంచుకొన్నాము. రంగాచారీ! చిఠా చూచి మనకి జనానా యెంతమందియో నాచివాలీ యెంతమందియో బోలో?



రంగా—అఱువదియొక్కరు జనానావారు; మూఁడువందల పండ్రెండుగురు సానులు.

నబా—బస్. సుందరికి చిఠాలోఁ దగిలించు; దీనితో మూఁడు వందల పదమూఁడాయె? బలే పైనుండి మూఁడువందల పదమూఁడు; క్రింద నుండి మూఁడువందల పదమూఁడు; వహవ్వా! తీన్ సౌర్ యేక్ ఛార్ చార్ సౌర్ తీన్ సాత్; ఏడువచ్చినది! బలే జనానా అఱువది యొకటి; బస్ ఛెః సౌర్ ఏక్ సాత్ బస్. ఇక్కడ ఏడువచ్చినది. మనకు నిత్యము ఏడు; ఏడు. వహవ్వా! బస్! బస్! కచ్చేరీ బర్ ఖాస్త్ సుందరీ! హంకా పక్డో.

(నేపథ్యమున)

నబాబ్ సర్కార్. సయ్యద్ షామహమ్మద్ హామీదుద్దీన్ ఖాదర్ నాయబెరసూలిల్లాఖాన్ బహద్దర్ గంజే సవాయికిసాహేబ్ సలామతీ—కచ్చేరీబర్ఖాస్తు.

అందఱు—సలామ్ సలామ్. (నబాబు నిష్క్రమించును పరివారముతో)

సోమా—కృష్ణారావు! ఈగడ్డము తీసివేయుము?

(కృష్ణారావు తీసివేయును)

సోమా—నేనింక స్నానమే చేయలేదు. ఈదిక్కుమాలిన వేషముతో నిక్కడ నుండఁజాలను. వేంకటశాస్త్రీ! బండికుదుర్చుము పోవుదము.

బంగా—అన్నయ్యా! సుబ్బలక్ష్మికి రాత్రి ముహూర్తమున్న దేమో?

వాతా—అమ్మా! నామాటవినుఁడు. ముహూర్తమువలదు. యేమియువలదు. ఈరాత్రి విఘ్నేశ్వరపూజ కానిచ్చి యాయవశిష్టము తీర్పవచ్చును—దైవకటాక్షమున గలిగిన యీ సుఖసమావేశమే సుముహూర్తము.

సుబ్బ—(అవ) అక్కా! నాకు సిగ్గమ్మా—(బంగారమ్మ చాటునకుఁ బోవును.)

బంగా—(అవ) అయ్యో; వెఱ్ఱిదానా! సిగ్గెందులకమ్మా?—

సోమ—సుబ్బలక్ష్మీ! నీకీరాత్రి పునస్సంతానము కాకతప్పదు. సిగ్గుపడకు.

వేంక—పునస్సంతానము మీకేమో కాని యీమెకుమాత్రము పునస్సంధానమండీ—తథదధ...చతుర్థవర్ణము.

బంగా—సుబ్బలక్ష్మీ! మీబావగారు చెప్పినట్లు సిగ్గుపడకమ్మా—ఏమిచేయును? నాటకాలలో వేసాలవారు కట్టుకొందురే, ఆలాగున నీలిగుడ్డ నీతలకుఁ గట్టెదనమ్మా? దానిమీదనే నాగరము చేమంతిపూవు వేసెదనమ్మా?

సుబ్బి—అమ్మా! నీలిగుడ్డ కట్టుకొను నాచారము పూర్వపు వీధిభాగవతముల నాఁటిది. ఇప్పుడు నిక్షేపములాగున సవరాలబుట్టలు వచ్చుచున్నవి. నాయొద్ద సిద్ధముగా నున్నవి= పాతికమూర్తులు పంపుమనిసెలవా?

బంగా—పాతిక మాకెందులకు?

సుబ్బి—ఉండనిండు; తరువాత దొరకవు. పైనుండి సరకులు వచ్చుటలేదు. ఎందులకైన మంచిది. ఉంచుఁడు. సోమావధానిబాబుగారిని మాత్రము నమ్మియుండవలసినపనిలేదు. కన్నుమూసి తెఱచులోపల మఱెవ్వరిబుఱ్ఱ గొఱుగునో?

కృ—సుబ్బిసెట్టియే యందఱ కుపకార మొనర్చినాఁడు; నేనీతని కంఠాభరణమును దీసికొన్నప్పుడీతఁడారాత్రియే ఫిర్యాదుచేయక యూరకుండినచో మనమందఱ మిట్లు సభావేశమగుట సిద్ధించియుండదు. దెబ్బలు కొట్టినంతమాత్రముచేత ఫిర్యాదుచేసి యుండఁడు; కంఠా



భరణము దీసికొంటిని గాన వెంటనే యింతపని చేసినాఁడు. అతని కంఠాభరణమే మన యీవిచిత్రనాటకమునకుఁ గొంత ప్రధానమై యున్నది.

వేంక—నాకిక్కడనుండుట కసహ్యముగా నున్నది. పోదము రండు.

కృష్ణ—యూకుమాత్రమేమిపనియున్నది? అందఱు పోవచ్చును.

వేంక==సోమావధానులుగారూ! నాలుగైదు దినములక్రిందట నొకరాత్రి బ్రహ్మశ్రీలు గంగాభాగీరథీ సమానలైనసరే- గంగాభాగీరథీసమానలు సౌభాగ్యవతులయిన సరేయని యాదృచ్ఛికముగా మీరు పలికినారు. బ్రహ్మశ్రీలగుమీరు గంగాభాగీరథీ సమానులైనారు. గంగాభాగీరథీ సమానయైన సుబ్బలక్ష్మి సౌభాగ్యవతియైనది. కాని యిట్టిమార్పు మీఘటము వెడలిపోయిన తరువాత జరుగునని చెప్పినారు కాని జీవించియుండఁగనే యిట్లు జరిగినది.

సోమ—కర్మప్రధానులకన్న సంకల్పచ్ఛర్ది యనఁగానిదే?

వేంక—=సంకల్పసిద్ధియా? ఈదిక్కుమాలిన గ్రామ్యధోరణి మీకీఘటము తోడనే కాని వదలదు కాఁబోలు?

వేంక=—అయ్యా! ఈమాటలకేమి? మీరందఱు మాయింటికి రండు. ఈరాత్రి శుభముహూర్తమైన పిమ్మట తేపు భోజనముఁ జేసి పోవచ్చును?

సుబ్బి—పచ్చిపులుసు సుబ్బిసెట్టిగారికి బంగారమ్మగారిచేతి ప్రసాదమా? సుబ్బలక్ష్మిగారి ముహూర్తంపుబూరెలా? అబ్బో! అబ్బో! కృష్ణరావుపంతులూ! మీమామగారు మాటలాడకుండ నున్నారేమి?

కృష్ణ—ఆయన విశేషించి మాటలాడువారు కారు.

సుబ్బి—శ్రీనివాసరావు పంతులుగారూ! దండాలు! దండాలు!

శ్రీని—దీర్ఘాయుష్యమస్తు.

సుబ్బి—కృష్ణరావు పంతులుగారు మన కాఱువందల చిల్లర బాకీయున్నాఁడు; అది యేదో లేదనుపించుకొనిన మంచిది కాదా?

శ్రీని—ఆసొమ్ము నేను నీకొక్క గంటలో నిచ్చెదను.

సుబ్బి—చిత్తము బాబూ!

రంగ—శ్రీనివాసరావుగారూ! మీరతనికిచ్చినపుడు 45 రూపాయలు మినహాయించి మఱియుండు, నాకతఁడు బాకీయున్నాఁడు.

సుబ్బి—రంగన్నగారూ! చాలు లెండు. వేళాకోళములు చేయు నెడల బూరగాలు బావగారూ! యనవచ్చును; బుగ్గకు గంధము రాయ వచ్చును, అంతేకాని పైనదగ్గఱ పరిహాసాలాడాయనా! బాబూ శ్రీనివాసరావుగారూ! మీరు విదేశస్థులు కావున నెఱుఁగరు. రంగన్న గారికి మాకు దరతరములనుండి బావగారి పరిహాసములు.

రంగ—ఓరి జిత్తులమాఱిముండకొడుకా!

సుబ్బి—ఆలాగంటివి బాగుగా నున్నది. కొంచెము మోటయయిన పరిహాసములలోఁ జేరినది. అంతేకాని బాకీ సాకీలదగ్గఱ పరిహాసాలు ప్రాణములు తీయవఁటయ్యా?

రంగ—(అప) సరేకాని, పదునాలు రూపాయలకుఁ బైసలసిస్తి మీఁద దాళవుచిప్పతోఁ గొట్టినప్పుడు పలికితివికదా? మిగిలిన పదునొకండు రూపాయలనైన నిమ్ము?

సుబ్బి—(అప) బావగారూ! ఇప్పటికేమియు మాటలాడకుండు. తరువాతఁ జూచుకోవచ్చును.

రంగ—(అప) నీగొంతుకకోయ! తెచ్చిన కజ్జూరపుపండ్లు పొట్లమైన నీయవా?

సుబ్బి—(అప) ఇంక వెనుకటిమాటలనన్ని మఱచిపోవయ్యా? బావగారూ! మీకేమి మేమేమి? మాదగ్గఱ నున్నది మీదగ్గఱ నున్నట్లు కాదా?



రంగ—(అప) సరే. సరే. (ప్రకాశముగా) కృష్ణరావు పంతులుగారూ! శ్రీనివాసరావుపంతులుగారూ! మీవ్యవహారము లన్నియు ననుకూలముగా నయినవి.

కృష్ణ—ఆచార్యులుగారూ! మిమ్ము సంతోషపెట్టుదును లెండు. మనకుఁ గలిగిన కష్టములన్నియు మఱచిపోవఁదగినంత సుఖము దైవానుగ్రహమున లభించినది. ఇంక నిక్కడఁ గావలసినదేమున్నది?

రామ—ఏమియు లేదు. ఐన నిట్లు కావలయును.

గీ. ధరణి యీతిబాధలు లేక తనరుఁగాక
ప్రజల యన్యోన్యవైరముల్ బాయుఁగాక
కవిత రాజపోషణమునఁ గ్రాలుఁగాక
నీతిపాలనమున రాజు నెగడుఁగాక.

వాతా—తథాస్తు.

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది షష్ఠాంకముతో సర్వమును సమాప్తము.



# గ్రామోఫోనుహాస్యపుపాటలు.

వెల రు. 0-6-0.

వల్లూరి జగన్నాథరావుగారిచే రచియింపఁబడినది. ఇందుహాస్యరసమైన పాటలు, వింత వింత పాటలు. నవ్వుపుట్టించే పాటలు; అద్భుతమైన పాటలు, మీకు యేరకము పాటలు కావలయునన్నను నిందుఁ గలవు. ఇందు 32 ముప్పదిరెండు పాటలు గలవు. ఈపాట లచ్చటచ్చట గ్రామోఫోనులో పాడఁబడుచున్నవి. ఐదవకూర్పుకొలదిప్రతులు మాత్రమే గలవు. త్వరపడుడు.

# సంగీత విష్ణులీల.

వెల రు 1-0-0.

ఇది శ్రీహరి యవతారములు యంతయు నాటకముగావ్రాయఁబడినది. ఇందు మత్స్యావతారము, కూర్మావతారము, వరాహావతారము, నరసింహావతారము, వామనావతారము, పరశురామావతారము, రామావతారము, కృష్ణావతారము, బుద్ధావతారము తొమ్మిదవతారముల నాటకరాజము. ఏయే యవతారములందు యేయే పనులుచేసినది వివరముగ వ్రాయఁబడినది. ఈపుస్తకము అచ్చువేయుచుండఁగనే అనేక ఆర్డర్లు వచ్చియున్నవి. నేడే కార్డు వ్రాయుఁడు.

# కనకతారా నాటకము.

[గ్రంథకర్త చందాలకేశవదాసుగారు జగ్గయ్యపేట]

ఇందు కూర్రసేనుని దుండగములు, కమలాదేవియొక్క విచారము, తారాకనకసేనుల పరితాపము, పల్లెవానియొక్కహాస్యరస సంభాషణయు, కనకసేనయొక్కకోర్టు చాలా అద్భుతముగానుండును. ఈనాటకము అనేకచోట్ల ప్రదర్శించి యున్నారు. దీనిగురించి విశేషముగ వ్రాయఁబనిలేదు. చక్కనికీర్తనలతో నిండియుండెను. రు 1-4-0

వలయువారు, జనరల్ బుక్కుడిపో. బెజవాడ.

